శ్రీరస్తు.

# జైమినిభారతము.



పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవిచే

రచియింపఁబడినది.






పబ్లిషరు

కొండపల్లి వీరవెంకయ్య

రాజమండ్రి.

1928

—

వెల రు. 1—8—0

# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.



## తృతీయాశ్వాసము.

విషయము. పుట.



## చతుర్థాశ్వాసము.



## పంచమాశ్వాసము.

విషయము. | పుట.



షష్ఠాశ్వాసము.



సప్తమాశ్వాసము

విషయము. పుట.



## అష్టమాశ్వాసము.



శ్రీ

# జైమినిభారతము

ఆశ్వమేధపర్వము, పీఠిక.

---

## ఇష్టదేవతాస్తుతి.

శ్రీలావణ్యపయోనిధిత్రివళివీచీమధ్యరోమావళీ
వ్యాళానల్పసుఖైకతల్పుఁడు జగద్వ్యాపారలీలావతా
రాలంకారవిహారి శౌరి సదయుం డై సాళ్వగుండక్షమా
పాలాగ్రేసరనారసింహుని సదభ్రశ్రీయుతుం జేయుతన్. 1

చ. జడముడి జాహ్నవీపటనిశాకరపోతముఁ జూచి యెవ్వరీ
కొడిమలు గట్టి పెండ్లికొడుకుం గడియార్థము మోవఁజేసి రం
చనుఁగ వివాహవేదిపయి సంబిక నెచ్చెలిఁ జూచి నవ్వునా
మృడుఁడు నృసింహశౌరికి సమిజ్జయముల్ దయసేయుఁ గావుతన్.

మ. పలుకుందొయ్యలితోడికూటములు పెంపం దమ్మికూటంబులో
నలుమోముల్ సమకాలసౌఖ్యములఁ జెందన్ రామినొయ్యారపుం
బొలయల్కన్ ముఖమండలిన్ మలఁచునంభోజాసనుం డిచ్చుభూ
తలనాథాగ్రణి నారసింహునకు నిత్యం బైన దీర్ఘాయువున్. 3

మ. తొలుమొగ్గిక్కల్ గొనునేల్పుఁ గొల్తు శశభృత్కోటీరుఁ గోటీరట
త్కలభూషాంకితగాత్రు గాత్రిమరసంఘస్తోత్రి వేళా నిర

ర్గళ ధారాళ కట ప్రదానతటినీ రంగ ద్విరేఫాలికా
కలికాలోలవిచారుఁ జారుహరిభుగ్ర్కాలంబు లంబోదరున్. 4

సీ. ప్రణవపీఠమున మంత్రపరంపరలు గొల్వ
నుండు నేదేవి పేరోలగంబు
భావజ్ఞులకుఁ బరాపశ్యంతిమధ్యమా
వైఖరు లేదేవి వర్ణసరణి
జపహార కీర పుస్తక విపంచిసమంచితం
బు లేదేవి హస్తాంబుజములు
కుందేందుమందారకందలీబృందంబు
చంద మేదేవి యానందమూర్తి

తే. కాంచె నేదేవికాంచనగర్భచతుర,పూర్వదంతకవాటవిస్ఫుటమనోజ్ఞ
చంద్రికాంతశిరోగృహస్థలవిహార,మమ్మహాదేవివాగ్దేవినభినుతింతు

మ. కవులం బంకజగర్భసన్నిభుల వక్కాణింతు వల్మీకసం
భవునిన్ వ్యాసునిఁగాళిదాసుబిలహర్ణున్ బాణున్ మయూరున్ శుకున్
భవభూతిన్ శివభద్రు మల్హణుని ఘంటామాఘులిం జోరు భా
రవి మానన్నయభట్టుఁ దిక్కకవి నేతాపెద్దనన్ సోమునిన్. 6

క. అని యిష్టదేవతాప్రా, ర్థనముల నాదిసుకవివినుతముల్ గావిం
చి నిలిచి పెల్లగున్లుం, బునందు నేనొకపురాణముం జెప్పంగన్.

క. ఉద్యోగించి సుకవిజన, హృద్యంబునునాద్యము మఱియితిహాసానే
కద్యోతితపద్యానై, శద్యుఁజైనదియుగాఁ విచారించి తగన్. 8

క. స్తుత్యముఁ గలికల్మషరా, హిత్యము నాఖ్యాయికావిహితబీజచతు
స్సీత్యము శ్రీహరికథలను, నిత్యంబును నైనజైమినిజభారతమున్

శా. జంబూద్వీపములోన నెంతయుఁ బ్రశస్తంబైనదీని స్నట
ద్దంభాకుండలజూటకోటరకుటీధృతస్వర్ధునీవీచికా
లంబిస్విన్నవేందుకందసుధాలంకారివాగ్వైఖరిన్
జంబూకావ్యము చేసెదన్ బుధజనశ్లాఘాని రాఘాటతన్. 10

క. సాళువ నరసింగమహీ, పాలుని సత్యంతఘనకృపాలుని ననుహ్రా
త్పాలితనగరీపశ్య, త్పాలుని నాచేయుకృతికిఁ బతిఁ గావింతున్.

వ. అని ప్రబంధంబుఁ జెప్ప నుద్యోగించుసమయంబున.

ఉ. భారతవంశ మండనుఁడు పాండవ గాండివముక్త బాణసం
భార తత ప్రభావ నుతిపారగుఁ డంచిత గో మహీ తులా
భార తదంగ దాన పరిపాక సమగ్ర యశోవిలాస శో
భారతశాలి గుండనరపాలనృసింహుఁడు గహ్వరీ స్థలిన్. 13

సీ. తనభుజాపరిఘచేత ధరావరారోహ
భరియించి బర్బరబాహుఁ డయ్యెఁ
దనప్రతాపంబుచేత దిగంతరంబుల
దీపించి యంబ రాదిత్యుఁ డయ్యెఁ
దనదానగరిమచేత సురాగముల పెంపు
దండించి మొనరగండఁ డయ్యెఁ
దనమహత్త్వంబుచేతఁ బురాణపురుషుని
మఱపించి చౌహత్తమల్లుఁ డయ్యె

తే. రాజమాత్రుండె ధరణీవరాహబిరుద,
వర్ణ ఫలకాయమానము ర్వారగర్వ
త్రాహితోర్వీశవిపులదోరంతరుండు,
సాళ్వగుండయనరసింగజననిభుండు. 14

వ. ఆరాజపరమేశ్వరుం డొక్కనాఁడు కురు కుకుర కరూశ శక మగధ మరాటలాట భోట గాంధారాది సింధుపరివేష్టిత వసుంధరాగ మణికిరీట మణిగణ కిరణజాల బాలాతపస్మేర రంజిత తరుణచరణా రవిందుండును లీలావతీ కరకిసల యాందోల చమరవాల చామర సమీర చలితాంతకుంతలుండును నాయికామధురగానతానమాన బిరుద ప్రపంచసంచితానంద కందళితమందస్మిత వికసద్గండమం

డలుండును, సభాభవనాభినవ రత్నస్తంభదర్పణ ప్రతిబింబితమనో హరాకారుండును నైయర్హాసన సమాసన్నరాజన్యశిరఃప్రసవవాస నాముద్రితం బైనభద్రాసనంబునం బేరోలగం బుండి పురాణేతి హాసకథా ప్రసంగంబుల వినోదించుచు. 15

ఉ. ఆదట సప్తసంతతులయందును నొక్కొకకాలమందు వి
చ్ఛేదము గల్గు నాఁటిటికిఁ జెప్ప విపర్యయ మేయుగంబునన్
లేదు కవిత్వసంతతికి నిక్కము తత్కవితావిలాసముల్
జాదులు నిష్టదైవము ప్రసాదము నొహరికీర్తనంబునన్. 16

క. నామది నిరతము భారత, రామాయణకథలఁ బ్రేమ రంజిలునందున్
జైమినిభారత మనఁగా, భూమి నపూర్వము పురాణములగణింపన్

తే. ఆపురాణంబు గనఁ దేనెఁ గమ్యోనేని
జెప్ప నేర్చినకవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ
దేనెఁగు నుడికారమునమించు గనియెనేనిఁ
గుందనము కమ్మవలచినచంద మగును. 17

వ. అని సభాసదుల మొగంబులు చూడ నవధరించిన నారాజసత్తము చిత్తంబెఱింగి వారిట్లని విన్నవించిరి. 18

—కవివంశ ప్రశంస—

క. ఏరీతి నెఱిఁగెనో పిన, వీరనదేవరతలంపు విఖ్యాతముగాఁ
బేరును బెట్టెదియును దన, పేరుగ రచియింపఁబూనెఁ బేశలఫణితిన్.

క. తాతయుఁ దండ్రియు నగ్ర,
భ్రాతయునుం దాను భువనభాసురకృతి ని
ర్మాతలు పిల్లలమఱివి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరే సుకవుల్. 21

సీ. అమృతాంశుమండలం బాలవాలముగాఁగ
మొలిచె నొక్కటి జగన్మోహనముగఁ

జిగిరించె విలయసింధుగతకై తవడింభ
శయనీయవరపలాశమ్ములతోడఁ
బితృదేవతలకు నంచితసత్త్రశాల యై
చెట్టు గట్టెను గయాక్షేత్రసీమ
నిలువ నీడయ్యె నిందీవరప్రియకళా
కోటీరునకు భోగికుండలునకు

తే. మఱ్ఱిమాత్రంబె పిల్లమఱ్ఱి పేరు
పేరుపలెఁ గాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరువాక్యసరణి
సరసులకు నెన్నఁగర్ణరసాయనంబు. 22

క. అని విన్నపంబు చేసిన
ననుఁ గనుఁగొని యలరి నాధనంబు ఋణముగాఁ
దినక యుపార్జించె యశో
ధనమిటు గావలదె యాశ్రితత్వం బనుచున్. 23

క. దరహాసరసముఁ దాంబూ
లరసముఁ గప్పురపుఁబలుకులం గుంకుపూ .
బెరసినగతిఁ దోఁపఁగ సా
దరమున నిట్లనియె భారతజ్ఞులతోడన్. 24

ఉ. అల్లనవిచ్చుచెంగలువలందు రజం బనుకప్పురంబుపైఁ
జల్లఁగఁ జల్లనై వలచుసౌరభముల్ వెదజల్లు భావముల్
పల్లవహస్తచన్నుఁ గవపయ్యెద జీబుగఁ దోఁచుభాతిగాఁ
బిల్లలమఱ్ఱివీరన యభిజ్ఞుఁడు చెప్పఁగనేర్చుఁ గబ్బముల్. 25

వ. అని సమీపంబునం గొలిచియున్న నన్నుఁ గృపాతరంగి తాపాంగం
బున విలోకించి మామకమనోరథంబెఱింగినట్లు చెప్పనుద్యోగించి
తివి హృద్యానవద్యగద్య పద్యానుబంధంబుగాఁ బ్రబంధం బం
ధురభాషను జైమినిభారతమునం దశ్వమేధ పర్వంబు నిర్విఘ్నంబు

గా రచియింపు మని యానతిచ్చినఁ బ్రసాదంబని యంగీకరించి యిమ్మహాప్రబంధంబునకు మంగళాచారంబుగాఁ దదీయవంశావళి వర్ణనంబభివర్ణించెద. 26

++ ♦కృతిపతివంశవర్ణనము♦ ++

సీ. శార్ఙ్గ బాణాసనజ్యావల్లరీజాత
బంధురకిణగణోద్భాసితంబు
లీలోపధానవేళాలాలితశ్రీక
బరిపుష్పవాసనాభాసురంబు
నభసంగమాన్వయనాథవాహనరాజ
కంధరాస్ఫాలనకర్కశంబు
పాంచజన్యోద్భూతపాంసుచ్ఛవిచ్ఛటా
చంద్రికారసముహుఃక్షాళితంబు
తే. దానవారాతిదక్షిణేతరకరములు
రాజితం బందు వెలయించె రాజకులము
కైరవాప్తుండు దనకుఁ బక్షంబుగాఁగఁ
గువలయానందకర్బలక్ష్మిఁ గొమరు మిగిలి. 25
చ. ఉడుపతి వంశకర్త మహిమోన్నతి కెయ్యది మేర నాఁడు పా
ల్కడలి జనించినప్పుడు దళంబుగ నంటిన మేనిజిడ్డు వోఁ
గడుగుకొనంగ నబ్బె నని కాశివు నొదలయేటఁ బాదముల్
దడఁబడ నోలలాడుచు హళాహళిగా వడి నీఁదులాడెడిన్. 28
శా. ఆవంశంబున నుద్భవించె నమితక్ష్మాధీశ కోటీరకో
టీ విన్యస్త వినూత్నరత్నరుచినాటీ విస్ఫురత్పాదరా
జీవద్వంద్వుఁడు గుండశౌరి జయలక్ష్మీకంధరా బంధుర
గ్రైవేయాంతర పద్మరాగసఖ దోఃఖడ్గప్రతాపార్కుఁడై. 29
మ. జననం బందిరి గుండభూవిభునకున్ సంధాకబంధారి గా
తనయుల్ శ్రీనిధి వీరమాబలఖుఁడు నుద్యత్కీర్తిమాదయ్యయున్

ఘనతేజోనిధి గుండబమ్మఁడునుసంగ్రామస్థలీపార్థస
జ్జనమందారులు సాళ్వమంగనృపుఁడున్ సావిత్రిమంగాంకుఁడున్. 30

క. వీరలలో నుతికెక్కెను
వీరాగ్రేసరుఁడు లోకవిశ్రుతవిభవ
స్వారాజు సాళ్వమంగ
క్ష్మారమణుఁడు సుగుణరత్నకలశాంబుధియై. 31

సీ. దురములో దక్షిణసురతాను నెదిరించి
కొనివచ్చి సంపరాయనికి నిచ్చె
సామ్రాజ్యమున నిల్పి సంపరాయస్థాపనాచా
ర్యబిరుదవిఖ్యాతిఁ గాంచె
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వదివేలుమాడ
ద్దేవునమ్మడికి నొసఁగె
మధురాసురతాణు మడియించి పరపక్షి
సాళువబిరుదంబు జగతి నెరపె

తే. గబ్బితనమునఁ దేజిమొగంబు గట్టి
తత్తిమి నగరంపుగవఁకులు విఱుగఁ ద్రోలి
తాను వ్రేసినగౌరు నుద్దవిడిఁ దెచ్చె
సాహసంబున నుప్పొంగు సాళ్వమంగు. 32

ఆ. అట్టిసాళ్వమంగయకు సింగవిభు గుండ
శౌరి గౌతరాజ సావడిక్షి
తీశ హొన్న మానవేశ్వరు ల్మా మల్లి
నాథుఁ డనఁగ సుతులున మదహితులు. 33

తే. చక్రవర్తులతో నుతి సవతు వచ్చు
వీర లార్వురలోపల వినుతకీర్తి
మదవతీజనపర్యాయమదనమూర్తి
గౌతరాజవసుంధరాకాంతుఁడను

సీ. సర్వ సర్వంసహాచక్రి రక్షణమునఁ
జక్రింకు నాల్గుహస్తములు వోలె
స్థిరతరప్రజ్ఞావిశేషంబున హిరణ్య
గర్భునినాల్గువక్త్రములు వోలె
దుర్గాంతనిష్ఠురదోః ప్రతాపంబునఁ
గాలాగ్ని నాల్గుశృంగములు వోలె
మహితధర్మమున మన్మథవైరివాహ
గోరమణుని నాల్గుపాదములువోలె
తే. సంభవించిరి సుతులు సౌజన్యయుతులు
హరిపదధ్యానరతులు లోకైకనుతులు
గుండపరివృఢ సాళువకువలయేశ
బొప్పజననాథ సాళువ తిప్పవిభులు. 35
ఉ. వీరలలోన నగ్రజుఁడు విక్రమకేసరి గుండధారిణీ
ధారుఁ డుదారుఁ డాతనిప్రతాపము దిక్కులఁ బిక్కటిల్లు దు
ర్వార విరోధివీర నగరంబులకున్ హరుకంటిమంట లై
వైరినృపాలసైన్యవనవాటికి దావకృశానుపంటలై. 36
క. గుండనృపాలునితమ్ముఁడు,
దండితరిపురాజి సాళ్వధరణీపుఁడు మహీ
మండలి కాధారం బగు
కుండలి కాధార మయ్యె గురుభుజశక్తిన్. 37
క. అప్పార్థివునకనుజన్ముఁడు
బొప్పాధీశ్వరుఁడు సమరభూభాగములన్
జప్పన్న మేదినీశుల
బొప్పా ... డంచె భూవిదితముగాన్. 38
శా ... డు సతజన్య శ్రీసుధాసౌధహే
... మేఖలాచక్రుఁడై

పాభిబల్యంబున సాళ్వతిప్పధరణీపాలుండు పాలించెఁ దా
శాబప్రీతివహించి నిత్యవినుతక్ష్మానాథయూథంబులన్. 39

సీ. అమితవైభవముచే నసమానవైభవ
కులిశాయుధుల నదిభిగుహాల కనిచె
దోఃపరితాపంబుచేఁ దులితప్రతాపదా
వానిలాప్తుల నరణ్యములఁ ద్రోఁచె
వినుతధైర్యంబుచే విఖ్యాతధైర్యమం
ధానాద్రులను సముద్రముల ముంచె
ఘనకీర్తిచే సముత్కటకీర్తిచంద్రులఁ
గడకొండయవలిచీఁకట్లఁ గలిపె

తే. నాగమీసరగండకటారిసాళ్వ
పంచఘంటాని నాదాది భయదబిరుద
కాహళారావసంపాత కంపితారి
దీప్తబలసీరి సాళువతిప్పశౌరి. 40

వ. ఇట్లు చతుస్సముద్రంబులుఁ హరిచతుర్భుజంబులుం జతుర్వి
ధపురుషార్థంబులుం జతురుపాయంబులుం జతుర్దిగీశులుం బోలె వర్తిం
చువీరలయందు. 41

ఉ. గుండమహీవిభుండు తనకుం గులభామిని మల్లమాంబ గాఁ
గుండలికుండలుండు వెలిగుబ్బలిపట్టియు నైన తేయవా
హుండును నాదిలక్ష్మియుఁ బయోరుహ[illegible]డు వాణియున్ సము
ద్రుండును జహ్నుకన్యయును దు[illegible] విమ్మహిన్

ఉ. ఆమహితానుభావునకు నా[illegible]
ద్దావ[illegible]నుల్ వి[illegible]

సీ. హతరిపుక్షత్త్రియుం డయ్యుసామ్రాజ్యంబు
గరిమఁ జేయనినాఁటికడమయొకటి
యోగీంద్రవంద్యుఁ డయ్యును నుగ్రసేనుని
నోలగించిననాఁటియొచ్చె మొకటి
భువనైకవీరుఁ డయ్యు విభాకరతనూజు
తాఁవు గోరిననాఁటితక్కు వొకటి
యాదిలక్ష్మీనాథుఁడయ్యును బలిదైత్యు
సముగఁబోయిననాఁటిహైన్య మొకటి
తే. తలచి మూర్ధాభిషిక్తుఁడై ధరణిపతులు
గొల్వ ససహాయశూరత వెలసి చూన
శక్తి నవతార మెత్తినశౌరి గాక
క్షితిపమాత్రుండె సాళ్వనృసింహవిభుఁడు. 44
సీ. తిగుళభూములు తెంకులుగ జరించినదొడ్డ
చెవులపోతుల నెల్లఁ జెండివైచి
ఘనమైనకండకొవ్వునఁ బాఱు తెంచిన
యొడ్డెని పెనులావు లూడఁదన్ని
పటతెంచి చిక్కఁగఁ బాలదుర్గము మెట్టి
సుడివడ్డిచామలఁ జుట్టుముట్టి
పెనుగొండకడ వాలి పిక్కిళ్ళు మొదలైన
ప్రతిపక్షులను హతాహతము చేసి
తే. సత్కవులతుష్ట... వసంతవేళ
రాయ... హ
45

ద్గతదానాంబుసరిత్తటీతృణసుఖోదంచన్మృగీలోచన
ద్యుతు లిందీవరదామసంపదలఁ జేయున్ దిక్పతిస్త్రీలకున్. 46

—షష్ఠ్యంతములు.—

క. ఈదృగ్విధగుణమణికల
శోదధికిని మథితగర్వితోర్వీధవసే
నోదధికి భువనవినుతా
సాదదయానిధికి సాధుజనసేవధికిన్. 47

క. ధరణీవరాహునకు బ
ర్బరబాహునక కహితరాజరాహునకు దిగం
తరముఖరిత జయభేరీ,
సరభస భాంకారనాద సన్నాహునకున్. 48

క. ఆకాశకేశకంధర,
కాకోలసదృశనిశితకౌక్షేయుజయా
నీకనిరాతంకున కరి,
భీకరచౌహత్తమల్లబిరుదాంకునకున్. 49

క. మీసరగండనికిఁ గటా
రీ సాళువమునకుఁ గిన్నరీజనవిద్యా
వాసపరిపఠితదిగ్గజ
శాసనగీతప్రబంధసంబంధునకున్. 50

క. పాండురతరకీర్తిరమా
గండూషితనిర్జరాపగాసాధునకున్
గుండయవరసింగమహీ
మండలనాథునకు విక్రమసనాథునకున్. 51

—:కథాప్రారంభము.:—

వ. అభ్యుదయం బాకల్పంబుగా నాకల్పింపం బూనిన జైమినిభారతిం
బునకుం గథావతారిక యెట్టిదనిన నట్లు జనమేజయమహీశ

కుప్రిందుచక్రియాగంబు నిర్వర్తితం గావించిన యనంతరంబ సుఖాసీనుండై జైమినిం గనుంగొని మహాత్మా సకలకలికలుషత్రి కాలవిత్రంబైన కురుక్షేత్రంబునం దజాతశత్రుం డగుధర్మపుత్త్రులం డు ధార్తరాష్ట్రబలంబు నష్టాదశవాసరంబుల ధూళిధూసరంబు గావించి శాశ్వతైశ్వర్యధుర్యుండై విశ్వజగన్నుతంబుగా నశ్వమేధం బేవిధంబున నాచరించె నెఱింగింపు మనుటయు నమ్మునివల్ల భుండు జనవల్లభున కిట్లనియె. 52

తే. ధారుణీనాథ వినుము మీతాత యైన
ధర్మసూనుని యశ్వమేధ క్రమంబు
తనపితామహుఁ డైన శంతనుతనూజుఁ
డమరపురి కేఁగ శోకాకులార్తుఁ డగుచు. 53

—♦ధర్మజునికడకు వ్యాసులువచ్చుట.♦—

క. ఉన్నంత నానృపాలుని, సన్నిధికేతెంచె వ్యాససంయమి తతవి
ద్వన్నుతబహుపుణ్యకథా, సన్నపురాణేతిహాసశాలి యథేచ్ఛన్.

క. వచ్చినమౌని నెదుర్కొని
తెచ్చి యుచితపీఠి నునిచి దీర్ఘతరంబై
హెచ్చినశోకము తుదిలో
నచ్చున లాడంగ ననియె నమ్మునితోడన్. 55

ఉ. సత్యవతీతనూభవ నృశంసత భీష్మునిఁ గుంభజన్ము నా
దిత్యకుమారు నారక వధించితి రాజ్యరమావిభూతి కా
ద్ధత్యముతోడుతన్ సమరధర్మము పీసరపుచ్చి వంచనా
కృత్యజ మైనయీనిబిడకిల్బిష మేమిటఁ జక్కనయ్యెడున్. 56

చ. తఱుచుగ భానునందనుని ధ్యానమునందు నభీష్టవస్తువుల్
గురుతులుమీఱఁ గొం చరుగుకోవిదకోటుల సమ్మదాశ్రువుల్
వఱదలు వాఱఁ బ్రస్తుతరవంబులు మిన్నులు రాయుచుండు న
క్కఱఁగట శోకజాశ్రువులఁ గో యనునేడ్పులు నుప్పతిల్లెడున్.

ఆ. గురుఁడు కుంభజుండు సురనదీసూనుండుఁ,
జూడలేని రాజ్యసుఖము నాకుఁ
గన్నుదోయి లేనికాయంబు తోయంబు,
గాని మిగులసౌఖ్యకరము గాదు. 58

ఉ. పిన్నటనాఁటనుండి ననుఁ బెద్దఁగఁ జూచినవంశవృద్ధులన్
మిన్నక చంపి చేకొనినమేదిని నాకిది యేల సత్త్వసం
పన్నిధి వాయునందనునిఁ బట్టము గట్టెద నేఁటితోన నే
నన్నియు మాని కానలకు నేఁగెద నిష్ఠఁ దపంబుఁ జేయఁగన్. 59

క. ఏతపముల నేజపముల,
నేతీర్థవిలోకనముల నేక్రతువుల నీ
జ్ఞాతివధం బొనరించిన
పాతకము హరించు ననఁ దపస్వి యతనితోన్. 60

వ్యాసుఁడు ధర్మజున కశ్వమేధము సేయ ననుజ్ఞ యిచ్చుట.

సీ. తలఁకకు ధర్మనందన గోత్రవధం
బొనర్చినదురితంబు వాయ
నశ్వమేధంబుఁ జేయ నుపక్రమింపుము
తొల్లి రాముఁడు జగం బెల్ల నెఱుఁగఁ
బౌలస్త్యుఁ జంపినపాతకంబు హరించె హ
యమేధయాగక్రియం బొనర్చి
శౌరిశాసనమున సంగ్రామజయలబ్ధ
మైనరాజ్యంబు నీ కగునె విడువ
తే. సకలయాదవులును గైవసంబు నీకుఁ,
గాన నీకానితలఁపులు గట్టిపెట్టి
తురగమేధంబుఁ జేసి కౌతుకముతోడఁ,
గురుకులంబున సత్కీర్తి గుమురుకొల్పు. 6

క. అనవిని వేదవ్యాసునిఁ,
గనుఁగొని దైన్యంబు దోఁపఁగా ధర్మజుఁడి
ట్లనియెఁ జనునయ్య కనుని,
ర్థనుసకు నాకిమ్మహాధ్వరం బొనరింపన్. 62

క. మొలకలు రాజకుమారులు
తలిదండ్రులు లేనివారు దయ కర్హులు భూ
తలమునఁ గలప్రజ లందఱు,
నొలిచినవొలి వాడెదరు సుయోధనుబాధన్. 63

ఉ. కాఁక నెదిర్చి సంగరముఖంబున హెచ్చినరాజవంశముల్
గూఁకటివేళ్లతోఁ బెఱికి గోత్రవధంబును జేసినట్టియా
వేఁకవుఁగీడు గాక ప్రజ వేఁచఁ దలంచిన గోరుచుట్టుపై
రోఁకటిపోటు చందముగ రోసి జనుల్ ననుఁ జూచి తిట్టరే. 64

క. కావునఁ దురంగమేధము
గావింప ధనంబు గూర్చుగతి గానఁగ లే
నీవేళ నన్ను నవ్వుచు,
నీ వేల తలంకె దని మునీశ్వరుఁ డనియెన్. 65

ఉ. వాలిననేడుకన్ బహుసువర్ణ ముఖంబున మున్మరుత్తభూ
పాలునిచే మహీసురు లపారసుదక్షిణ లంది తెప్పలం
దేలి యథేచ్ఛఁ గొంచరుగ నిల్చినవిత్తము వెక్కసంబుగా
మూలుగుచున్న దిప్పుడున ముదిత్రమై తుహినాద్రిచేరువన్. 66

క. ఆధనము నీకు నచ్చిన
సాధనముగ నధ్వరంబు సాఁగించి బుధా
రాధనము చేయు విరతా
యోధనచణు లైనతమ్ము లూఁటగ నాఁగన్. 67

సీ. అన విని ధర్మనందనుఁడు వారాశర్యు
తోడ నిట్లను మరుత్తుండు బహుసు

వర్ణయాగము చేసి వసుధామరశ్రేణి
కెల్ల దక్షిణలుగా నిచ్చె మొదల
విప్రార్జితం బైనవిత్తంబు గొనివచ్చి
క్రతువు చేయుటకంటెఁ గలదె కీడు
తమసొమ్ము తమ కిచ్చె ధర్మరాజని మహీ
సురులు దాసము సేయఁజూచి నగరె
తే. యాగడంబున బ్రహ్మస్వ మపహరించి
తెచ్చిపుణ్యంబు సేయంగఁ,దిరువు లెల్లఁ
గుడిచి కూర్చుండి శిలఁ దెప్పకొయ్యఁజేసి
జలధిలో నీఁదులాడంగఁ దలఁచినట్లు 68
క. మొదలఁ గుల మెల్లఁ దుంచుట
యదయత గురులయెడఁ గల్ల లాడుట యదిగా
కిదియును జేయఁ దలంచిన
గొద లే దీ వేళ దొంతికోల సిద్ధించుఁ. 69
వ. నావుడు. 70
క. ఆమాటలు విని మౌని
గ్రామణి ధర్మజున కనియెఁ గశ్యపునిది గా
దా మేదిని యెల్లెలిరి
భూమిపతులు కానితోఁ బ్రవఁ బోయిరె వారల్. 71
చ. వినుము నృపాల భూసురులు వెక్కసమైనఁ బరిత్యజించి పో
యినకనకంబుఁ జేకొన మహీపతికిం జనుఁగాని వారికిం
జన వొకనాఁడు లేదొకనిజం బెఱిఁగించెద నెవ్వఁ డేలు మే
దిని ధన మెల్ల నాతనియధీనము మాటలు వేయునేటికిన్. 72
తే. అదియుఁ గాక మరుత్తుండు యజ్ఞవేళ
నుచితదక్షిణ లర్పించి యున్నధనముఁ
గొల్లవిడిచిన బ్రాహ్మణు లెల్లఁ దనిసి
విడిచి రర్థంబు దీనికై వెఱవ వలదు. 73

## అశ్వమేధవిధానము వ్యాసుఁడు ధర్మజునకుం దెల్పుట.

వ. కావున నీమనంబున ఘనం బైనవంత యావంతయుం బెట్టుకొనక నెట్టుకొని యమ్మహాధ్వరంబు సాఁగింప నుద్యోగింపుము. తద్విధానంబు సావధానంబుగా నెఱింగించెద నాకర్ణింపు మఖిలవేదశాస్త్రపురాణేతిహాసకథాసుధానుభవులును సంచితాన్వయసంభవులును నచ్యుతపదారవింద సందర్శనానంద కందళిత హృదయారవిందులును నతిమనోహరపరిభావిడంబితరవీందులును నగునగ్రజన్ములిరువదివేలు ఋత్విజులు కావలయు నందొక్కొక్కనికి హాటకసమేతంబొక్కొక్క ఘోటకంబును నొక్కొక్కమదద్విరదంబును రత్నపరిష్కృతసహితంబు గోసహస్రంబును భారపరిమితంబు హేమంబును బ్రేమంబున నేమంబునం దురంగంబు నర్చించి విసర్జించు మొదలి దివసంబునసమర్పింపవలయు నిదిదక్షిణా ప్రకారంబు. 74

క. పాటీరహీరవర్ణము హాటకపుచ్ఛమును నల్ల నగుచెవులు·నిరాఘాటజవంబును నధ్వర, ఘోటకలక్షణము లివి యగోచరమైనన్.

ఉ. కాయము చిత్రవర్ణములు గల్గి మనోజవ మైనయశ్వమే
ధీయహయంబు నాగమవిధిన్ విడువం దగుఁ జైత్రిపూర్ణిమన్
రాయుచు సైన్యముల్ గొలిచి రా సుతులైనను దమ్ములైన న
త్యాయతశక్తిఁ గావ నొకహాయన ముర్విఁ బరిభ్రమింపఁగన్. 76

క. శూరులు గల్గినఁ బట్టుఁడు
ధీరత నని హయము నిటలదేశంబున బం
గారపుఁబట్టముపై బతి
వీరాంకము వ్రాసి కట్టి విడువఁగ వలయున్. 77

సీ. విణ్మూత్రములు నశ్వ విడిచినతావుల
నెల్ల హోమంబు సేయించి యచట
గోసహస్రంబు ధాత్రీసుపర్వుల కాగ
మోక్తదక్షిణలతో నొసఁగవలయు

దీక్షితుండు హయంబు తిరిగివచ్చేడుదాఁక
నియతభోగంబు లన్నియును మాని
భార్యతోఁ గూడ నసిపత్రివ్రతముఁ బూని
బ్రహ్మచర్యంబు సల్పంగవలయు.
తే. నమరపతి నూఱుతురగ మేధములు చేసెఁ
గానియీనిష్ఠఁ జరియింపఁ గానఁడయ్యె
వ్రతయుతంబుగఁ జేయు మీక్రతువు నీవు
పాండునందన సకలపాపములునడఁగు. 78

క. అంగజుని గెలిచె నోడఁక
గాంగేయుఁడు తమకు నలవి కా దని మహిభృ
త్పుంగవు లీవ్రత మోపక
చెంగిరి నీ కలవి యైనఁ జేయుము నియతిన్. 79

చ. అన విని ధర్మసూనుఁ డనఘా బవరంబుల డస్సినారు నా
యనుజులు కర్ణసూనుఁడు మహాబలుఁ డీవృషకేతుఁ డర్భకుం
డనుపఁగఁ జాల నాజికి మదర్థహతుండు ఘటోత్కజుండు త
త్తనయుని మేఘవర్ణుని నధర్మము పంపుట చాలఁ బోరికిన్. 80

—♦భీముఁ డశ్వముం దెచ్చెద నని ప్రతిజ్ఞ సేయుట,♦—

క. ఎవ్వనిప్రాపున గెలిచెన్
గవ్వడి నెవ్వఁడి విరోధిగణముల ననిలో
నవ్వనజాక్షుఁడు కృష్ణుఁడు
దవ్వుల నున్నాఁడు క్రతువు తరమే చేయన్. 81

క. అని భీముని దెసఁ జూచిన
వినయంబున నతఁడు వల్కె విష్ణుఁడు నికటం
బున లేఁ డననేటికి మన
మునఁ దలఁచిన దురిత మడఁగి పుణ్యము దొరకున్. 82

వ. అదియునుంగాక నీకొక్క రహస్యంబవశ్యంబెఱింగించెద వాసుదే

వుశాసనంబునం జేసిమనకుబంధునాశనంబునైనదోసంబువీసంబునులేదు జన్నంబు సేయఁగన్నను నవ్వెన్నుండు నిన్నుధన్యునింజేయునయినలోకం బునంగలరాజలోకంబులోన నుత్తమశ్లోకుండ వగుటకుందగ నియ్యాగం బు సుపరియోగంబుగా సాఁగింప నుద్యోగింపుము యోగ్యం బగున శ్వంబు విశ్వంబునం గల్గినంజాలు దుర్వారభుజాగర్వం బఖర్వంబుగా నుర్విపతు లెవ్వరెదిర్చినంబేర్చి నేననిర్వహించి తెచ్చెద నెచ్చటంగల దడుగనవధరింపు మనుటయు సాత్యవతేయుండు కౌంతేయునింగనుం గొని, 83

సీ. పావనివాక్యంబు పావనంబునుశుభ ప్రద
మును శ్రేయస్కరమునువరము
నశ్వమున్నది యౌవనాశ్వవిశ్వంభరా
ధిపుఁడేలుభద్రావతీపురమునఁ
బిసిడియర్థముఁగూడఁబెట్టినట్లావంకఁ
బోతుటీఁగకునైనఁబొలయరాదు
సందడించుచుదశాక్షౌహిణీసైన్యంబు
లనిశంబుఁగోలకోలమనుచునుండు

తే. మనకునదిదక్కనేనిసమ్మఖముఁసాఁగు,
ననినవినిభీముఁడిట్లనునన్నతోడ,
నతనిబలమేలదేవతలడ్డమైనఁ,
బట్టితెచ్చెదహయమునీపాదమాన. 84

తే. వాసుదేవునికృపగలవారికెందుఁ నరయదుర్ఘటమైనకార్యమునుగల దె,కానభద్రావతికినేఁగిక్రతుహయంబు,నొంటిఁగొనివత్తునట్లుతేకుంటి నేని. 85

సీ. వేదఘోషణలేనివీటనున్నయతంబుఁ
దలిదండ్రులకుఁగెంపుదలఁచునతఁడు,

నరుగ్రోలునతండు
భూసురావళితోడబొంకునతఁడుఁ,
నిటలాక్షుగుడిలేనికోటిగనున్నయతండు
నిల్లరిధనమిచ్చి యేఁచునతఁడుఁ,
దశలివిశ్వాసపాతకముఁజేసినవాఁడు
శివచింతఁజెవిచెంతఁజేర్పనతఁడుఁ

తే. బోవుగతికిఁనవశ్యంబుపోదుననుచు, శపథములుపల్కికదలనిశ్చయ
ముచేసి యన్నసన్నిధిమరుమాటలాడకున్న, ధర్మసుతుఁడాదరమున
సోదరునిఁజూచి.

మ. బలియుండుగ్రుఁడుయౌవనాశ్వధరణీపాలుండు దృఢసైన్యులా
జులముఁకాకలనాఁటితేజమహాశూరుల్ చలంబెత్తిమొ
క్కలముల్ పల్కితి ఘోటకంబుగొనిరాఁగానైనసీవెంటరా
వలదాయొక్కరుఁడన్న గర్వసుతుఁ డావాక్యంబు లాలించుచున్.

క. అనిలతనూజునివెంటన్, ననుఁబంపుము వేడ్కధర్మనందనయనిఁన్
వినిభీముఁడువృషకేతునిఁ, గనుఁగొనిదయచెంగలింపఁగానిట్లనియెన్.

ఉ. ఏచినయాగ్రహంబు వహియించి భవజ్జనకుణ్ గఠోరనా
రాచపరంపరల్ గొనిదురంబునఁ గూల్చినాఁటనుండియున్
ద్రోచినశోకవేదనలతోడఁ గుమారకనీముఖాబ్జమున్
జూచినయప్పుడెల్లమదిచుఱ్ఱుమనుదీఅనిలజ్జపెంపునన్. 89

తే. అనినవృషకేతుఁడిట్లనుననిలజునకు, సమరమునసైనమీచేతశస్త్రని
హతి ... యొవ్యమజ్జనకునకును, గలుషములఁభాసినగతిఁ 90

...గ్ముని భజింపకదయాంహిత

మున, మఱియునెన్ని లేవుమార్తాండతనయుండు, ...
దుండగములు.

చ. ఖలుఁగురురాజుఁగొల్చుటయుకాక సభాస్థలినుత్తమాంగనన్
వలదనశక్తిగల్గియును వస్త్రము లొల్వఁగఁజూచె నమ్మహా
కలుషములోర్చినంగరముఖంబునఁబార్థుఁడు తండ్రిబిడ్డలన్
గలపినమేలకాక కొఱగామియుఁగీడును నెద్దిపేర్కొనన్. 93

క. అధిపవినుధనంజయుచే, నిధనంబై ముక్తిఁజేకొనియెఁగావున న
వ్విధుకులజుఁడుత్తమర్ణుం, డధమర్ణుఁడ కర్ణుఁడిది యదార్థంబైనన్.

చ. శమనతనూజమాద్రిజులు పాత్రులుగాఁజనియావనాశ్వదు
ర్గవడిఁజొచ్చి యధ్వరతురంగముఁ బావనికిచ్చి తండ్రిపా
పముల నడంచినద్గతికిఁ బంపినకీడిఋణంబు నేఁత
త్సమరతలంబునన్ వినుతశౌర్యము నుత్తిగఁబెట్టితీర్చెదన్. 95

తే. అనినవృషకేతుఁజూచి ధర్మావరజుఁడు, నెమ్మిరెట్టింపనాలింగనమ్మొ
నర్చి, తనదుపయనంబెఱిఁగిఘటోత్కచనుతుండు మేఘవర్ణుండుగడు
సంభ్రమింపఁజూచి 96

క. తండ్రీఘటోత్కచుఁడుమీ, తండ్రిగలుగఁగాదె ద్రౌపదితోడం
దండ్రులహారిదీశ్వరులైన, మండుఁబొగడదెచ్చెగంధమాధనమునకున్

శా. వాత్సల్యంబుననీవునట్లు భుజగర్వస్ఫూర్తిఁబెంపారబీ
భత్సుంబాయక ధర్మజుంగొలువు తాత్పర్యంబునన్ శౌర్యసం
పత్సారున్ వృషకేతుఁగూడుకొని యాభద్రావతీసైనిక
ప్రోత్సాహంబెడలించియధ్వరహయంబు ... మున్.

చ. అనవినిమేఘవర్ణుఁడని లాత్మజుతో ...
జనకుఁడు మజ్జగంబుపఁ బ్రశసి ...

ఉ. కావున నీకు సేవకుఁడఁ గాఁదగుమన్ నినుఁ గొల్వవచ్చి భ
ద్రావతిలోన నుండె మతురంగముఁ దెచ్చెదఁ గూయువచ్చినన్
నీవటు దండగో లగుచు నిచ్చినఁ జాలు నగస్త్యమూర్తియై
యీనృపకేతనుం డరిమహీశబలాంబుధి నోఁగఁ బట్టెడున్. 100

తే. అహితసేనలు రానతఁ డడ్డగించి,
యాహవము చేయుచుండ హయంబు నేవ
గొఱియవలెఁ బెట్టుకొనివత్తు నఱకడమునఁ,
దడవు సేయక ధర్మనందనునికడకు. 101

వ. అనిన విని పరమానందకందళితహృదయారవిందుఁడై సమీరనంద
నుండు ఘటోత్కచనందనుం బరిణమించి కరుణ మించినచూపు
లం జూచి పౌత్త్రిపౌత్త్రధర్మభూషణంబును సమితివిభీషణంబును
నగు నీ భాషణంబు మదీయశౌర్యభూషణంబునకు
హేతుభూతం బయ్యె భూతనాథుండు వచ్చినను మనమువ్వురతో
డం జివ్వకుదొడర వశంబు గాదని యుద్ధసన్నద్ధులైన సోదరపుత్త్రి
పౌత్త్రులం గనుంగొని ధర్మపుత్త్రుండు హర్షాశ్రుమిళితనేత్రుండును
బులకకలికాభిరామగాత్రుండును నై యగ్నిత్రియంబు గలుగ నాకులో
కత్రియంబున నెయ్యది యసాధ్యం బనియుత్సహించి యుండె
నంత భానుమంతుం డపరదిక్కాంతాకబరికాంతరంబునకుఁ జెం
గలువబంతిచెలువు సాతగించె నప్పుడు- 102

తే. ధర్మనందను చిత్తఖేదంబు మాన్పి,
తురగమేధంబు గావించు తెరవు దెలిపి
పోవఁదలఁచిన నమ్మౌనిపుంగవునకు,
ననుజులును దాను విహితపూజనము లొసఁగి. 103

శా. చేదోయిన్ ముకుళించి వీడుకొనె నక్షీణప్రమోదంబునన్
వేదవ్యాసుఁ బ్రసాదభాసురవచోవిన్యాసు నంహస్సము

త్సానాధ్యాసు సుధీవిలాసు నుతవిద్యావ్యాసుఁ బ్రిజ్ఞాకళా
సాదజ్ఞానసముల్లసచ్చిదమృతాసాస్వాదోదితోల్లాసునిన్ 104

సీ. మునినాథుచే ధర్మతనయుండు వీడ్కొని
యపరసంధ్యాక్రియ లాచరించి
యనుజులు గొల్వ సింహాసనంబున నుండి
క్రమ్మఱఁ జింతాభరంబు దాల్చి
యంతరాయములేక హయమునచ్చుట యెట్లు
సత్క్రియయాగంబు సాగు టెట్లు
దానదక్షిణలకు ధనము గల్గుట యెట్లు
మునిమాటకే నియకొనుటయెట్లు

తే. చాలదుష్కరమైనయీజన్నమునకుఁ,
దోడుదొరయైనపట్టంబు దొరకుటెట్లు
దేవకీసూతి త్రిభువననాధిపుండు తాన
యెఱిఁగి సాధింపకున్న నీడేఱుటెట్లు 105

తే. హా సరోజాక్ష గోత్రిమఃఖార్ణవమున
మునిఁగియున్నాఁడఁ జేయూఁతకొనఁగలేక
నీకృపాదృష్టి పేరోడ గాకయున్న
వెడలఁబడు టెట్లు మఖముగావించు టెట్లు. 106

క. కౌరవసభలో లజ్జా, వారధి దిగనుద్ధరింపవా ద్రౌపదిన
న్నారీతి నుద్ధరింపుము, నీరజదళనేత్ర కలుషనిరధివలనన్. 107

ధర్మరాజుకడకుఁ గృష్ణుండు వచ్చుట.

వ. అని పెక్కుదెఱంగుల నక్కమలోదరుం బేర్కొని దీనాతిదీనంబు లగువాక్యంబులం బ్రస్తుతింప సమస్తభువనవ్యాపియు విశ్వరూపియు నగుగోపికారమణుండు దక్షణంబ వచ్చి వాకిట నిలిచి ప్రతిహారిం గనుంగొని మదీయాగమనంబు ధర్మపుత్రునకు కెఱింగింపు మెంత వారం కేని మహీకాంతునియవసరంబు డెలియక చనవుమెఱః

యంతఃపురంబునకుం జనుట యనుచితం బనిన వాఁడును గృత
వందనుండయి గోవిందున కిట్లనియె. 108

సీ. దేవర యేవేళ వేంచేసినన
మయంబ యని ధర్మసంభవుండు
నాతోడ మొదల నానతియిచ్చె నవసరా
నవసరంబులు మీకు నడుగ వలదు
పరధనాపహారులును బరదోషనిరతులుఁ,
బరవధూరతులును బడయ లేరు
నీదగుకరుణ గణింపగాఁ నిట్టిదు
ర్గుణములు ధర్మపుత్రునకు లేవు
తే. తగ విలోకించి తద్వాంఛితంబు దీర్పఁ,
దాను దమ్ములు నీపదధ్యానపరత
నున్నవారని పలుతెంచి సన్నుతోక్తిఁ,
గృష్ణుఁ డేతెంచె నగరివాకిటికి ననిన. 109

ఉ. దిగ్గనలేచి యవ్వసుమతీపతి భీముఁడు సవ్యసాచియుఁ
డగ్గఱి కొల్వ నాసనమునన్ దరహాసమనోజ్ఞచంద్రికల్
నిగ్గులువార మత్తగజలీల రయంబున నేగుదెంచెఁ దా
నగ్గరుడాంకుఁ జేరఁ బులకాంకురముల్ దను వెల్ల నిండఁగన్. 110

ఉ. వచ్చినధర్మజుం గదిసి వారిజనాభుఁడు మ్రొక్క మ్రొక్కనీ
కచ్చి కవుంగిలించుకొనెఁ గూర్మియు భక్తియుఁ బొత్తుసేయగా
ముచ్చట వాయఁ గొంతవడి మూర్ధమునూర్కొని లోచనంబులం
బిచ్చిలి రాలుబాష్పజలబిందులు మౌళి నలంకరింపఁగన్. 111

క. గోవిందుని పాదములకుఁ,
బావనియును నర్జునుండుఁ బ్రణమిల్లిరి రా
జీవయుగళంబుపైఁ గ్రొ
త్తావులు గొన వ్రాలుతుమ్మెదలచందమునన్. 112

వ. ఇత్తెఱంగునం బాండునందనులు వసుదేవనందను సంభావించియం తఃపురంబునకుం దోడ్కొని పోయి యర్ఘ్యపాద్యాదివిధులం బూజిం చి యర్హాసనంబుల నాసీనులయియున్న యెడం బాంచాలరాజనందన వినయంబున నమస్కరించుదనకు వందనం బొనర్చి మందస్మితవద నారవింద యగుచు నరవిందనాభురాకకు విస్మయం బందుచున్న యన్నరవరాగ్రణిం గనుంగొని యిట్లనియె. 113

తే. అర్ధరాత్రింబు వచ్చె నీహరి యటంచు,
మనమునం దేల వెఱగంద మనమ కాదు
దాసజనుఁ డెందు నేయుపద్రవముఁ జెందు,
నందులకు వచ్చిరక్షించు నచ్యుతుండు. 114

ఉ. ఈవు మనంబునన్ మఱచితే సభలోఁ దనచీర యొల్చుచోఁ
గా విడిపింప నందఱును గల్గియు నిర్దయులైరి కనుంగొనన్.
హా వసుదేవపుత్త్ర యన నక్షయవస్త్రములిచ్చి నన్నుల
జ్జావనరాశిలో మునిఁగి చావక యుండఁగ నుద్ధరించుటల్. 115

తే. మనముగాండీవిసంపుదమనితలంపఁ
దలఁపులోనన వచ్చెరు తత్క్షణంబ
భక్తజనులకు ముంగొంగుపసిఁడి గాఁడె
దేవతారత్న మీవాసుదేవుఁ డనఘ. 116

వ. అని సన్నుతింప ద్రుపదజాతయెడ జాతాదరుండై సరసిజోదరుండు మన్నించి యజాతశత్రుదిక్కుమొగంబై వినతుండు వినయవిస్రంభ గంభీరంబుగా నిట్లనియె. 117

చ. తలఁచితి దుఃఖనిర్గతికిఁ దామరసోదర నిన్ను నీవునుం
దలఁపునకంటె మున్నె ప్రియదంబున వచ్చితి నామనోరథం
బులు ఫలియించె వ్యాసమునిపుంగవునానతి నశ్వమేధమున్
దలఁచితిఁ జేయ నిర్భయతఁ దత్ఫలకర్తవు నీవ కావునన్. 118

తే. అనిన ధర్మతనూజుతో నధిప నీవు
పూనుపనులెల్ల ఫలసిద్ధిఁ బొందు ధైర్య
దనుల కరయంగ లే వసాధ్యంబులనుచు
నచ్యుతుఁడు భీము దెసఁజూచియుల్లసగుచు 119

క. మందమతియు బహ్వాశియుఁ
దుందిలుఁడును రాక్షసీరతుఁడు నిష్ఠురవా
క్సందర్భుఁడు నగుమారుతి
నందనుసచివతఁ బ్రయోజనములు ఫలించుఁగ. 120

—♦కృష్ణుఁడు భీమునిగుణంబులు ధర్మజునకుం దెల్పుట.♦—

ఉ. అంగవిహీను నిల్లటపుటల్లునిఁ బ్రల్లదు నీచభామినీ
సంగతు వామనుఁగ బధిరు సాధ్వసమానసు మామఁ గాముకుఁ
వెంగలి నంగనాజితుని నిర్దయుఁ గ్రోధిఁ బ్రమత్తు మంత్రిఁజే
యం గొఱగామి కెల్లఁ గుదు రంచు గణింతురు నీతికోవిదుల్.121

ఉ. గంధవహాత్మజుండు పెనఁగబ్బి తలంపఁడు కార్యముల్ జరా
సంధుహిడింబుఁగ బకనిశాచరుఁ జంపినయట్లు గాదు గ
ర్వాంధులు సత్యసంధులు మహాబలసాంద్రులు నిర్జితేంద్రియుల్
బంధురదానశీలురు నృపాలురు వారి నెఱుంగఁ డెన్నఁడుఁగ. 122

తే. నాఁడు గాండీవి పూనెసైంధవు వధింపఁ
బ్రతిన యుద్ధతి నేవిచారమును లేక
నేఁడు భీముఁడు కడిమిఁ బూనినప్రతిజ్ఞ
యంతకన్నను మిగులసాహసతరంబు. 123

వ. ఇమ్మహాప్రతిజ్ఞ యీడేఱు నెట్లు నిరాఘాటంబున యజ్ఞఘోటం
బు దిగంతరంబుల నిరంతరంబును జరింప నితాంతశౌర్యవంతులగు
మహీకాంతులు దేవగంధర్వాదులు సంతరాయంబు నొందింప
నెడరు వేచియుండుదురు మున్ను రాఘువేశ్వరుం డశ్వరక్షకు వృష
చరవీరు మారుతిం బనుప నతండు శ్రేత్రమతి యను పట్టణంబున

సురథుఁ డను మహారథునిచేతఁ దురంగంబు పట్టువడి తానునుం గట్టువడియె నట్టియెడ రామభద్రుండాయుపద్రవంబు తాన చని చక్కఁబెట్టుకొనవలసెఁ గావునఁ బావనికి సహాయం బీయర్జునుంబ నుచుట కర్జం బని తర్జనిం జూపినకంసమర్దనునకు బకమర్దనుం డిట్లనియె. 124

—♦కృష్ణభీమసేనలసల్లాపము.♦—

తే. అనఘ నీవానతిచ్చినయట్ల మిగులఁ
దుందిలుండను బహ్వాశి దుష్టరాక్ష
సీరతుండను నగుదుఁ జర్చించి చూడ
దేవరకు నట్టిగుణములు లేవు గాన. 125

సీ. మొదల నత్యంతకాముకుండవౌటకు గొల్ల
యిల్లాండ్రగుబ్బపాలిండ్లు సాక్షి
యతినీచరతిశీలి నగుటకుఁ బాటీన
కమఠసూకరవిగ్రహములు సాక్షి
బహ్వాశి నగుటకు బ్రహ్మాండకోట్లును
బూరింప లేనిబొజ్జ సాక్షి
స్త్రీలోలుఁ డగుటకుఁ ద్రైలోక్యము నెఱుంగ
ధరకుఁ దెచ్చినవేల్పుతరువు సాక్షి

తే. జడసముత్సాహి నగుటకు జలధి సాక్షి
వామనుండ నగుటకు బలీశ్వరుఁడు సాక్షి
మందమతి వౌట నది మఱపొందెఁగాక
నరివిఁ బేర్కొనఁ దరమె నీసటలుకృష్ణ. 126

తే. చదురు లేటికి మును జరాసంధముఖ్య
భూవరుల సంహరించుట నీ వెఱుఁగవె
నీకరుణతోడుగా వైరినృపులగెల్చు
హాయమునఁ గొనివత్తు సాంగంతు నధ్వరంబు. 127

చ. ఇది యొకదొడ్డగాఁ దలఁప నేటికి నాహృదయంబులోన నీ
పదయుగళంబు నిల్పి కులపర్వతముల్ పెకలించి వైతునో
గదగొని ధారణిం దుమురుగా వడి దంతునొ దిగ్గజంబులన్
రదనము లూడఁ దన్నుదునొ రాలుతునో గ్రహతారకంబులన్.

తే. బహువిచారపిపాసార్తపాండుపుత్త్రి
చాతకములకు కకావర్షంబవైతి
విమతజనులకు నంగారవృష్టివైతి
నీవు వేంచేసి నీరదనీలవర్ణ. 129

తే. పంకనిర్మగ్న మగుగోవుఁ బరికరించి
సుకరముగ నుద్ధరించుగోపకునిమాడ్కి
ముదముదైవార నుద్ధరింపుమవుగాక
పంకనిర్మగ్ను నన్ను గోపకులతిలక. 130

వ. అని యనిలనందనుండు పలుకుపలుకులకుం బ్రమోదమ్మై తదీయతే
జోవర్ధనుండగుచు గోవర్ధనుండు భీమసేను నాలింగనం బొనర్చి భవ
ద్వాక్యంబుల నాచిత్తంబు కౌతుకాయత్తం బయ్యెను ధర్మనందనుండవు
మాన్యుండవు రాజన్యులకు మనుష్యభరంబు పలవదు జన్మంబున
జాహ్నవీసుత ద్రోణ కర్ణులను దత్సంబంధబాంధవులను నిధనం
బొనర్చినదుష్కృతంబు మత్కరంబునం బెట్టి విశ్వవిఖ్యాతంబుగా నశ్వ
మేధంబు సాగింతుగా కనిన బలానుజునకు ధర్మానుజుండు దండం
బు వెట్టి యిట్లనియె. 131

చ. అరసి భవత్కరాంబురుహమం దొకి టొక్కను గోటికొండలై
పెరుఁగుటఁజేసి దుష్కృతముఁ బెట్టఁగఁ గూడదు నీకరంబునన్
నరపతి యశ్వమేధసవనం బొనరించిన నాఫలంబు నీ
కరకమలంబునందు నిడఁ గానికగా నది గాచుచున్నతన్. 132

తే. హయముఁ గొనివచ్చునంతకు యమతనూజుఁ
గాచికొనియుండ నీసవ్యసాచి తనువు

పోయి వచ్చెద నీపదాంబురుహచింత
నాకుఁ దగుసంబళంబుగా నలిననాభ. 133

క. అనిమాటలాడుసమయం
బున భోజనవేళ యయ్యెఁ బొ్రద్దెంతేనిం
జనియె నని దుృపదనందన
చనుదెంచినఁ బాండుపుత్త్రి సారసనేత్రుల్. 134

వ. పరిసంగం బుజ్జగించి మజ్జనంబు లాడి యిష్టాన్నపానంబులం బరితుష్టి నొంది యర్హాపరికారంబుల నారాతిృ సుఖసుప్తిం బొంది రంతం గొంతప్రొద్దునకు నిశావిరామం బగుటయు. 135

క. కలువలమురు వెడలఁగఁ జు
క్కలు దివి నంతంత నొక్కొకటి దోఁపఁగ వె
న్నెల పడమటిదిక్కునకున్
బలపల నై యొడ్డగిలఁగఁ బలపల వేగెన్. 136

ఉ. తూరుపు తెల్లవాఱుటయుఁ దోడనె మంగళ పాఠకస్తుతుల్
మీఱఁ దదీయరావముల మేల్కని కాల్యసముచిత క్రియల్
దీఱిచి పాండుపుత్త్రి వసుదేవసుతుల్ ప్రమదంబు మోములన్
దేఱఁగ వేడ్కతో నరుగుదెంచి సభాస్థలి నిల్చి రంతటన్. 137

—♦ భీమాదులు భద్రావతీపురంబున కరుగుట. ♦—

సీ. ఆహవసన్నద్ధులై భీమ కర్ణసం
దన మేఘవర్ణులు ధర్మతనయు
పాదంబులకు మ్రొక్కి పంకజాక్షునకు
దండము వెట్టి యంతఃపురమున కరిగి
కుంతికి నెరఁగి వీడ్కొని వచ్చి వివ్వచ్చు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కుస్తరించి
యనఘ నేఁ దురగంబుఁ గొనివచ్చునందాఁక
సంగరరక్షకుఁడవై యధిపుఁగాచి

తే. యుండు మని మాది పుత్త్రుల నుపచరించి
ద్రౌపదికిఁ జెప్పి మఱియును దానవారి
యనుగులకు వ్రాలి యద్దేవు ననుమతమున
నరిగె ననుమోదమున యౌవనాశ్వపురికి. 138

క. అనుటయు విని జనమేజయ
జనపతి సంతసము నొంది జైమినితో న
య్యనిలసుత యౌవనాశ్వుల
కును దారసమైన రణముకొలందు లడుగుటయుఁన్. 139

శా. మల్లాంబావరపుత్త్ర గర్వితరిపుక్ష్మాపాలసంపత్తి వి
ద్యుల్లావణ్యకళాకళత్రమయలీలోల్లాసి బాహాసిమ
త్తల్లీనత్రసరంగదంగదసుహృద్ధాత్రీశకోటీరమా
ద్యల్లీలాకకుబంతవారణ సువర్ణాహార్యధైర్యోదయా. 140

క. ధరణీవరాహవార్జిత
ధరణీవరణాపరావతార మురారీ
ధరణీ వరాహ రక్షిత
ధరణీవరబృంద మహితదాన ముకుందా. 141

మాలిని. జనితమహితసంధా చారుసాహిత్యగంధా
వినయనయవిలాసా విద్వదంతర్నివాసా
ఘనతరమదగర్వగ్రంథిభారానవద్య
ర్జనపహృదయభల్లా రాయచౌహత్తమల్లా. 142

గద్యము. ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర నాద
యామాత్యపుత్త్ర పినయవిద్యాసముద్ర పినవీర
భద్రప్రణీతం బైన జైమినిభారతంబునం
దశ్వమేధపర్వంబునం
బ్రథమాశ్వాసము.

ఓం



శ్రీ

# జైమినిభారతము



అశ్వమేధపర్వము, ద్వితీయాశ్వాసము.

ఇష్టదేవతాస్తుతి.

శ్రీరమణచరణకలితవి
చారణ పరభయదఖడ్గశార్దూలమహో
ధారానఖముఖదారిత
వీరారికుగంగ గుండవిభువరసింగా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున కిట్లనియె నట్లు ధర్మజ వాసుదేవులచేత ననుజ్ఞాతుండై హస్తిపురంబు నిర్గమించి నిరర్గళ ప్రయాణంబులం గతిపయవాసరంబులకు. 2

—♦ భీమాదులు భద్రావతీనగరంబుఁ జేరుట. ♦—

ఉ. పావనికాంచెఁ గట్టెదుర భర్మశిరోగృహతుంగశృంగనం
భావితపద్మరాగజగభస్తిసమాజవిరాజమానలీ
లావిపరీతసాంధ్యనిశలం దిశలందు నలంకరించు భ
ద్రావతి యౌవనాశ్వసురరాజవిరాజదిరామరావతిన్. 3

సీ. స్ఫాటికమణిశిలాప్రత్యగ్రరచనాతి
బంధురవప్రకారభాసురంబు
పాతాళజలఝరీపర్యాప్తకల్లోల
సుకుమారపరిఖోపశోభితంబు

కనకసౌధాంచలకలితముక్తాఫల
రాజలీలాగరితారాగణంబు
కరినీలశిలావిశాలగోపురరోచి
రసమయజనితమిథ్యాతపంబు
తే. భవనకాసారకల్హారపద్మకుముద
పుండరీక నీలోత్పలషండసురభి
విపులమధుకరకలనాదవిజితపుష్ప
చాపవినదంబు భద్రావతీపురంబు. 4
ఉ. పంబిన వేదఘోషణల భాషణముల్ వినరాకహోమధూ
మంబులు గ్రమ్మి కార్కొనఁ ఖమార్గము గానఁగనీక యూపసం
ఘంబులనందడిన్ నడువఁ గాల్దెరు వైనను లేక సాధుర
మ్యంబును శత్రుభీషణము నై పుర మొప్పుచు నుండు నెప్పుడున్.
శా. నానాపక్వఫలాతిరమ్య తరుసంతానంబులన్ విస్ఫుర
న్నానాపుష్పలతా పరితానముల నానాపక్షిరావంబులన్
నానావర్ణ మృగపరిచారముల నానా కేళికుంజంబులన్
నానాభంగి నుతింప నొప్పుఁ బురి నానాభోగసంపన్నతన్. 6
ఉ. ఆనగరంబు వైభవము లర్కజసూతికిఁ జూపుచున్ మరు
త్సూనుఁడు గాంచె నొక్కయెడఁ దోయజహల్లకకైరవోత్పలా
నూనమరందగంధినటదూర్మి ఘటాపరిఘట్టనార్ద్రిమూ
లానఘకూలదేశసము దంచితపూగము వాస్తడాగమున్. 7
తే. కాంచి యాబావి యగుఁ దురంగములు నీరు
దావునది గాకయున్నను మ్యుశ్ఖురపరి
కాండముద్రలచేఁ సంకలిత మగుచు,
మృదురజోరాజి మెఱుఁగ నేఁడు పథంబు 8
క. తురగములు నీరు గొనుచ వ,
సరమును నేతెంచె మనము చాటుపడుద మి

గ్గిరిరాజంబున నని యరి,
గిరి మువ్వురు నరిగి కుంజగృహాసంస్థితులై. 9

తే. ఉండి కర్ణసుతుండు వాయుజునితోడ,
నృపతి కీతని కక్షోహిణీదశకము
కలిగినను నందునొక్కొంతగాని పెకలి,
యంతయునురాదు చనుదెంచుహయము బడిని. 10

సీ. త్రిపథగావాహినీతీరంబుఁ జేరిన
జనులపాతకసముచ్చయముఁ బోలె
సంవర్తశిఖిశిఖాజ్వాలకీలంబును
డాసినకాలకూటంబుఁ బోలె
వసుదేవసుతపదద్వయచింతనంబున
మలినమానసునిజన్మంబుఁ బోలె
సాధితగయుఁ డైనసత్పుత్త్రుఁ గాంచినపితృ
వర్గవిషమదుర్గతియుఁ బోలె

తే. నడఁగిపోవును నీచేత యావనాశ్వ,
భూమిపాలాశ్వరక్షితభూరిసైన్య
సముదయం బెల్ల నుగ్గునూచంబు లగుచు,
నీగదాఘాతమున నొక్కనిమిషమునను.

మ. అని సల్లాపము లాడు చున్న యెడ నుద్యద్వాద్యఘోషంబులున్
ఘనఘీంకారరవంబులున్ బృథుగళగ్రైవేయఘంటాకఠో
రనినాదంబులు గండదానజలధారాలోలరోలంబమో
హనఝుంకారములు న్నెలంగ నివహంబై వచ్చె శుండాలముల్. 12

వ. ఇత్తెఱంగున మత్తగజంబులు నచ్చిసరోవరంబుఁ జొచ్చి మచ్చికలు హెచ్చుమీఱం గరంబుల జలంబులు పూరించి కరులు కరేణువుల మీఁదను గరేణువులుకరులమీఁదనుఁ జల్లుచునల్లసిల్లుచు దంతకోరకంబులం గోరిక లీరికలెత్త మెత్తమెత్తనఁ గండూయనంబులు సేయుచు

శుండాదండంబులం బుండరీకంబులు వెదకి నిండినకుతూహలంబున గంతు మిగిలి వ్రేల్మిడుచు ననోన్యవదన సౌరభంబు లాస్వాదించి మోదంబున బృంహితంబులు సేయుచుఁ బిక్కటిల్లినమక్కువ నక్కతోడ నక్కనుఁ జెక్కతోడఁ జెక్కను, జెవితోడం జెవియును, బరితోడం బరియును సరిబెరయ నొరయుచుఁ బుష్కరాగ్రంబుల జలంబులు పూరించి చిమ్మనఁగ్రోవులం బోలె నొండొంటిపయిం జిమ్ముచు ననేక ప్రకారంబులఁ గ్రీడించి మాతంగుల బలవంతంబునం జలవిహారం బుజ్జగించి పురంబునకు మగుడు నంత. 13

సీ. నేమినిర్గతధారుణీ రేణుకల్పిత
తిమిరబృందస్యందనములతోడఁ
గల్పాంతరుద్రఫక్కారావధిక్కారి
సముదగ్రవాదఘోషములతోడ
వ్యాలోలమృత్యుజిహ్వాపల్లవాభీల
సందీప్తబిరుదధ్వజములతోడ
గ్రీష్మఘర్మత్విషద్భీష్మదీప్తిచ్ఛటా
కలితాస్త్రసుభటసంఘములతోడ

తే. వచ్చు సైన్యంబు చటులగర్వంబుఁ జూచి,
యౌవనాశ్వుండు గాఁబోలు ననుచుఁ గర్ణ
సుతుఁడు దిగ్గన లేచి చూచుచును నీరు,
ద్రావనేతెంచు హరులసందడిగఁ దెలిసి. 14

చ. పరువడి భూసురాస్యములభంగిఁ బదక్రమముల్ దలిర్పఁ ది
త్తిరినరులోష్ట్రకేకులగతిం గతు లొప్పఁగఁ జేరి వాహకుల్
పరిపరిలాగులం గుదియఁబట్టుచు రా వలనత్రయంబులుం
దురగము లేఁగు దెంచె నవె తొక్కిన చోటులు లొక్క కుద్ధతిన్ 15

చ. వివిధము లైనయశ్వములు వేలతరంబులు నీరుద్రావి పుచు
న్నవియును బోవుచున్నవియు నైనవి యూరయ నిందులోపలన్

పవనహయంబు వచ్చుట కసంబడ దింటన కట్టి గడ్డియుఁగ
గవణము నీరు చూపఁ బతికట్టడచేయఁగఁబోలుఁ బావనీ. 16

తే. అనిన వృషకేతుఁ గనుఁగొని యనిలసుతుఁడు,
పలికినారము తురగసంబంధ మైన
ప్రతిన లెన్నని ధర్మసంభవునియెదుర,
మనము దోయిడిచేతుల మగఁడు లెట్లు. 17

సీ. పుత్త్రహీనుం డైనపురుషునకుఁ బరలో
క సుఖముపొందు గల్గనివిధమున
నంగనాజితుఁ డైనయట్టిపాలసునకు
బంధుసంఘంబు చొప్పడనికరణి
మంత్రినిస్పృహుఁ డైనమనుజనాథునకును
స్థిరరాజ్యగరిమ సిద్ధింపనట్లు
శ్రీవిష్ణుపదభక్తి చిత్తంబులో
లేనివానికి శుభములు లేనిపగిది

తే. శంకరునిఁ బూజ సేయనిపంకమతికి,
గురుతరైశ్వర్య మొదవనిసరణి మనము
హయముఁ గొనిపోక విఫలప్రయత్నమునను,
గరిపురికి నేఁగు టపకీర్తికారణంబు. 18

క. అని మాటలాడుసమయం,
బున రథకరితురగభటసమూహము బహువా
ద్యనినాదభీషణంబై,
చనుదెంచెఁ దదీయవిపులసైన్యమునడుమన్. 19

భీమాదులు యజ్ఞాశ్వంబును జూచుట.

క. తురగంబు వచ్చెఁ బరిపరి,
మురువునఁ జరణములు నేల మోవకయుండఁగ

ధర బహువల్లభ యగుటను,
ఖురపుటములు మోపకుండఁ గొసరెను భంగిన్. 20

మ. వినుతానేకవిభూషణాభినవమై శ్వేతాతపత్రద్యుతుల్
తనపై వెన్నెలచల్లఁ జామరశిరోదంచన్మరుత్సంజరీ
జనితానందమున స్మరం బలరి నుత్సాహంబునన్ సార్వభౌ
మునిచందంబున నేగుదెంచె విహితాంభోజాకర క్రీడకున్. 21

క. ఈకరణి వచ్చుతురగముఁ,
బైకొని పట్టంగఁ దమకపడువుత్త్రిని నా
లోకించి వలదు వేగము,
నీకని వారించి మనుమనిం గనుఁగొన్నన్. 22

మేఘవర్ణుఁడు సైన్యంబుల మార్కొనుట.

సీ. భీమసేనునకుఁ బ్రణామంబు గావించి
మేఘవర్ణుఁడు విక్రమించి పలికె
నేఁడనడిమితేజీఁ దెత్తుమందలోఁ
జెవిపట్టి క్రీపు నీడ్చువవిధమున
దళము లేలెక్క నీసెలవు గల్గినఁ,
జాలుయౌవనాశ్వునిఁ దనూజాన్వితముగ
బలిమై మూటకట్టులు గట్టి తెచ్చెద
మ్రిచ్చులఁబోలె నీముందటికిని

తే. నేల మన కింత తురగంబ చాలు ననినఁ,
దడవు సేయక నిమిషమాత్రంబులోనఁ
దార్చికట్టెద నీయున్న తరువుతోడఁ,
గీచకాంతక నను విలోకింపు మనుచు. 23

వ. సంగరోత్సాహంబున నంగంబు వొదల నక్కుధర శృంగంబున నుండి లంఘనజంఘాలం బగుసింగంపుఁగొదమకరణి ధరణికిం జను దెంచి మించినమాయూపప్రభావంబునం గాలకంధరకంధరామాల

కాకోల విషమషీసగంధం బగునంధకారంబు గల్పించు కల్పాంత కాలమేఘంబుల నుత్పాదించి తన్ముఖంబున దిఙ్ముఖంబులం దళతళలు గడలుకొన విద్యుల్లతామతల్లికల నల్లుకొనం జేసియు నెల్లెడలఁ బెల్లుకొని యుల్కంబులు జల్లనం బినుగులు వడం జేసియు నుత్పాతంబులు గావించుచు దేవదానవాదులకు భయంకరంబుగా గగనవీథీవిటంకంబున నిలిచి మేఘనాదుండునుం బోలె మేఘనాదంబున సింహనాదంబు చేసి యద్దనుజసింహుండు విక్రమింప నవ్విక్రమంబు శకునింఁ డొక్కచారునివలన విని సక్రోధుండై యాక్రవ్యాదుం డెవ్వం డరసి రమ్మని యొక్కదూతం బుత్తెంచిన నతండు సత్వరంబుగ వచ్చి యంబరంబున శాంబరీడంబరంబు నెరపుహిడింబాపౌత్రుపాలికిం జనుదెంచి. 24

ఇంద్రుండు మేఘవర్ణునికడకు దూతను బంపుట.

క. నీ వెవ్వ రేల చేసెద,
వీవిపరీతములు నిర్జరేశ్వరుఁడు త్రి
కీవిభుఁడు తెలిసి రమ్మనఁ,
గా వచ్చితి నిజముఁ జెప్పఁగాఁ దగు ననినన్. 25

చ. అమరవిభుండు నన్నడుగ నంపెఁ గృతార్థుఁడ నైతి భీమసే
నుమనుమఁడన్ ఘటోత్కచతనూజుఁడఁ బేరున మేఘవర్ణుఁడన్
శమనజుఁ డశ్వమేధసవనం బొనరించుచు యౌవనాశ్వదు
ర్గమున మఖాశ్వ మున్న దనఁగా విని తెమ్మని పంపువెట్టినన్. 26

తే. వీత్రికై చేయుమాయావిభూతిగాని
యొండు గా దన విని దూత యుత్సహించి
యరిగి యవ్విధ మెఱిఁగింపనమరవిభుఁడు
సంతసమునొందె నిచటరాక్షసవరుండు. 27

సీ. ఒకచోట జీమూతనికరంబుఁ బొడమించు
నొకచోటఁ గురియించు నుపలవృష్టి

వెదజల్లు నొకచోట విస్ఫులింగంబులఁ
బడజేయు నొకచోట బిడుగుగముల
నతులవాతూలసంహతి ముంచు నొకచోటఁ
దొరఁగించు నొకచోట ధూమపటలి
నవరించు నొకచోటఁ జటులాంధకారంబు
నొకచోటఁ జెళ్ళెళమనుఱుఁమజేయుఁ

తే. జెక్కు లీగీతి మతియుఁ గల్పించి మించి
యహితసేనల నెల్లఁ జీకాకుపఱచి
పట్టి యశ్వంబు మూఁపునఁ బెట్టికొనుచు
గగనగమనంబు గైకొని కదలె వడిని. 28

చ. అతఁడు సమీర వేగమున నశ్వముఁ గొంచుఁడు వీధి నేఁగ న
ద్భుతపడి పోయెఁ బోయె హయముం గొనిదానవుఁ డంచు సైనికుల్
వితథఫలప్రయత్నులయి విస్మృతిఁ గ్గొన వేలుపుల్ కృపా
హితమతి మేఘవర్ణునిపయింగురియించిరి పుష్పవర్షముల్. 29

తే. ప్రసవవర్షంబు గురియించి ప్రస్తుతించి
త్రిదశులేఁగంగహయముతోఁ జదలనున్న
యతనిఁ గ్గొని భీమకర్ణాత్మభవులు,
సింహనాదంబు చేసిరి చెంగలించి. 30

వ. ఇవ్విధంబున భీమసేనపౌత్రుండు మాయాబలంబున హయంబు న
పహరించుకొని పోవుట భటులవలన విని యౌవనాశ్వమహీకళ
త్రుండు పుత్త్రబంధుజనమిత్త్ర సహితుండై నిర్గమించి క్రో
ధంబున నిష్ప్రతీపంబగు ప్రతాపంబున వెడలి వియత్పథంబునం జ
నురథికవీరుల నావేళ నాలుగువేల ననుప ననుపమానసంరంభం
బున విజృంభించి వార లంబరంబున కుద్గమించి మించినపరాక్ర
మంబునం జక్రశరశూల ముద్గరముసలాదిసాధనంబు లంకించుచు
నవ్వీరునిం జుట్టుముట్టిన నాజెట్టిబిరుదును దట్టువారక యట్టహాసం

బు చేసి బెట్టిదంబైన రాచట్టుఁ బెఱికి చుట్టుకొనిన మూఁకలఁగిట్టి వడిం జాఁపకట్టు వడంగొట్టి యమరపతిపట్టణంబునకనిచి పట్టి తెచ్చిన హయంబును ననిలుపట్టికట్టెదురఁ జెట్టుఁగొం గట్టిదండంబు పెట్టి నిలిచిననట్టియెడ.

### మేఘవర్ణుఁడు రాజసైన్యముతోఁ బోరుట.

చ. వెనుకొని యౌవనాశ్వపృథివీపతిసేనలు చుట్టుముట్టినన్
గనుఁగొని మేఘవర్ణుఁ డధికం బగురోషమునం దదీయసై
న్యనివహముల్ వడిన్ దఱిమినన్ సురుల లచ్చెరు వంది రప్పు డ
ద్దనుజుఁడు మందరాచలవిధంబున నబ్ధులవార్థిఁ జొచ్చినన్. 32

సీ. కలగుండు వడి హల్లకల్లోల మై చాలఁ
గలఁగె వాహినులు భంగములతోడ
గటకశోభితవిశంకటకూటములతోడఁ
బెకలె సపక్షభూభృచ్చయంబు
చండభాస్కరసముజ్జ్వలితహేతులతోడ
బాడబోద్భూతవిభ్రమము లడఁగె
నాలోలకీలాలహతులతోడఁ బెనంగి
కడలేనివివిధశంఖములు దేలెఁ

తే. బవనసుతపౌత్త్రిదుర్దాంతబాహుదండ
మందరాచలమంథానమథ్యమాన
యౌవనాశ్వమహీపాలకాగ్రగణ్య,
వర్ణితాఖిలవిపులసైన్యార్ణవమున. 33

క. ఈకరణి దానవుండతి
భీకరముగ రణము సేయఁ బిఱుతివియక వై
భాకరసేనలు శస్త్రా
నీకంబుల ముంచి రాతనిశరీరంబున్. 34

తే. అపుడు వృషకేతుఁ డమ్మహాహవముఁ జూచి
మేఘవర్ణుండు హరివిక్రమించి తెచ్చు
నవసరంబున నయ్యాజి నలసి నాఁడు
దలము గా దొక్కరునకు నీదళము గెలువ. 35

క. అని పలికి కార్ముకము గొని
యనిలతనూజునకు మ్రొక్కి యనుమతి గొని తాఁ
జనియె రణం బొనరింపఁగఁ
గనుఁగవ నునుసోఁగ కెంపు గడలుకొనంగన్. 36

శా. జ్యాటంకారకఠోరరావము దిశాజంఘాలమై మ్రోయఁ దీ
వ్రాటోపంబున యౌవనాశ్వనృపుసైన్యంబు ల్విలోకించి త
ద్ధాటీనిష్ఠురఖేలనంబునకు సంత్రాసంబు నొంద న్నిరా
ఘాటోత్సాహత మేఘవర్ణుఁడు మదిం గౌతూహలం బందఁగన్ 37

తే. ఇవ్విధంబున వృషకేతుఁ డేఁగుదెంచి
యలసినాఁడవు వత్స నీ వరుగు మనుచు
భీమపౌత్రుని ననిపి యుద్ధామసింహ
వృత్తిఁ బరసైన్యమత్తేభవితతి కుఱికి. 38

వృషకేతుఁడు సేనలం గునుముట.

ఉ. బాణనఖప్రకాండముల భద్రగజంబుల సంహరించి కం
ఖాణముల న్వధించి రథకాంశములన్ నుఱుమాడి సద్భట
శ్రేణుల మర్మనర్మములఁ జెండి విశృంఖలవృత్తి నాహవ
క్షోణిఁ జరించి జన్యజయశోభితనిష్ఠురసింహనాదుఁడై. 39

ఉ. హాటకశైలధన్వి త్రిపురాసురవీరుల సంహరించున
ప్పాటునఁ గార్ముకాంబుధరబంధురమార్గణవృష్టి ముంచినన్
ఘోటరథేభవీరభటకోటులు రూపఱి పోవ వీటికిన్
జే టెఱిఁగింపఁ గంఠగతజీవుఁ డొకం డరిగెన్ రయంబునన్. 40

సీ. అరిగి భద్రావతీశ్వరుఁ జేరి ప్రణమిల్లి
సేన లన్నియు నమసిన తెఱంగు
వీతిఁ గోల్పోయినవిధమును విన్న
వించిన రోషవిహ్వలచిత్తుఁ డగుచు
నెట్టెట్టురా దళం బెంతవచ్చె హయంబు,
పరుల కేగతిఁ బట్టుపడియె ననిన
దేవర నువ్వు రేతెంచిరి వారిలో,
నముకొత్తి కొంత సైన్యము వధించి
తే. నవనహారిఁ గొంచు నెగసె నద్దివికి నొక్కఁ,
డుఱికి బల మెల్ల నమయించె నొక్కఁ డతని
దండ నున్నాఁడు పెనునిట్టతాటివంటి,
గుదియ మూఁపున నవరించుకొని యొకండు. 41
క. అని విన్నపంబు చేసిన,
మనమున రోషాద్భుతములు మల్లడి గొన న
య్యనఘులు కారణజన్ములు,
జనులకు రేవరయ నిట్టి సామర్థ్యంబుల్. 42
చ. ముగురును నాథుఁ జూడఁగఁ ద్రిమూర్తులు తప్పదు లేక వాహమున్
బొగరున నొక్కఁ డెత్తుక నభోగతి నేఁగుట యెట్లు లెక్కకున్
మిగిలిన సేన నొక్కఁ డహమించి నధించుట యెట్లు వారిలో
మొగఁ దగువాని కింత మసి మోవక త్రుంగుట యెట్లు సైన్యముల్
తే. అశ్వమేధంబునకు విఘ్న మాచరించి,
తిరిగి యశ్వంబుఁ దిగిచినఁ దిగువ నిమ్మ
వారితోడన సంగరాధ్వర మొనర్చి,
దేవతల నెల్ల దృప్తిఁ బొందింతు ననుచు. 44
వ. ఆహవోత్సాహదోహలస్మృత సముత్సాహవిభుండు శతాంగమాతంగ
తురంగసుభట పుంగవసంగతుండై పురంబు నిర్గమించి సమరభూమి

సమీపంబునకు వచ్చి యాసమీపంబున యుగాంతకాలకాలుండు
నుంబోలెఁ బ్రచండగదాదండమండిత భుజోద్దండుండై భండనంబున
కెదురుచూచుచున్న వృకోదరు విలోకించి యలోకసామాన్యం
బు లగునతని తేజోవిశేషంబులకు నద్భుతంబు నొందుచు జన్యం
బున సైన్యంబు నెల్ల సమయించి సన్యస్తభయుండై నిజధనుః
కోటివిన్యస్తహస్తుండై యున్న వృషకేతుం గనుంగొని శిరఃకంపంబు
చేసి తనమనంబున. 45

ఉ. కంపితదిగ్విభాగముఁగ గాలిసి వచ్చిన నన్నొకింత వీ
క్షింపఁడు సైన్యముల్ సరకు సేయఁడు సింహకిశోరవృత్తిఁ గ
ర్జింపుచు నున్నవాఁడు మది మృత్యుభయం బిసుమంతలేక యీ
తెంపరి కర్మపాశములు ద్రెంపఁగ నిల్చినయోగికైవడిన్. 46

తే. అని బలంబులఁ గర్ణనందనునిమీఁదఁ,
బంపువెట్టిన వానిసంభ్రమము గాంచి
రోషతామ్రాక్షుఁడగుచు మారుతసుతుండు,
ఘనగదాదండ మంకించి కదలుటయును. 47

యౌవనాశ్వుండు వృషకేతునితోఁ బోరుట.

సీ. భీమసేనునిసముద్దామత గ్గొని
యెదురుగా వృషకేతుఁ డేఁగుదెంచి
యీరేడుభువనంబు లెత్తివచ్చినఁ గాక,
యల్పసైన్యంబు లక్ష్యంబె నీకు
నపుత్త్రి నన్ను మన్నించి చూచుచునుండు
నే నీక్షణంబున నీవు మెచ్చఁ
బగబలారణ్యంబు భస్మంబు చేసెద
నస్మత్కఠోరబాణాగ్నిశిఖల
తే. సకలజనులకు దేహంబు లస్థిరములు,
ప్రాయములు చంచలంబులు పౌరుషమునఁ

గాని త్రైలోక్యవర్తియైన కీర్తి,
గలుగ నేరదు తండ్రి యెక్కాలమునను. 48

మ. కరియానం బటుపాశహస్తబృఘశంఖగ్రీవ చక్రస్తనిన్
బరసేనారమణి న్వరించితి సురోభాగంబునన్ నిల్చి ని
ర్భరకేళిన్ విషమాస్త్రచిహ్నములు సేరన్ వాని గాదింక మా
ను రణోత్సాహము నీవు జన్యరతిఁ గాంతు న్నే యశస్సంతతిన్.

తే. నన్ను వరియించినది కారణంబుగాఁగ,
దేవరకుఁ గోడలైనసేనావధూటి
సిగ్గుపెంపున మొగము వాంచినది చిత్రి,
వైజయంతీనవాంశుకవ్యాజమునను. 50

ఉ. నావుడు వాయునందనుఁడు నందన పొమ్ము చమూవధూటి నీ
కైవసమైన లెస్స యటుగాక నినుం దల మీాఱ నేని దా
దావుల నిల్చి మద్భుజగదాపటువిభ్రమతాడనంబులన్
జేవ యడంతు నెందు గురుశిష్యఁ గదా నుతి గాంతు రంగనల్. 5

తే. వత్సనీవు పదాతివి వారు రథికు,
లెట్టుపంపుదు నిను మదిఁ గట్టచేసి
యనిన నీకృప నాకు వజ్రాంగిజోడు,
చింత వలవదు పనుపు మాజికిని ననుచు. 52

ఉ. భీముఁ బ్రదక్షిణించి మెయిఁ బెంపుచుఁ గెంపగుకన్నుదోయితోఁ
గాముకవృత్తి నేఁగి నవకం బగుచందన కుంకుమాబ్జభూ
శీమృగనాభికర్దమవిలిప్తఁ జమూసతి సాయకాంబరన్
సామజకుంభకర్కశకుచ న్వరియింపఁగ నుత్సహించుచున్. 53

క. వీతభయుండై యావృష,
కేతుఁడు గుతుకమునఁ బెండ్లికిం జనుగతిఁ బ్రి
స్ఫీతగతి వచ్చి ఘను తన,
చేత హతం బైనసమరసీమాభూమిన్. 54

సీ. ప్రథమపయోరాశిపగిది నొక్కొకచోట
ఔరకీలాలసంకలిత మగుచుఁ
కైలాసశైలంబుకరణి నొక్కొకచోటఁ
గిరిరాజవదనవిస్ఫురిత మగుచుఁ
పార్థ ప్రతిజ్ఞాజిభంగి నొక్కొకచోటఁ
బృథులరథాంగాతి భీమ మగుచు
శౌరిదక్షిణబాహుసరణి నొక్కొకచోటఁ
దళితసైంధవముఖోద్దామ మగుచు
తే. నిష్ఠురాత్మీయకింకరనికరనిర్భ,
దేవవరారాతిసైన్యప్రతీకశకల
వితతవిషమితసంగరోర్వీతలంబుఁ,
జూచి యుల్లన నగుచు నచ్చోట నిలిచి. 54
మ. తనపై వచ్చువిరోధిసైన్యముల నుద్యద్బాణజాలంబులన్
దనువుల్ సించియు నశ్వసంతతుల గాత్రంబుల్ విభేదించియున్
ఘనదంతావళకుంభికూటముల ముక్తాశ్రేణులన్ రాల్చియున్
దినానాథాత్మజసూతి రౌద్రరస మున్నిద్రస్థితిన్ జూపుచున్. 56
సీ. సైన్యంబు నీగతి సమయించుచును
వచ్చునతనిఁ గన్గొని యావనాశ్వవిభుఁడు
దంతావళము నెక్కి తపనపౌత్రునిఁ జూచి
యాదివిష్ణువుఁబోలె నాత్మలోనఁ
దెలియకున్నాఁడ నీకులగోత్రనామంబు
లనిసేయరాదప్పయుం బెఱుంగ
కెవ్వరితనయుండ వెద్దినీనామంబు
నీరాక కిపు డేది కారణంబు
తే. నాకు నెఱిఁగింపు మనిన భూనాథుతోడఁ
గశ్యపుఁడు వంశకర్త పంకజహితుండు

తాతత్రైలోక్యవినుతపవిత్రకర్ణుఁ
డనఘ మాతండ్రి వృషకేతుఁడంచు నన్ను 57

తే. ధర్మనందనునశ్వమేధంబుకొఱకు
వచ్చి కనుఁగొనునాతండు వాయుసూనుఁ
డతనిపౌత్రుండు తురగము నపహరించ
నేను నిల్చితి నిల్చిననేపలకును. 58

తే. అనుచు వృషకేతుఁ డాడిన యౌవనాశ్వ
ధరణిపాలుండు మదిఁ బ్రమోదంబునొంది
యనఘుయొక్కింత శ్రీమయూరధ్వజునుమిగులఁ
సలిపినాఁడవుతడవుకయ్యంబుచేసి. 59

క. నీవు పదాతివి నే దం
తావళరాజంబు నెక్కినాఁడఁ దగవుగా
దోవత్స యురద మెక్కుము
నావుడుఁ జెలువవు మోమునం దళుకొత్తన్. 60

చ. తరువులు తాలు గొల్లను బ్రదాత ల వెవ్వనివీట నట్టియా
సురపతి నర్థిఁ జేసినయశోనిధికూర్మిసుతుండ నీవు న
న్నరదముఁ బుచ్చుకొమ్మనెద వందిన వందినకాదె మీఁద సం
గరము ఘటిల్లునే చెలిమిగాఁ బనుఁగా కిటు మాట లాడినన్. 61

క. అనిన వృషకేతుఁ గనుఁగొని
యనురాగముఁ బొంది యౌవ్వనాశ్వమహీశుం
డనియె మును చూపుమా నీ
ఘనకార్ముకమ ఖశిలీముఖంబుల ననినన్. 6

చ. తురగముసుద్ది చెప్పిన నెదుర్కొనఁ గోపముతోడ నాత్మ మం
దిరములు నిర్గమించుచుఁ బ్రతిజ్ఞలు వల్కఁగఁ గాదు వారిని
ష్ఠురతరశౌర్యముల్ మొదలఁ జూపుము నాశరవృష్టి ముంచినన్
మరల జనింప దీబలము మంత్రిజలంబులు మీఁదఁ జల్లినన్. 63

సీ. అదియునుం గాక నీ కనుగుణం బైన యీ
బంధువర్గముఁ బుత్త్రపౌత్త్రచయము
సమదవారణహయస్యందనారూఢులై
చనుదెంచి యుభయపార్శ్వముల నిలిచి
బిరుదకాహళములు పెనుపడం బై మ్రోయ
ఘనశస్త్రరోచు లాకసముఁ బ్రాఁక
విజయకేతనములు వివిధంబులై క్రాలఁ
గాలు దర్పవ్యూహము సంగరముఁ జేయ
తే. మెండుకొని యున్నవారందుమీఁద నీకు
వార్ధకం బొత్తినది లావువయసు నాకు
నన్ను నేకాకి యని కన్గొనంగవలదు
శౌరికృప గాదె నాకు నక్షయబలంబు. 64
క. వల దిం కఁ బెక్కుమాటలు
తొలిపోటై నిలిచినాఁడ దుర మొనరింపన్
దలపడు మనుటయు నాతం
డలిగి మదావళము డిగి రథారూఢుం డై. 65
క. బెడిద మగు కార్ముకం బె
క్కిడి నిష్ఠురసాయకంబు లీరైదు వడిన్
దొడిగేయ నక్కుమారుఁడు
నడుమన యొకమార్గణమున నవి తుంచి వడిన్. 66
తే. అర్ధచంద్రశుగం బేయనధిపుగొడుగుఁ
జామరయుగంబుఁ దునుమ నయ్యసగుణధర్మ
రహితు లైనట్టికుటిలవర్తనులఁ గూడ
నజ్జనుని పీతిగుణములు సమసినట్లు. 67
ఉ. అంతటఁ బోక నూఁడునిశితాస్త్రము లుద్ధతి నేయఁ జూప మొ
క్కంతగఁ ద్రుంచి యశ్వనిహంబులు నొంచి నృపాలు దేహమున్

గ్రింతలు చేసి చొచ్చె విశిఖంబుల గహ్వరిఁ గూటసాక్షు ల
త్యంతకఠోరఘోరనిరయంబులఁ దూఱఁగఁ బోవుకై వడిన్.

చ. నరపతి యొండువిల్లొని గుణధ్వని చేసి కుమారుమీఁద ని
ర్భరగతి నేసె సర్వదిశరంబు లురంబునఁ గాఁడ నెత్తు రా
బిరుసగుగంటులం దొరఁగి పింజనఁగ్రొవ్వు రీతిఁ బాఱఁగా
నరుణమరీచిమాలికిరియ నర్కజుపట్టి వెలింగె నాజిలోన్. 69

సీ. అవ్విధంబున యౌవనాశ్వభీకరశాత
శరభిన్నవక్షుఁడై తరణిపౌత్రుఁ
డదరి బెట్బలిఁ గోల నడచినగతి రేఁగి
చండమార్గణచతుష్టయముచేత
రథరథ్యములను సారథిశిరోధియుఁ దుంచి
జననాథు నమ్ముల ముసుఁగఁ జేసి
తపనమండలము శస్త్రపరంపరలఁ గప్పి
కదన మంతయును జీఁకట్లు గొలుపఁ

తే. బొలిసి రాజన్యసేనలు కళవళింప,
వెలుఁగుపడఁ బావకాస్త్ర మవ్వేళఁ దొడిగి
నృపతి తత్కాండనివహంబు నీఱుచేసి
వారుణం బేసి యార్చె యవ్వహ్ని నార్చె. 60

—నృపకేతుఁడు మూర్ఛిల్లుట.—

ఉ. భానుజసూనుఁడుం గనలి పావక వారుణదారుణాస్త్రసం
తానము లేయ నద్ధరణినాయకుఁ డాగ్రహవృత్తినుద్ధతుం
డై నగబాణ మేసిన రయంబున నమ్మహనీయసాధనం
బేనికగుబ్బలిం గడవ నెక్కుడుగుండుల ఱువ్వఁ జొచ్చినన్. 71

మ. కులిశాస్త్రంబున నమ్మహాశిలల నుగ్గుల్ చేసి హాలాహలా
నలసంకాశము లైన బాణములు నోనాటింప నక్కన్మహీ

తలనాథుం . కఠోరభల్లమున వక్షంబేయఁ జండాంశు మ
త్తులితం బైనశరంబు నాటి వృషకేతుం డాజిలో మూర్ఛిలెన్. 72

చ. మిహిరతనూజుపట్టి రణమేదిని వ్రాలిన భీమసేనుఁ డా
గ్రహమునఁ జూచి కన్నులెదురన్ వృషకేతునిపాటు గాంచి యీ
యహితుల నెల్లడించి సవనాశ్వముతోఁ బురి కేఁగుదెంచి య
మ్మహిపతిఁ గాంచి యాశనిక్రియం బఫు డేమని విన్నవించెదన్.

క. ఆలమున యౌవనాశ్వను
పాలునివరపుత్త్రిమిత్త్రి బంధుయుతమునుగాఁ
గాలుని పురి కనుపక యీ
ఖాలునికోల దీఱ దనుచుఁ బట్టెకినుకన్. 74

వ. భీమసేనుండు రెండవదండధరుండునుంబోలె నుద్దండభుజాదండ భీష
ణగదాదండుడై కనలి ఖండనంబున కెదుర వేదండకాండంబులు
తండంబులై పయింబడం బడలువడం గనుపొట్టినయప్పట్టున
బడినయట్టలతిట్టలం జుట్టుకొని వెడలు శోణిత ప్రవాహంబులు
గురవిగాహంబులై పాఱం బాఱ వశంబు గాక తెరలి పొరలంబ
డువాహనంబులును దత్తటంబున నెత్తుటందడిసిజొత్తుపాపలవిధంబున
నొత్తొత్తులనలసి యమ్ముల తిత్తులైనరావుత్తులును నముల్లోలక
ల్లోలమాలికాభీల కీలాలకల్లితంబులం దలకిందుగాఁబడిశకలితాం
గంబులైనశతాంగంబులును జెంగటఁ గృతాంతపురపథికులైనర
థికులునుగూలంబులయోలంబులం గాలు గాలంబెనంగఁ దేలియా
డుకాలుబలఁబును గానాలంబు త్రిజగదాభీలం బయ్యెనప్పుడు.

ఉ. భీముని జానుదేశముల భీషణవాయువు లుప్పతిల్లి సం
గ్రామతలంబున న్విసరఁగా జతురంగసమస్త సై నిక
స్తోమము లభ్రమండలముతో నొగి యు      శోన ను
త్రామునివీటి కేఁగెడువిధంబున ది      గన్. 76

ఘ్నునిశితాస్త్రజాలముల నుగ్గఁగ సూతుఁడు రాజుమేనఁగ్రి
మ్మిన పెనుమూర్ఛఁ జూచి తటిమెఱ్ఱ వడితోడ రథంబు వీటికిన్.

ఉ. అంతట భానుమంతుఁ డపరాబ్ధికి నొయ్యనఁ జారె దిక్కులన్
సంతమసంబు మీఱె జలజాలంబులు డయ్యఁగఁ బాసె జక్కవ
ల్వంతలఁ దాఁకెఁ గైరవదళంబులనొక్కులు దీఱె రోహిణీ
కాంతునిరాకఁ జూచి కుతుకంబునఁ గేరెఁ జకోరదంపతుల్. 55

క. అప్పుడు గదిరినమూర్ఛం,
దెప్పిఱి యవ్వసుమతీపతి హితజనములన్
రప్పించి దైన్య మొందిన,
యొప్పమిఁ బరికించి నిజతలోదరి కనియెన్. 56

క. కలనన్ మనవారెల్లను,
బొలిసిరి నీదుర్ణయమునఁ బోయినయవి పె
ద్దలె నాకును స్త్రీబుద్ధిః,
ప్రళయాంతక, యనెడిపలుకిబద్ధంబగునే. 57

చ. అని తలకొన్న నెవ్వగయు నాగ్రహమున్ దమకంబు నాత్మలోఁ
బెనఁగొనఁ దద్వధూటిఁ బుటభేదనమున్ వెడలంగఁ ద్రోచి య
జ్జనపతి హేమరత్న హయసామజముఖ్యము లైనకానుకల్
గొని చనుదెంచి యన్నరునకున్ సవనాశ్వము నిచ్చి మ్రొక్కినన్.

ఉ. ప్రేమఁ గవుంగిలించుకొని పెక్కువిధంబుల నాదరించి సు
త్రామతనూభవుండు నియతం బొక యేఁడు దురంగరక్షగా
నా మనుజేంద్రునిన్ బయనమై చనుదెమ్మనునంత దక్షిణా
శాముఖవీథి నేగె ముఖసైంధవ ముద్భటవేగ సంపదన్. 59

చ. మగఁడు పరాభవింప నట మానిని భూరివిషాదవేదనన్
బొగులుచుఁ గాశికాపురికిఁ బోయి సమున్నతబాహువై భవుం
డగుతదధీశు నుల్ముకుని నాత్మసహోదరుఁ గాంచి యెంతయున్
దగిలినవంత నాతనిపదంబులపైఁ బడి యేడ్చె నేడ్చెనన్. 60

క. అతఁడు సహోదరిఁ గరుణా,
యతమతి నూరార్చి యొంటి సరుదెంచుట య
ద్భుత మీచందంబునకున్,
గత మెయ్యది యనుచుఁ దెలియఁగా నడుగుటయున్. 61

క. సవనాశ్వముఁ బట్టుట మొద,
లవనీపతి తన్ను వెడల నడచుట తుదగా
వివరించి చెప్పెనంతయుఁ,
గువలయదళనేత్రి పూసగ్రుచ్చినభంగిన్. 62

వ. చెప్పి మఱియునుం దద్విరోధంబు నిర్విరోధంబు సేయం దలంచి
యిట్లనియె. 63

చ. పఱచి దవాగ్నిఁ బడ్డశలభంబులకైవడిఁ బార్థుఁ దాఁకి రూ
పఱి సుతులున్ సహోదరులు నాలమునం దెగటాఱఁ జూచి నీ
మఱఁది భయంబునన్ గలఁగి మార్తునకున్ శరణంబు చొచ్చె నే
తెఱఁగున నైన నానెగులు తీర్పఁగ నెవ్వరు నీవు దక్కఁగన్. 64

క. ఈయాపదలకు మూలం,
బాయింద్రతనూజుఁ డతని నాహవభూమిం
జేయూరఁ జంపి నామదిఁ,
బాయనివగ పాపు మన నృపాలుఁ డబలతోన్. 65

చ. విను మిఁక నేఁటఁ జేపటన వీతిబడిన్ జనుదెంచు నర్జునుం
డని నెదిరించి పట్టెద మఖాశ్వముఁ దోడనె లంకె పెట్టెదన్
మనమున నూఱడిల్లు మన మానిని వాఁడు హయంబు పోవుతో
వనె చనుఁగాక యీకడకు వచ్చుట యెట్లనినన్ లతాంగితోన్.

క. రాకతఁడు గడచి పోయిన,
నేకార్యముఁ దప్పిపోవ దింతటిలోన్
శోకింపవల దవశ్యము
నీకొఱఁ తంతయును దీర్తు నింకొకవేళన్. 67

క. నావుడు ముట్టినజగడం,
బీవేళనె తీర్పనేని యేంక్లం బూండ్లన్
నీ వేమి తీర్చెదనుటయుఁ
నా వెలఁదుక జూచి పలికె నాగ్రిహ మెసగన్, 68

క. అతిమించి చొచ్చినిల్లటు,
చెఱిచితి విఁకఁ బుట్టినిల్లు చెఱిచెద ననియే
పఱతెంచితి రెండిండ్లకుఁ,
జెఱుపనచేట వయి తేమి చేసెడి దనుచున్. 69

క. విడనాడఁ జూచి మును పిడు,
గడిచినతనిఁ గొఱివిఁ జూఁడిన ట్లగుటయు న
క్కడ నుండ కేఁగె మదిలోఁ
మిడుకుచు భాగీరథీసమీపంబునకున్. 70

♦అర్జునుని గంగ శపించుట.♦

తే. ఇంతి యటఁ జని పేరోడ యెక్కి దరికిఁ
జనఁగ దనవామచరణ మజ్జము సోఁక
నంటితి నమశ్శివాయ పాపాత్మురాలి
నంచు నాదీప్పవతిని దూషించుటయును. 71

క. అచ్చోటితీర్థవాసులు,
వచ్చి తగునె నీకుఁ బుణ్యవాహిని నిటు వా
కుచ్చితి వని వడి నందఱు,
గ్రిచ్చగదలినట్లు గున్నకరిగొని తిట్టన్. 72

సీ. అద్దివ్యతటిని ప్రత్యక్షమై ముందఱ
నిలిచి యిట్లనియె నోనిర్మలాంగి
నాయందు నెట్టియన్యాయంబు పొడగంటి
వెఱగింపు మనిన నత్తెఱవ నీవు

సుతుల నేఁడ్వురను మ్రింగితివి తోడ్తో నిల్పఁ
గడపట నొకఁ డుప్పఁగల్లువోలె
నట్టినత్యవ్రతు నర్జునుండు వధించె
ననిలో శిఖండిప్రాపునఁ గడంగి

తే. యతనికొలయును నెడపలే వైతిగానఁ,
బుత్రహీనవు నిన్నంటఁ బోల దనిన
నలిగి పార్థునిశిర మారు నెలల కుర్వి,
డ్రెళ్ళ శపియించి దేవి యదృశ్య యయ్యె. 73

క. జ్వాలయు నాదివిజనదీ,
కూలంబునఁ జతి యమర్చుకొని చిత్రముగాఁ
గాలి ధనంజయుఁ జంపఁగ,
నాలో మృత్యుస్వరూప మగుశర మయ్యెన్. 74

చ. అట మఖసైంధవంబును జవాతిశయంబున వింధ్యభూమిభృ
త్కటకసమీపనీపతిలక క్రముకార్జునదాడిమీశమీ
కుటజకురంటకామలకగుగ్గులుసాలరసాలపాటలీ
వటలవలీలవంగవనవాటిక లుద్ధతిఁ జొచ్చి పోవుచున్. 75

తే. ఎదుర ఘన మైనరొకశిలఁ నదియఁ బోయి
బరులకండూతివాయ బిట్టొరసికొనఁగ
నంటుకొనె నధ్వరాశ్వ మగ్గుంటితోడ
జిగురుగడ దాఁకి విహగంబు దగిలినట్లు. 76

చ. అది గని సైనికుల్ గడుభయంబునఁ జేరి మహోపలంబుతో
నదికినరీతిగ నున్న నవనాశ్వము ధేయని కర్కశంబులన్
సరిసదగాఁగ వ్రేసియును జాటులఁ బెట్టియు నేమి చేసియున్
గదలుపలేక యవ్విధము కవ్వడి కేర్పడ విన్నవించినన్. 7·

♦అర్జునుండు సౌబరియాశ్రమంబునకుం బోవుట.♦

క. అరుదంది హయము పడియెఁడు
దురవస్థకు నేమివెరవు దోఁప కచటిసౌ
బరి యనుమునివరుఁ జేరఁగ
నరుదేరఁ దదాశ్రమాంతికారామమునన్. 78

సీ. భేరుండములు పక్కఁ బెట్టి చన్నులపూరం
వాటించి శరభడింభములకిచ్చు
శరభముల్ శయనించి హరికిశోరములను
బొదుగుల బాలిచ్చి నిదుర పుచ్చు
సీనినసింగంబు లేనికలేఁజూళ్లు
గుడువ మైనాకుచుఁ గుస్తరించు
లేడిపిల్లలకు బాలెంతచివ్వంగులు
పంకంబు లిచ్చుచుఁ బంచితిల్లుఁ
తే. బకములుగప్పి పసిపాపపాములకును
మేపులొసఁగి రక్షించు లెమిళ్లు పిల్లు
లెలుకబోదలఁ బ్రోలుఁ జన్నిచ్చి యచటి
జంతునివహంబు జాతివైషమ్యముడిగి. 79

వ. అవ్వనంబున కనతిదూరంబున సర్వసైన్యంబుల నిలువనియమించి
ప్రద్యుమ్నవృషకేతనానుసాల్వ యౌవనాశ్వ సీలధ్వజసమేతంబుగా
జని చని ముందట. 80

ఉ. అక్షయపుణ్యశీలు నిగమార్థరహస్యకథాప్రవీణు రు
ద్రాక్షవిభూతివల్కలమృగాజినశోభితగాత్రు శ్రీమద
ష్టాక్షరమంత్రలబ్ధమహిమాధికు సౌబరిఁ గాంచి యాసహ
స్రాక్షతనూభవుండు వినయంబునఁ జాఁగిలి మ్రొక్కి యిట్లనున్.

చ. శమనతనూభవుండు మునిసత్తమ గోత్రవధం బొనర్చి చి
త్తమున సపారమైనపరితాపము నొందఁ బరాశరాత్మజుం

డు మనుజనాథుఖేదముఁ గనుంగొని యూఱడఁ బల్కి యశ్వమే
ధమున కుపక్రమింపు మనెఁ దద్దురితాతిశయోపశాంతికిన్. 82

సీ. మునిసార్వభౌముపంపున ధర్మతనయుండు
భక్తిఁ జైత్రశుద్ధపౌర్ణమాసి
దీక్ష గైకొని ధరిత్రీదేవతలకు
నుక్తప్రకారంబున దాన మొసఁగి
హీతి నర్చన చేసి విడుచుచో నేనును
బయనమై హరికి భూపతికి మ్రొక్కి
చన యౌవనాశ్వానుసాల్వనీలధ్వజ
ప్రద్యుమ్న కర్ణసంభవులతోడఁ

తే. గదలి దేశంబు లన్నియుఁ గడచివచ్చి
వచ్చి యీవింధ్యవనవాటిఁ జొచ్చి యోజ
నాయతం బగుశిలతోడ నంటుకొనియె
సప్తతంతుతురంగ మోసంయమీంద్ర. 83

క. కావున నీమహనీయ
గ్రావంబున నంటువడ్డక్రతుసైంధవ మిం
కేవిధమున విడువడి చను
నావిధ మెఱిఁగింపవే దయానిధి యనినన్. 84

సౌబరిమహాముని యర్జునున కుద్దాలకమునిచరిత్రంబు చెప్పుట.

క. విను ముద్దాలకుఁ డనియెడు
మునివర్యుఁడు బ్రహ్మచర్యమును జరిపి వరిం
చెను జండిక యనుపేరన్
జనుకన్నియ నతిపరుషవచన దుశ్శీలన్. 85

తే. బాల్యముననుండి యౌవనప్రాయమైన
యపుడుఁ దనభార్యయందు నయంబొకింత

గానఁ డయ్యెను వేము వెగ్గలము పెరుగఁ
గలదె మాధుర్యగుణము తిక్తంబకాక.

సీ. సంధ్య వార్వఁగ నిమ్మజలపాత్ర మనఁ బోవఁ
గొట్టిన నతికించుకొనఁగ వలసెఁ
దడిదోవ తిమ్మన్న నడిమికి వడిఁ జింపఁ
గట్టుకోఁబడె బ్రహ్మకమ్మి వైచి
యక్షమాలికఁ జూపు మనఁ ద్రెంచి వైచిన
బనిచెడి మఱి గ్రుచ్చుకొనఁగవలసె
సమిధ లిమ్మన్న వ్రేలిమిగుండ మార్చిన
నూఁదుకోఁబడె మండ నొకవిధమున
తే. ననుదినము నిట్లు ప్రాతికూల్యము భజింపఁ
జండికతమునమునిబ్రహ్మచర్యనియమ
మునకు గృహమేధివర్తనమునకుఁ దొలఁగి
రెంటికినిజెడ్డరేవనిరీతి యయ్యె. 87

క. అంతట ముని కౌండిన్యుఁ
డంతేవాసులు భజింప నరుదెంచె మదిన్
జింతిలునుద్దాలకుని ని
శాంతమునకుఁ దీర్ఘయాత్ర చనియెడుత్రోవన్. 88

క. చనుదెంచి యర్ఘ్యపాద్యము
లొనరించి నమస్కరించు నుద్దాలకునిం
గని సేమ మడుగ నెగులునఁ
దనసతిగతిఁ జెప్పవిని యతని కిట్లనియెన్. 89

తే. అయినపని కింక నేమి సేయంగ వచ్చు
నగ్నిసాక్షిగ నుద్వాహ మైనవెనుక
విడువచ్చునె సతు లెంతవెఱ్ఱు లైన
దీని కొకయుక్తిఁ జెప్పెదఁ దెలియవినుము. 90

క. చేయఁగవలసినకార్యము
చేయకు మను మదియుఁ గడఁగి చేయునిజముగాఁ
జేయనికార్య మవశ్యము
చేయు మనుము చాలు నదియుఁ జేయక మానుః. 91

ఉ. కాన మదీయవాక్యములు గైకొని-నెమ్మది నూఱడిల్లు మం
చానతి యిచ్చి యమ్మునిగృహంబున మజ్జనభోజనాదులం
దా నతితృప్తిఁ బొంది మఱునాఁ డిదె వచ్చెద నెల్లి గౌతమీ
స్నానము చేసి యంచు మునినాథుఁడు శిష్యులుఁ దాను నేఁగినన్.

తే. చండి వినుచుండ నుద్దాలకుండు వలికె
నహహ నాయింటఁ బైతృకం బనుచుఁగాదె
యెల్లి వచ్చెద ననిపోయె నీతపస్వి
పైతృకం బేల తన్నుఁ జెప్పంగ నేల. 93

క. తిథి యని చేసిన నథవా
విధవానందనుల ఖలుల వృషలీపతులన్
బధిరుల నవైష్ణవుల న
న్యధనాపహారులనుఁ గాని యర్చ్యులఁ జెప్పఁ. 94

క. ఉలవలు చామలు కోద్రవ
ములు కందులు రాజమాషములు నిష్పావం
బులు చణకంబులు దవ్విం
దలు జొన్నలుఁ గాని కూర్పఁ దగుధాన్యంబుల్. 95

ఆ. ఉల్లి పుచ్చకాయ ముల్లంగి సొరకాయ
పిండికూర నేతిబీరకాయ
చిట్టిమేడికాయ చెంచలి వంకాయ
గాని మంచికూరగాయఁ దేను. 96

వ. మఱియు నొక్కటి వినుమెల్లి తెల్లవారినంగాని ధాత్రీనుపర్వల
నీరాత్రినియమింప నియమించిన నపరాహ్ణంబునంగాని కుతపకా

లంబునం బెట్ట నట్టింట దట్టంబుగాఁ జిట్టుముకయు గోర్పడంపు బట్టలు నెఱపుదుం గాని గృహంబ లంకరింప బ్రాహ్మణులకు వస్త్రదక్షిణ లొసంగ శ్రాద్ధంబ శ్రాద్ధంబు గావింతు ననినమండి పడిచండి సకల విద్యావిచక్షణు లైనభూసురాధ్యక్షుల నిశాసమయంబునంద క్షణి యించి రంగవల్లికాదులచేత నిలుముంగిలి శృంగారించి తానునుం గృతస్నానయై మాషముద్గయవశాలి గోధూమాదిమనోహరధా న్యంబులు యోగ్యంబులైన శాకంబులు పాకంబు లేర్పడంజేసి పేక్ష్యంబు లైనభక్ష్యంబులు పాజ్యంబులైన భోజ్యంబులు స హ్యంబులైనలేహ్యంబులు సంస్తవనీయంబు లైనపానీయంబులునూ తనభాండంబులు నిండ నలంకరించి దక్షిణానవస్త్రయుక్తంబుగా శ్రా ద్ధంబుయుక్తకాలంబునంద నిర్వర్తించినంగని యుద్దాలకుండు పెద్ద యుంబ్రొద్దు సంతోషించి యిష్టులుం దానునుందుష్టిగా భుజించుస మయంబున. 97

క. కమలవనీబాంధవబిం,
బము బింబఫలాశపాలి పాటలరుచిఁబ
శ్చిమధరణీధరసౌధా,
గ్రముపైఁ గనుపట్టెఁ గనకకలశముభంగిన్. 98

క. ఆలోనఁ జండితోను,
ద్దాలకుఁడిట్లనియె సమ్మదంబున విపరీ
తాలాపసరణి మనమున,
శీలింపక తుష్టిగా భుజించినకతనన్. 99

క. ఈపార్వణంబు గొని గం,
గాపావనజలములోనఁ గలుపుమటన్నన్
గోపించి చండియింటిప,
మీపంబున నున్నపెంటమీఁద న్వైచెన్. 100

...హించి నిజభార్యం జూచి నిర్భాగ్యురా
ల పెంట్రో బలుపార్వణంబు నవలీలం బెంటపై వైచికుం
టుపడన్ జేసితి శ్రాద్ధకర్మ మనికన్గోసల్ చిగుర్పంగవే
శపియించెన్ ఘనవింధ్యశైలవనిఁ బాషాణత్వమున్ బొందగన్ 101
చ. అని శపియించినంగడు భయంబునఁ గంపము నొందుచుండఁగ
న్గౌనిముని శాంతచిత్తుఁడయి కొన్నిదినంబుల కిందుధర్మనం
దనుమఖవాజి నిన్నొరసి తారొకనిన్ విడిపించ వచ్చు న
ర్జునుకరపంకజోదరము సోఁకి కృతార్థవు గమ్ము పొమ్మనెన్. .02
సీ. ఇది శిలావృత్తాంత మింద్రనందన నీవు
తటకునఁ జనికరతలంమునందు
నంటుము విడివడు నశ్వమేధహయంబు
సతియును శాపమోక్షంబుగాంచు
ననిన నమ్మునికి సాష్టాంగంబుగా మ్రొక్కి
యమరేంద్రనందనుఁ డట్లచేయ
శిలతోడనంటు వాసెహయంబు రఘురాము
నంఘ్రిరేణువున నహల్య వోలెఁ
తే. జండియును వేగశాపమోక్షంబు గాంచె,
నంతనుద్దాలకుండు సన్న్యాసియయ్యెఁ
గాని గార్హస్థ్యధర్మంబుఁ బూనఁడయ్యెఁ,
జరుణి చేసినవెనుక రోఁతలఁ దలంచి. 103
మ. హయరత్నంబును వింధ్యశైలవనరథ్యాసీమముల్ దాఁటి దు
ర్జయసైన్యంబు లశేషశేష భుజగేంద్రస్ఫారభోగావలీ
భయదాహంకృతిఁ జూపుచున్ గదల శుంభత్కీల హంసధ్వజా
హ్వయభూపాలకు చంపకాపురము డాయంబోయె వేగంబునన్.
క. అహయము వెంటఁ గూడిను,
హాహావసన్నాహ విక్రమాటోపకళా

సాహసికయోధవీరుల,
తో హరిహాయసుతుఁడు వచ్చె దోర్గర్వమునన్.

క. అధ్వర ఘోటకమును నా,
నాధ్వజినయుక్తుఁ డగుధనంజయుఁ గని దూ
తాధ్వగులు చెప్పవిని హం,
సధ్వజుఁ డిట్లనియె వృద్ధసచివులతోడన్. 116

## హంసధ్వజమహారాజు యుద్ధము.

చ. ఇట మఖవాజివెంట నమరేంద్రితనూజుఁడు వచ్చుచున్న వాఁ
డఁట చతురంగసైన్య యుతుఁడై చని యేనునుతత్తురంగమున్
దటుకునఁ బట్టెదన్ ఘనరణం బొనరించెద నంతభక్తసం
కట మెడలింప వచ్చుహరిఁ గాంచి కృతార్థుఁడనై సుఖించెదన్.

క. అనిసంగర సన్నాహం
బునఁ దమ్మని విజయపటహమును వేయింపన్
వినినిల్వక వెల్వడెఁ గ్రి,
తునసైన్యము లెల్లఁ గోలఁ గొట్టినభంగిన్. 108

సీ. జననాథ హంసధ్వజునకు సప్తతిసం
ఖ్యసైనికు లత్యంతశౌర్యనిధులు
ప్రతిసైనికునకు డెబ్బదివేయుగ
జంబు లన్నియు మణిస్యందనములు
జవసత్త్వములుగల్గు సైంధవంబులు లక్ష
వివరింపనందరు వీరభటులు
ధనబల సురథసుధన్వ సుబల ధర్మ
బాహులవ్విసుమతీ పాలసుతులు

తే. వీరువారన కందరు విష్ణుభక్తి
నిరతు లందఱు నేకపత్నీ వ్రతస్థు

ందఱును సత్యభాషణు లందఱును వ
దాన్యులందఱు నాహవోత్సాహరతులు. 109

తే. ఇట్టిసేవలతో నమ్మహీశ్వరుండు
వెడలుచును శంఖలిఖితు లనెడు పురోహి
తుల నియోగించి రానివారలను వైపుఁ
డరసి కాఁగినచమురుఁగొప్పెరలలోన 110

ఉ. అంచురథంబు నెక్కి వసుధాధిపుఁడేగఁ బురీవిలాసిను
ల్గాంచనసౌధజాలకములన్ గుతుకంబునఁ జూడఁ దత్కటా
క్షాంచలరోచు లత్తనువు నంటిసనొప్పెఁగిరీటిఁ దాఁక నూ
హించినమాత్ర నెల్లు దివిజేశ్వరుఁ డయ్యె నరేశ్వరుండనన్. 111

చ. అనికి సుధన్వుఁ డేగ నపుడాయిశ్మై జనయిత్రిఁ గాంచి వం
దన మొనరించెన్ సుతునిఁ దల్లియుఁ గౌగిటఁ జేర్చెఁ గీర్తిఁ గై
కొను మని పంచెను గువలఁ గూరిమిసోదరిఁ దల్లియట్ల వీ
డ్కొని వెస నాత్మగేహమునకున్ జనుదెంచి ముదంబుతోడుతన్

సుధన్వుండు యుద్ధంబునకు రాక తడయుట.

క. తనదేవి యగు ప్రభావతిఁ,
గనుగొని గమనగతిఁ జెప్పఁగాఁ దొయ్యలి నా
థునకు ఘనసారనీరా,
జనమర్పణచేసి కేలిసౌధము సొంతన్. 113

క. తనకోర్కి విన్నవించిన,
విను మిప్పుడు వేళ గాదు విజయుని నాలం
బున గెలిచి వేగ వచ్చెద,
ననపుము నీవన్న మఱియు నధిపునితోడన్. 114

చ. తలఁపఁగ నేఁటి దాఁక ఋతుధర్మము దాటవు గాన నీకు నేఁ
దెలియఁగ విన్నవించితి మదీయమనోరథకల్పవల్లిక

స్ఖలితము చేసి పొమ్మ కదనంబున గన్న దివాప్రసంగముల్
గలవె మహాగ్రశాసనుఁడ గాఁడె నృపాలకుఁ డాగ్రహించినన్.

చ. నియమితదుందుభిధ్వని వినీనినదమ్మిం బురిలోనినై నిరుల్
హయరథవారణేంద్రసుభటావలితోడఁ గిరీటిఁ దాఁక ని
ర్భయగతి నేఁగి రెంకఁ బిదపం జన నేమను భూవిభుండు ని
ర్దయమతు లెన్న శంఖలిఖితప్రవరుల్ దెలియంగ జెప్పితిన్. 116

తే. రమణి తావకఋతువాసరములు పెక్కు,
గలవుగాని విరోధి నెక్కటి జయించి
నిలువ మఱిలేదు దివసంబు నేఁడు దక్క,
సమర మొనరించి వచ్చి నీచనవుఁదీర్తు. 117

చ. అనవుడు నేఁటితోడఁ బదియారుదినంబులు నిండె మొందటన్
దినములు లేవు పైతృకతిథిన్ ఋతుకాలము సేయఁ జెల్లు యా
మినికడజామునన్ వినుసమాగము చేసెద నంచు నిట్లు పో
వ నుచిత మౌనె నీ వెఱుఁగవా నిగమార్థరహస్యధర్మముల్. 118

చ. కలనికి రాక తక్కనని కాగినమానెయతొట్రిలోపలన్
దోలఁగక పట్టి శంఖలిఖితుల్ పడద్రోయుదు రంచు నాత్మలో
నలికెదు భ్రూణహత్యకు కృతాంతునిదూతలు చేయుబాధ లీ
కొలఁదులె మీఁద నంచు గిఱికొన్న మనోజవికారవేదనన్. 119

ఉ. ఇందునిభాస్య నాథుఁ జన నీయక మంగళభూషణద్యుతుల్
గ్రిందుకొనంగ డగ్గఱి యురంబున బింకపుగుబ్బ చన్నులం
టం దమకంబుఁ గాకయు ఘనంబుగ మక్కువఁ జేర్చెఁగౌగిటన్
గందపుమ్రాకుతావి గొనగా బెనగొన్నభుజంగి కైవడిన్. 120

క. జననాథసుతుండు కామిని
చనవుం బెల్లించి కానిఁ జనరా దనుచున్
దనిపె రతికేళి నవుడ,
త్యనురాగముతోడ నంత హంసధ్వజుమున్ 121

ంబునకు సుధన్వుండు రాకుండు టెటింగి మండిపడి మహీ
ఁడు దండధరకింకరభయంకరవిశంకటపటుభుజాహంకారు లైన
లెంకనాయకుల వంకంగనుంగొని మీర లాజ్ఞాభంగంబు గావించు
నక్కుంచు నొక్కించు కంఠయు విచారించక పట్టుకొనిపోయిమత్పు
రోహితులముందఱం బెట్టి రండు పొండనిన మహా ప్రసాదం బని
పంపువడి చంపకాపురంబున కరుదెంచువారు ముందట సఫలిత
సతీమనోరథుండును నారూఢమణిరథుండును నాహవోత్సాహసం
పాదకవచుండును నాబద్ధగోధాంగుళీత్రాణతూణీరకవచుండును
నధిజ్యధనువ్వుండును నై వచ్చు సుధన్వుం గాంచి కోపించి. 122

చ. తగునె సుధన్వ నీకు వసుధాతల నాథులయాజ్ఞ మీఱి యి
ప్పుడి రయంబు దక్కి పిదపన్ జనుదేర విభుండు నీపయిన్
మిగులఁగ నాగ్రహించి బలిమి న్నినుఁ బట్టుకపోయి ధర్మశా
స్త్రగురువు లైనశంఖలిఖితద్విజవర్యుల చేత కిమ్మనెన్. 123

చ. అనవుడుఁ దండ్రియందుఁ బతియందు సుతుండును బంటు నర్థసం
చనమును బ్రాణవంచనము సంగతి గా దొనరింప నక్కఱై
నను సెలవైనఁ దండ్రియును నాథుఁడుఁ దా నటుగాన నాకు న
జ్జనకునియాజ్ఞ సేయుటయె జన్మఫలం బని తేరు డిగ్గినన్. 124

క. పట్టి మరళాధ్వజస,
మాప్తుపరిజనములు రాకుమారుని నంటం
గట్టుకొని శంఖలిఖితుల,
కట్టెదుఱం దెచ్చి రాజ్ఞఁ గడవఁగ రామిన్. 125

సీ. తెచ్చి యీతఁడు ధరిత్రీనాయకుఁడు
సవ్యసాచిపై దండెత్తి చనెడుచోట
రాజువెంటనె కొల్చి రాక కృష్ణునిపాద
కమలంబులను భక్తిఁ గాన లేక

యంగన ఋతుదాన మడుగ నింటనె నిల్చి
కామాంధుఁడై యాజ్ఞగడచెఁ గాన
నృపసూనుఁ డని చూడ కవుడు మీ మొండటఁ
జేసినశపథంబు చిత్తగించి

తే. యీకుమారు సుధన్వుఁ బోనీక బలిమిఁ
దప్తతైలకటాహమధ్యంబునందుఁ
గట్టివేయింపుఁ డనినఁ గింకరులతోడ
లిఖితుఁ డిట్లను శంఖుఁ డాలించి వినఁగ. 126

క. తనపలుకు సత్యముగ నే
మనుజుఁడు భూమండలిన్ సమర్థింపఁడు ప
ర్విన భయలోభంబున స,
జ్జనపతి పడు రౌరవముల శతవత్సరముల్. 127

మ. తనరాజ్యంబును విశ్వధాత్రియును దాత్పర్యంబునం గాధిపు
త్రునిఁ కర్పించి కళత్రమున్ వరకుమారున్ గాశిలో విక్రయిం
చి నిరూఢం బగుసత్య మూర్వరఁ బ్రతిష్ఠించెన్ సురల్ మెచ్చఁగా
జననాథాగ్రణి సార్వభౌముఁడు హరిశ్చంద్రుండు విఖ్యాతిగన్.
సుధన్వుఁడు తప్తతైలకటాహమునఁ బడి బ్రదుకుట.

క. వనమునకు రామచంద్రుని
ననిచి దశరథక్షితీశుఁ డఖిలము నెఱుఁగన్
మును కైకతోడ నాఁడిన
తనసత్యము నిలిపికాదె తనువుఁ దొఱంగెన్. 129

ఉ. సత్యహీనుఁడై చను రసాతలనాథునితోడఁ జేయుసాం
గత్యము కోటి వచ్చినను గాదు సుధీజనకోటి కాశ్రియా
వ్యత్యయభూతి నెవ్వఁ డభివాంఛితుఁడౌ భువి నట్టిసత్యరా
హిత్యుఁ డొనర్చుదుష్కృతుల కెల్లన్ బురోహితుఁడెల్లయాఁడుదిన్

డననేల మహీ
...యాజ్ఞ యలంఘనీయపథ మగుట సుహృ
త్పితృమాతృబాంధవానుజ
తతి మొదలుగ వధ్యు లన నతం డెల నగుచున్. 131

చ. అలఘు భయంకరాహవముఖార్జితరత్నవిభూషణావళుల్
చెలఁగుచు నూడ్చి మాల్యతులసీపవిత్రసరోజబీజమాలికా
కలితవిశాలవక్షుఁ డయి కంజదళాక్షునిఁ బీతవాసు హృ
జ్జలజనివాసుఁగా నుపనిషద్వచనంబులఁ బ్రస్తుతించుచున్ 132

చ. తడయక మంచుతైలపరితప్తకటాహము కేలుదామరం
దొడికిలి పట్టి రాహువు విధుం గబళించినరీతిఁ జూపఁ గ్రొ
మ్మడుఁగున కేఁగుభద్రకరిమాడ్కి సుధన్వుఁడు చొచ్చె బిట్టుగా
నుడికెడినూనెతొట్టి బలియుర్ హరిదాసులు సత్యసంపదన్. 133

క. కీలిశిఖాముఖదారుణ
తైలకటాహంబు కంఠదఘ్న మయిన భూ
పాలసుతువదన మొప్పెన్
గాళిందీనదములోనికమలముభంగిన్. 134

క. ఆహేమకృతకటాహ
స్నేహము దనుజారిదాసునికిఁ జారుశర
త్స్నేహాఁకిరణచంద్రిక
యై హర్ష మొనర్చుచుండె నాసమయమునన్. 135

తే. శంఖలిఖితద్విజన్ము లాశ్చర్య మంది
యిక్కుమారకుఁ డిట్లుండు టెల్ల నింద్ర
జాలవిద్యావిధంబు గాఁబోలుఁ దైల
మరసి పరిశోధనము చేయ నర్హ మనుచు. 136

సీ. రయమున నారికేళఫల మొక్కటి వేయ
బటిలి పెంచికలు నొప్పించెఁ బ్రజల

వీక్షించి యప్పు డాద్విజులు తప్ప దితండు
హరిభక్తిరతుఁడు ప్రహ్లాదునట్లు
విష్ణుభక్తుఁ బరాభవించినదురితోప
శాంతికి దప్తకాంచనకటాహ
గర్భితస్నేహావగాహంబుముఖ్య మీ
దేహంబులకును సందేహమేల
తే. యనిప్రవేశంబు చేసి రుద్యత్కఠోర
దహనకీలాకలాపనృత్యత్కరాళ
తైలదారుణపాత్రి మత్తగవుచూచి
దేవతలు మెచ్చి రమ్మహీదేవతలకు. 137
క. మువ్వుర మీఁద మరందపుఁ
దువ్వరఁ జల్లుచుఁ బరాగతో యధరంబుల్
ఋవ్వఁగఁ జొచ్చెఁ దఱుచుగఁ
బువ్వులజడివాన వేలువులు గురియింపన్. 138
సీ. చాలు సుధన్వ నీసత్యవ్రతము చూచి
పరిణమించిరి హరిత్పాలవరులు
హరిభక్తిరసుఁడ వౌటరయక నిన్ను
నప్పగిది నొప్పించినపాపకర్మ
లకుఁ బ్రాచితంబు గల్గఁగనేర దదియు నీ
దేహసంసర్గంబు తీఱఁ జేసె
ననుచుఁ దైవకటాహ మవగాహనము చేసి
వెడలుచందమున వెల్వడిరిముగురు
తే. సముచితస్నానకృతపరిష్కారు లగుచు
హంసకేతనుపాలికి నరుగుదేర
శంఖలిఖితద్విజులు సత్యసంధుఁ డైన
తనయుకథఁజెప్పఁదండ్రి మోదమునఁబొందె. 139

ఉ. ధూపితతైలపాత్రమునఁ ద్రోయఁగఁ బంచిన నిన్ను నార్తర
క్షాపరుఁ డైనశౌరి దయఁ గాచె ధరిత్రి మదీయశాసనం
బేపున నిర్వహించితి వహింపుము వేడుకతోడ నింక సే
నాపతిపట్ట మంచు నరనాథుఁడు సందుఁ గౌఁగిలించినన్. 140

చ. తగిలినభక్తిఁ దండ్రికి ముదంబునఁ జాఁగిలి మ్రొక్కి హస్తముల్
మొగిచి నిజాంగభూషణసముజ్జ్వలరత్నమరీచిమాలికా
ద్విగుణితరోచులం దనరుతేరు ముదంబున నెక్కెఁ దత్త్వబో
ధగురువు లైనశంఖలిఖితద్విజవర్యులు సన్నుతింపఁగన్. 141

వ. అనిన వినిజనమేజయుండు తరువాతివృత్తాంతం బానతిత్తుగాక యని యడిగిన. 142

మ. శివరాత్రిప్రియదావలోకనతిరస్వీక్షోణిభృత్కన్యకా
ధవసేవానుగవాలుకాగిణనభక్తవ్రాతయాత్రాప్రసము
ద్భవభారాపగమప్రమోద భరదృప్యద్రాజతాహార్యవై
భవలీలాపరపాకశాసన వచఃపర్యాయుపద్మాసనా. 143

క. వివిధప్రతిదినదానో
ద్భవసాగరఘనతరంగఘట్టనముద్య
న్నవనీహారకణాయిత
లవణేక్షుసురాజ్యదధికలశజలజలధీ. 144

మాలిని. మిసరగండసమీహితవైరిసమీకజయాతిసమిద్ధయశో
వాసితవాసవనిహ్నయమాసురవార్ధి పసన్నరవాహభవా
వాసవిలాసనివారితమన్మథవారిజభూనిభవాగ్విభవో
ల్లాసవికాసకళామృగలాంఛనలాలితభాస్వదిళామహిళా. 145

గద్యము. ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర గాదయామా త్యపుత్త్రి వినయవిద్యాసముద్ర పిసపీరభద్రప్రణీతం బైనజైమినిభారతంబునం దశ్వమేధపర్వంబునం జతుర్థాశ్వాసము.



శ్రీ

# జైమినిభారతము

## అశ్వమేధపర్వము, పంచమాశ్వాసము.

శ్రీవేంకటాద్రినాథద
యావర్ధితరాజ్య సన్నుతార్థి జనమహీ
దేవాగ్ర వైరినృపరా
జీవనికరచంద్ర నారసింహనరేంద్రా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున కిట్లని
యె నవ్విధంబున సుధన్వుండు తండ్రిచేత సేనాధిపత్యంబు గైకొని

సీ. రథచక్రనేమినిర్గత భూరజోరాజి
వార్ధులోతుఁ గ్రమ్మడి వారపట్ట
బిరుదకాహళశంఖ భేరీరావములు ది
గ్దంతులచెవులు చీఁదరలుగొలువ
వలమాన కేతనోజ్జ్వల వితానశ్రేణు
లాకాశతటినిలోఁ దరసిచూడ
శస్త్రవిక్షేపణోచ్చండ స్ఫులింగంబు
లుష్ణాంశురోచుల కుమ్మఁజూప

తే. సమధికోద్దామ సంగ్రామజయపటిష్ఠ
చటులధాటీనిరాఘాటచాతురంగ
వాహినులతోడ నవుడు వెల్వడెను దివ్య
ధన్వుఁడగుచు సుధన్వుఁ డుత్సాహమునను. 3

క. ఆహంసధ్వజుఁడును గౌ,
తూహలమున సప్తతంతు తురగముఁ బద్మ
వ్యూహంబునడుమ నిడిరణ,
దోహలియై యరుగుదెంచె దోర్గర్వమునన్. 4

వ. ఇత్తెఱంగునం గదలివచ్చునప్పు డెదుర నతిభయంకరాకారారణ్యం
బునుంబోలె నుద్దండపుండరీకవిలసద్గజాసహ్య సింహనాదగర్వదు
ర్వారభీషణంబును నంతరిక్షంబునుంబోలె నక్షత్రమాలికాశ్లేష రా
జహంసశంసనాదభ్రకేతువిభ్రమంబును నంబుజాకరంబునుంబోలె న
నేకపక్షిప్రకరవిహారద ధికతరవారిపూరితాబ్జ పరాగపటలవారితా
శావకాశంబును నంభోధియుంబోలె ననంతవాహినీపిలక్షితసపక్ష
భూభృత్ప్రేక్షణీయంబును నైనవృషకేతనాధిష్ఠితంబయ్యును బ్రద్యు
మ్నవైభవాభిరామంబై సర్వతోముఖసంభ్రమంబయ్యును ధనంజ
యప్రతాపదర్పితంబై యనల్పకుశారథరవిహారం బయ్యును ననుసా
ల్వభుజావిజృంభణంబై ప్రచండభీషణాభోగంబయ్యును మేఘవర్ణ
సముదీర్ణవర్ణితంబై వచ్చువివ్వచ్చుసైన్యంబు నాలోకించి యాహా
వంబునకు మోహరించుసమయంబున. 5

వృషకేతుఁడు సుధన్వునితో యుద్ధముఁ జేయుట.

మ. బలము న్గగ్గోనిసవ్యసాచిపలుకుం బ్రద్యుమ్నుతో మద్భుజా
బలమీ క్షోంపుము నీవు నీనృపులుశుంభద్లీలఁ బ్రత్యర్థులన్
దలరింతున్ రణభూమి నన్నహరి సేనం గూర్చిన న్నింపెశ
త్రులునా పాలని పల్కఁ జూచి వృషకేతుం డిట్లనుం గ్రొడితోన్. 6

చ. పుడిసెఁడునీటిచేనడగిపోయెడుధూళికిఁ గాలమేఘముల్
దొడరునెత్తప్పవేయఁ జెడుదోమలమీఁద సువర్ణుఁ డెత్తిపోఁ
గడఁగునె యీసుధన్వరథిక ప్రభుఁ డెన్నఁగ మీకునీడుగాఁ
దుడుగుఁడు సంభ్రమంబితని నోర్చెదఁ దెచ్చెద నధ్వరాశ్వమున్. 7

మ. అనిసుతాస్త్రమతనూజు పిడొ్క నిశితంగారూఢుఁడై ధూర్తవ
ర్తనిరూఢక్రమచక్రవిభ్రమసముద్యద్విస్ఫులింగచ్ఛటల్
వినువీధిన్ వెదచల్లుచున్ గదియు నవ్వీరున్ సుధన్వుండు గ
న్గొని కాఁడీతఁడు శక్రసూతి పడఁగన్ గోరాజువర్తించుటన్. 8

సీ. అనికర్ణసుతునితో ననఘునీవంశాభి
జాత్యంబు లెఱిఁగింపు సరపసనినఁ
గశ్యపమునిగోత్రి కర్త నీవవిలోనఁ
దివిరి యెవ్వాని ఛేదింపఁ గోరె
దా మహాత్ముఁడు మత్పితామహుఁ డాతని
తనయులందధిక ప్రదాతశౌర్య
ధనుఁడు కర్ణుండు మాతండ్రి నానామంబు
వృకేతనుండన వినియతండు

తే. తగుమఘుస్యందనుండు మద్వంశమునకు
గురుఁడు హంసధ్వజ క్షమావరుఁడు నాకు
జనకుఁడు సుధన్వుఁడను ఫేరఁదపరువాఁడ
దొరయు నీకును నాకు సంగర మొనర్ప. 9

మ. అనినన్ గ్రోధకషాయితాక్షుఁడయి మిథ్యాజల్పనీవాదముల్
గొనవిచ్చోపని మండలీకృత రణత్కోదండనిర్ముక్తశ
స్త్రనికాయంబుల సేనలం గెడపి యంతంబోవ కైదింటనా
తని బాణాసనకేతుసూతరథరథ్యవ్రాతముం ద్రుంచినన్. 10

మ. అరదంబొండొక టెక్కి విల్లుగొని పంచాస్త్రంబులం గెంటి భా
స్కరపౌత్రుం దెరలించి చాపములుకన్ ఖండించి సైన్యంబులన్
బురికొల్పన్ వడిఁ జుట్టుముట్టి యతనిం బోనీక యత్యుద్ధతిన్
బరిఘాసక్షురికాకుఠారముసంప్రాసంబులం గప్పినన్. 11

తే. చిక్కువడియును మదిఁ జేవ చెడ కతండు
కైటభారాతిహృదయసంకలితుఁ జేసి

యొక్క రథికుని చేతివి ల్లొడిసి తిగిచి
దురము సేయ సుధన్వుఁ డచ్చెరువు నొంది. 12

మ. ఘనశస్త్రంబు బరిఁబోసి యార్చి బలువీకన్ వక్షమున్ మాటిపా
ఱ నతం డేసినఁ గర్ణసూతి పెనుమూర్ఛన్ వ్రాలఁ గేడించి చ
య్యన సూతుం డమరల్చె దేరనికి బాయన్ ధీరుఁడై యుత్తరన్
గని ప్రద్యుమ్నుఁడు పోరికిం గదిసె దోర్గర్వం బఖర్వంబుగన్. 13

ప్రద్యుమ్నాదులు సుధన్వునితో యుద్ధంబుచేయుట

సీ. అదలించి నిలు నిలు మని సుధన్వుని నైదు
నారసంబుల నొంచి తేరిహారుల
శరచతుష్కమున వింశతిఖండములు చేసి
నొగ లష్టశకలంబులుగ శిలీము
ఖతతియం బడరించి కార్ముకంబాకకోల
నడిమికిఁ దుంచి యార్చుటయు నతని
కరకౌశలమునకుఁ బరిణమించి పదాఱు
తూపులొక్కమ్మడిఁ దొడిగి చాప

తే. సారథిధ్వజకూబరాశ్వములఁ గెడపి
కసలి మఱియును వాఁడు నిష్ఖాతభయద
సాయకత్రితయమునఁ గేశవునిపట్టి
తనువు నొప్పించి సింహనాదంబుచేసి. 14

క. గగనమునకుఁ బక్షులగతిఁ,
నెగయుచుఁ బెనఁచుకొని పడి యహిప్రభులగతిన్
జగతిన్ బొరలుచుఁ బాయుచుఁ,
దగళ్ళచందమున మలసి తాఁకుచుఁ గినుకన్. 15

క. సరి పోర పోరి మూర్ఛా,
పరవశులై రవుడు బాహుబలుఁడు సుధన్వుం

ము రయంబునఁ దెప్పిఱి యొం,
మురథం బపు డెక్కె వాహినుల సమయింపన్. 16

ఉ. వంచన లేక తాఁకి కృతవర్మ నవాంబకముల్ నిగిడ్చినన్
దుంచె నతండు మూఁడుసలుతూపుల వెండియు నైదుబాణముల్
నించె విరోధిపై నవి గణింపక తొమ్మిదికోల లేసి నొ
ప్పించిన వాఁడు తేరు దిగి భీతిఁ బలాయితు డయ్యె నయ్యెడన్ 17

మ. అనుసాళ్వుం డెదిరించి పల్కె నిజబాహాటోపముల్ జూపి తా
ననిలో రెండుబలంబులుం బొగడ నీయస్త్రంబు సైరింతు వే
గని మెచ్చం దగు నంచు బాడబసదృశుం బైనభల్లంబు మ
ర్మనిఘాతంబుగ నేయ, దూలఁ కతఁ డుగ్రస్ఫూర్తిమై నిల్చినన్ 18

ఉ. వాడిమితోడ వెండియు నవారణ నెంతయు నాగ్రహించి ము
మ్మూఁడుశరంబు లేయ వడి మూర్ఛిలి తోడనె తేఱి శూరతన్
వాఁడనుసాల్వుఁ దీవ్రశరవర్ష నిమగ్నునిఁ జేసి సేనలన్
బోఁడిమి మాపి యంతకుఁడుబోలె విజృంభణవృత్తిఁ జూపుచున్.

వ. మఱియు నక్కిరీటి సైన్యంబు లెక్కగొనక యుక్కుమిగిలి యక్క
జంబుగాఁజిక్కుపడం బెక్కునారసంబు లీరసంబునంబరపినందారసం
బగుచుఁగొఱప్రాణంబులతోడ సాధోరణంబులుగాఁదోరణంబులై
పడినమత్తవారణంబులును జక్రకూబరయుగపతాకానీకవిశ్లథంబు
లగుచు సరథ్యరథికసారథికంబుగా జయశ్రీకథాకథనపథంబు లగు
చువితథంబులై కూలినరథంబులును నీరంధ్రంబుగా దొరగు నెత్తు
రుటేరులఁ దడిసి కెడసిన బిరుదరాహుత్తులకబంధంబులసంబంధం
బులు విడువక పెడమరలు బంధురతరస్కంధంబులతోడ శిథిలీకృ
తసంధిబంధంబులై వసుంధరం బొరలుసైంధవంబులును వెగ్గలం
బగునగ్గలిక మొగ్గరంబులు నుగ్గునూచంబుగా నఱికి సగ్గినిసర్గవిక్ర
మక్రమాసర్గళవీరమార్గంబు గైకొనుపదాతివర్గంబునుం గలిగి విఱి
గిపడినకుఱుగడలును విటతాటంబులై నఖేటంబులును దుండెంబు

లై నకంఠంబులును దుత్తుము ళ్ళయినయత్తళంబులును నఱువులైన మైమఱువులును నందంబు చెడినచిందంబులును నాభీలంబు లగు సమరభూభాగ్యమధ్యంబున నిట్టవొడిచి తెట్టువలు గట్టునట్టలతోడం గట్టనిసి పఱచురుధిరప్రవాహంబులు ధాతుమయధరిత్రీవివరంబున నగరకుమారులపై బహుముఖంబులం బ్రవహించు భాగీరథి విడంబించె నాసమయంబున. 20

శా. శైనేయుం డెదిరించిన న్నిశితశస్త్రంబుల్ సుధన్వుండు తో
డ్తో నాటింప నశీతిబాణముల వాఁడుగ్రుద్ధుఁడై తదృథా
జానేయధ్వజసూతులం దునిమెఁ బెల్చన్ వానితే రాతఁడ
స్త్రానీకంబులఁ గూలిచె న్విరథులై రట్టిద్దరుం బోరిలోన్. 21

తే. వేఱయరదంబు లెక్కి యవ్వీరవర్యు
లసము డింపక పోరి నానాస్త్రనిహతిఁ
దొరఁగుశోణితములఁ దొప్పఁదోఁగియచట
బుష్పితాశోకములరీతిఁ బొలుపుమిగిలి. 22

ఉ. సాత్యకిపై సుధన్వుఁడు ప్రచండభుజాబలవైభవోన్నతిన్
మృత్యుకరాళదంష్ట్రఁబురుడించుభయంకరశక్తి వైవనో
ద్ధత్యము దక్కివ్రాలె వసుధాస్థలి నంతఁ గిరీటి శత్రులో
కాత్యయగర్వరేఖ మెఱయం దగ నాతని జూచి యిట్లనున్. 23

అర్జునుఁడు సుధన్వునితోఁ బోరుట.

మ. గురుభీష్మార్కతనూభవాదులమహాకోదండవిద్యాధురం
ధరశౌండిత్య మెఱింగినాఁడ భవదుద్యత్సంగరక్రీడమున్
సరిగా దన్న నృపాలసూనుఁ డను నస్మద్బాణసంధానవిశే
షరహస్యంబులు నీవ చూచె దిఁక వాచాలత్వ మిం కేటికిన్. 24

తే. కృష్ణసారథ్యమున మున్ను గెలుపులొందవెఁ
గాకయిట్లొంటివచ్చినఁగలదె జయము

అతఁడు తోడ్తైనఁ బట్టినహయము విడువ
నశ్వమేధంబు మాతండ్రి కర్హమగుట. 25

మ. అనినన్ బార్థుఁడు నూఱుబాణములు బిట్టల్కన్నిగడ్వన్ రయం
బున వాఁడన్నియుఁ ద్రుంచివైచి పదితూపుల్మేనఁ గీలించిన
న్వినవ్వీరుఁడుమార్గణావళుల దోర్వక్రాంతిఁజూపన్ రణాం
బునభోభాగము నాతఁడస్త్రవితతిన్ ముంచెన్విచిత్రంబుగన్. 26

శా. ఆయోధాగ్రణిపై నరుండుకినుకన్ హాలాహలార్చిశ్ఛటా
దాయాదోత్కటకీలలం దిశలునిర్దగ్ధంబు గావించునా
గ్నేయాస్త్రంబడరింప వాఁడు విలుతన్నిఘ్నాతకల్పాంబున
చ్ఛాయావిభ్రమగర్భితం బయినపర్జన్యాస్త్రమేసె న్వడిన్. 27

క. మెఱుపులు దఱచుగఁ బెళపెళ,
నుఱుముచు వడగండ్లతోఁ బయోధారలు పె
న్వఱదలుగా నల్లెడఁ జి
చ్చఱపిడుగులతోడ వానజడిగొని కురియన్. 28

క. జల్లెడలును బక్కెరలును,
బల్లెంబులు జోళ్లు నాతపత్రములున
న్వెల్లిఁబడి కలసి మిట్టును,
బల్లమునొక్కటిగఁబొరలి పాఱఁగ దొడఁగెన్. 29

క. వాయవ్యాస్త్రంబున నపు,
డాయింద్రితనూభవుఁడు తదాశుగమహిమన్
మాయింపనతఁడు భీషణ
సాయకమునవరుని తేరుసారథిఁ దునిమెన్. 30

ఉ. వెండియువాఁడుతీవ్రశరవేదనఁజూపుచుఁ దూఱనాడనా
ఖండలసూతి యప్డు పెనఁగంబడురథ్యములన్ మరల్పఁగా
నొండువిధంబు గానక పయోరుహనేత్రు సమస్తవేదవే
ద్యుండగుకృష్ణునిం దలఁపఁదోఁడనె సన్నిధియయ్యె నయ్యెడన్. 31

సీ. అట్లేగుదెంచినవారికిఁ బ్రణామంబు
గావింపఁబార్థుని గారవించి
మలఁగొన్న తేరివాజులఁ బగ్గములచే
బిగించిసారథ్య మంగీకరింప
గనిసుధన్వుండు ఫల్గుననీకునిబ్బంగి న
బ్జనాభుండు సహాయుఁడయ్యె
నంపపోకడ చేయునాహవం బేటికిఁ
బ్రతినపట్టుమునిల్పుబంట వైన
తే. ననినవిశిఖత్రయంబున నవనిగూల్తు
నీశిరంబట్లు చేయకుండిన మదీయ
పూర్వజులు పుణ్యహీనులై భూరినిరయ
కూపబాధలఁబొరలి వేగుదురుగాక. 32
చ. అనవినియాతఁడిట్లను రయంబున నీనడరించుబాణముల్
తునుముగఁద్రుంపకున్న ఘనదుర్గతిపాలుఁ బుణ్యసంపదల్
దనుజసమాహృతంబులగుఁ దప్పినవాఁడను విశ్వనాథున
ర్చనలకరుంధతీరమణుఁ జంపినవాఁడఁ ద్రివాచికంబుగన్. 33
మ. అనుచున్ గాంచనపుంఖబాణశతకం బబ్జాక్షువక్షంబునన్
జొనుపన్ దద్విశిఖచ్ఛద ప్రభవదుచ్ఛానోగ్రవాతూలవ
ర్తనసంరంభమునన్ బిఱిందికిరథోత్తంసంబు విభ్రాంతమై
చనియెన్ గిష్కుచతుశ్శతంబు విదళచ్చాత్కార ఘోరంబుగన్. 34
క. అమ్మాధవార్జునులఁ బెను,
దుమ్మపొదుగరథము దిరుగఁదొడఁగెఁ దడవుగా
బొమ్మరము తిరుగునరవడిఁ,
గుమ్మనసారెగుడి తిరుగుకొనెఁ బహువిధమునన్. 35
వ. ఇత్తెఱంగునం బరిభ్రమించురథంబు రయంబునం గుదియంబట్టి
కృష్ణుండు గ్రీడినాలోకించి. 36

ఉ. తీవ్రశరప్రకాండమునఁ దేరు విఘాతముగా నొనర్చి వీఁ
డవ్రిణశౌర్యశాలియగు టారయకాడితి వాడినంబ్రతి
జ్ఞాప్రితహానికాని కొనసాఁగుట దుస్తరమింతఁ డేకప
త్నీవ్రతుఁడౌటఁ జేసె నదినీకును నాకునశక్య మెమ్మెయిన్. 37

క. అనివిని నీకృపగలుగం
గని దెంతటికార్య మనుచుఁగవ్వడిశరమే
ర్చిననపుడ యునిచె గోవ
ర్ధనమెత్తినఫలము శౌరితత్కాండమునన్. 38

శా. ఆకాలానలఘోరసాయకము సాహంకారుఁడై పార్థుఁడ
స్తోకప్రౌఢిమ నేసినంగినిసి తద్దుర్వారసంధాకథా
వైకల్యంబుగఁదుంచి యాతనిపయిన్ వాఁడు గ్రుఁడై మార్గణా
నీకంబుల్ పరఁగించె కొండియు సమున్నిద్రప్రతాపోన్నతిన్. 39

తే. అమ్మహాసాధనము భగ్నమైనఁగ్రీడి
యొండుబాణంబు దొడుగ నుద్యుక్తుఁడైన
నంబుజాయతనేత్రుఁ డీనవధరించెఁ
దచ్ఛరమునకు విశ్వభూదానఫలము. 40

క. గాండీవజ్యారావము,
లొండొండచెలఁగ నమ్మహోగ్రవిశిఖము
ప్పాండవమధ్యముఁ డేసిన,
ఖండించెనతండు దివిజగణమునుతింపన్. 41

◆ అర్జునుఁడు సుధన్వునిఁదృతీయశరంబుచే ఖండించుట. ◆

వ. ఇవ్విధంబున శరద్వితయంబు వితథంబై పోయినంబురుహూతనంద
నుండు డెందంబునం గ్రిందుకొనునచ్చలంబు పెచ్చుపెరుగ విల
యమార్తాండమండలంబు వేఁడిమిం గ్రేఁకిసేయు మూఁడవబాణంబు
తూణంబునందిగుచు నప్పుడప్పుండరీకలోచనుం డాత్మీయతేజోవిశే

షంబును రామావతారసంచితం బగుసమంచితపుణ్య ఫలంబును దత్ఫలంబునం బ్రతిష్ఠించె నంతకుమున్న రంభాద్యప్సరోగణంబును వాసవప్రముఖనిఖిల గీర్వాణ లోకంబును వీరసంహారణరణ విలోకన కౌతుకంబున విమానంబు లనూనగమనంబునం దఱుము కొని వచ్చి యితరేతర విజయ సందేహ నిగుంభనం బగు ప్రతిజ్ఞాసమరవిజృంభణంబున హర్షాద్భుతభయానకంబులను మనంబులం బొదల నంతరిక్షంబునం గనుంగొను చుండి రాసమయంబున. 42

మ. సరుం డాయుగ్రశిలీముఖంబు పటుసంధానక్రియా చాతురీ
గరిమన్ దార్కొని మింట మంటలడరంగా నేసినంజూచి వాం
డరదోర్విం దెగ నేసె నేయ వృథగా కయ్యుగ్రఖండంబు భీ
కరలీలం బఱతెంచి బిట్టురవడిన్ ఖండించెం దగ్రీవమున్. 43

క. శిర మటు దెగి హరినామ
స్మరణము చేయుచును దశసపక్షమునం బడన్
బరికించి చూచె దానవ
హరుం డత్తేజంబు గలసె నవ్విభునందున్. 44

తే. కంసమర్దనుం డమ్మస్తకంబు వైచె
హంసకేతనుమ్రోల వాం డవి గనుంగొ
ని దళమగుపుత్త్రశోకంబు నివ్వటిలంగం
బొగిలి యందంద బహువిధంబులనువగచి. 45

క. మరలంగం దన్మూర్ధము శ్రీ
వరునిపదాబ్జములు గదియ వైచిన నతం డం
బరమునకై నిగిడించినం
దిరుగక యది యంతలో నదృశ్యం బయ్యెన్. 46

క. అంత సుధన్వునిపాటున
కెంతయు వెఱంగంది సురథుం డెడపడనిసుత

భ్రాంతిఁ బలవించుజనకుని
సంతాపం బుడుపఁ జేరఁ జని యిట్లనియెన్. 47

క. శూరుల కాహవమరణం
బారయ శోభనము వగచు టనుచితము రణ
ప్రారంభవేళఁ దగునే
ధీరతఁ గైకొనక యింతదీనతఁ బొరయన్. 48

చ. అనువుము నన్ను నిప్పు డభియాతబలంబులఁ జుట్టుముట్టి మా
ర్కొనినబలంబులన్ గనుపు గొట్టెద మాధవుపాత్రిపురన్ సుధ
న్వునిఁ బొరగొన్న వాసవతనూభవుఁ దాఁకెద నా కెదిర్చి ని
ల్చిన ననుజన్ముసూను మరలించెద దిక్కులఁ గీర్తినించెదన్. 49

క. అని పలికి పెక్కుభంగులఁ
జనకుని నూరార్చి బహుళశస్త్రమరీచుల్
గనుపట్టి వెలుఁగు సురథుఁడు
చనియె రథారూఢుఁ డగుచు సమరోన్ముఖుఁడై. 50

♦సురథుం డర్జునునితో యుద్ధముఁ జేయుట♦

క. పుంఖానుపుంఖనృహరి
పేంఖద్వికటాట్టహాసభీషణరేఖా
రింఖణచటులారభటి
స్సంఖముఁ బూరించి సింహనాదము చేయన్. 51

చ. సురథునిరాక చూచి మధుసూదనుఁ డిట్లనుఁ బార్థుతోడ ని
ష్ఠురలయకాలభైరవునిచొప్పునఁ గ్రాలుచు నున్నవాఁడు ని
ర్భరగతి వీని మార్కొనఁగ బ్రహ్మకు నైన వశంబు గాదు నేఁ
డురవడికిం దొలంగి విజయోన్నతి గాంచుట మేలు పిమ్మటన్. 52

క. అనఘుఁడు సత్త్వమె రూపై
జనియించినవాఁడు వీఁ డసాధ్యుం డీవే

శను బ్రద్యుమ్నాదుల నిట
నునిచి మనము కేశవు దొలఁగి యుండుదమనుచున్ 53

క. పరబలముమీఁద సేనలఁ
బురికొల్పెడువాఁడపోలెఁ బొద వెట్టుచు న
మ్మురవైరి దఱుముకొని చనె
నరద మపుడు యోజనత్రయం బెడ గలుగన్. 54

వ. అప్పుడు. 55

క. వడి నేగుదెంచి సురథుఁడు
పిడుగులగమికంటె మిగుల బిఱుసగుశరముల్
జడి గొలిపి తద్బలంబుల
మడియింపఁగఁ జొచ్చె మారిమసఁగినభంగిన్. 56

ఉ. కూలినభద్రనాగములుఁ గుప్పతిలంబడు తేరులున్ ధరన్
వ్రాలెడుఘోటకంబులు నవారణ మ్రగ్గెడువీరయోధులున్
రాలినశస్త్రఖండములుఁ గ్రమ్మెడురక్తనదంబులున్ సము
ద్వేలముగా రణంబు గణుతింప భయంకరమయ్యెఁ జూడ్కికిన్.

క. ఒదుఁగువడ యోజనత్రయ
ము దలం బగువినుతసైన్యములవీరీతిన్
మద మడఁచి కృష్ణపార్థుల
నెదురం బొడగాంచి సురథుఁ డిట్లని పలికెన్. 58

తే. కృష్ణ నీపుణ్య మంతయుఁ గ్రీడి కొసఁగి
పిదప నిట్లు సుధన్వుఁ జంపింపఁదగునె
పడుచుపని చేసితివి రేఁగుబండ్లకొఱకు
ముత్తియంబులు వెలపోయునులుచకలఁడె. 59

క. గోవింద నిన్ను ధర్మద
యావిందుం డనుచు లోకు లాడఁగ విందున్

నీ విందు సుధన్వునినెడ
సావిందుని మించి తెందు సాగెద ననుచున్. 60

ఉ. కాండపరంపరల్ సముచితఘనస్మరసూతిపయిన్ నిగుడ్చ నా
తం డెడఁ ద్రుంచి వాని నిశితప్రదరంబులఁ గప్పుచున్ ధను
ర్దండరథాశ్వసూతబిరుదధ్వజముల్ పొడిచేసె నంత వాఁ
డొంచు రథంబు గైకొని సముద్యతసజ్యకఠోరచాపుఁడై. 61

ఉ. అక్కమలాక్షుపార్థుల రథాశ్వయుతంబుగ బాణరాశిలోఁ
జిక్కుపడంగఁ జేసె నవి చిత్రముగాఁ దునుమాడి క్రీడి తో
నుక్కున వానితేరు దివి కుప్పర మెత్తుకపోవ నేసినన్
రెక్కలతోడి మేరుశిఖరిం దలఁపించె నిలింపకోటికిన్. 62

క. నరునిశరాసనవిద్యా
కరకౌశల మరుదు చెప్పఁగా నిమిషములో
సురథునిగాఁ గొనిపోయెను
సురథునిఁ దద్బాణరాజి సురధుని మోవన్. 63

మ. సురవర్త్మంబున నిల్చి వాఁడు భువనక్షోభంబుగా నొక్క భీ
కరబాణం బడరింపఁ బార్థునకు నత్యుగ్రపంబు వాటిల్ల ది
ర్దిరయంచుం బిడిసాసచందమున ధాత్రీభాగముక్ గ్రొచ్చె న
య్యరదం బారభసంబు మానుపఁగ లేఁ డయ్యెన్ మురారాతియున్

క. కరువలిసుతుఁ డయ్యెడ బి
ట్టురవడిఁ గేతనముఁ డిగ్గ నుఱికి బిగియ బం
ధురవాలంబునఁ బెనచియు
నరదము పెకలింపనోప కవశుం డయ్యెన్. 65

ఉ. క్రిమ్మఱఁ గంకపత్త్రి విశిఖమ్ములు బిట్టడరింపఁ దత్ప్రతా
పమ్ము సహింపలేక సురథాంబుజుఁ డర్జునువంకఁ జూచి నీ
కిమ్మెయి నూఱకుండఁ జనునే యనినం దెలి వొంది బాణజా
లమ్ముల వానితేరు శకలమ్ములుగా దొరఁగించె మేదినిన్. 66

క. సురథుం డీచందమున
న్విరథుం డై మాధవాంజనేయులచేతన్
దెరలింపరానిపార్థుని
యురదముఁ బెకలించి పట్టి యపు డి ట్లనియెన్. 67

చ. చదువుదునే ధరం గెడపి సాగరముల్ గడవంగ నైతునే
చెదరఁగ హస్తినాపురికి జిమ్ముదునే యని ఘాత చేసినన్
బ్రిదరము లై దిటన్ సురథుఁ బాండుతనూజుఁడు నొంప వాఁడు చే
వదలి విసంజ్ఞుడై ధరణిఁ వ్రాలి రయంబునఁ దేఱి యంతటన్. 68

క. సారథి వెసఁ గొనివచ్చిన
తే రతఁ డవలీలఁ నెక్కి తీవ్రశరంబుల్
ధారాళంబుగఁ బఱపుచుఁ
బారందరితోడఁ బోటుపంతము గొనన్. 69

క. నిను దలదుంపుదు భవ
జనకుఁడు చూడంగ నిదియ శపథం బన నీ
తనువు ధరఁ ద్రెళ్ళ నేయుదు
ననుమానము లేదు సత్యమాడితి ననుచున్. 70

చ. అతఁడు కిరీటి శస్త్రనివహంబుల నొంచినఁ దుంచి వానిపై
శితశరజాలముల్ నిగుడఁ జేసిన నాసురథుండు రోషరం
జితవదనాబ్జుఁ డై నరుని శింజినిఁ ద్రెవ్వఁగ నేయ నాహవో
ర్జితమతి నొంచునారి సవరించి రథం బిలఁ గూల నేసినన్. 71

ఉ. ఒక్కశతాంగమాతఁడు సముద్ధతిఁ గైకొని మోహరించినం
జెక్కలు వాపెఁ బార్థుఁ డది చీరికిఁ గైకొన కొండుతేరు వాఁ
డెక్కినఁ గ్రమ్మఱం దునిమె నింద్రతనూభవుఁ డివ్విధంబునన్
దక్కక నూటయెన్మిదిరథంబులు రూపఱఁ జేసె జేసినన్. 72

తే. విరథుఁడయ్యును సురథుండువిపులచాప
హస్తుడై తూణమున బాణమందుకొనఁగ

నలుక రెట్టింప నర్ధచంద్రాశుగముఁ
గ్రీడి దునుమాడె నతనిదక్షిణభుజంబు. 73

సీ. అట్లు ఖండితబాహుఁ డయ్యునుశౌర్యంబు
వదలక డాకేల గద యమర్చి
తెగువ జాళెంబులు ద్రిప్పుచుఁ బఱతెంచి
గాండీవితేరియుగ్యములఁ జదిపి
వేదండముల రెండువేల నుక్కడఁగించి
కడఁక నన్నియశతాంగములఁ జంపి
వీరయోధులఁ బదివేవుర మడియించి
యన్నియహరుల రూపడఁగఁజేసి
తే. సమరమధ్యంబు ననుసాహసంబు మెఱసి
సింహనాదంబు చేసి నిల్చినఁ గిరీటి
జిహ్మగముఁ గ్రేణిసేయుచజిహ్మగంబు
దొడిగె గదతోడిభుజమును దునుఁగ నేసె. 74

సురథుం డర్జునునిచేఁ దెగుట.

క. ఈరీతి నతఁడు శత్రువి
దారితభుజుఁ డయ్యు నుద్ధతము లాడుచు రాఁ
గా రెండుపాదములు నొక
నారసమునఁ ద్రుంచి దారుణం బగునలుకన్. 75

మ. నగభిన్నందనుఁ డుగ్రమార్గణము వింటన్ గూర్చి యేయన్ బ్రభా
స్థగితాజాండకటాహమై చని వడిన్ దత్కంఠమున్ ద్రుంచినన్
దెగి యమ్మూర్ధము దారుయంత్రశిలభాతిన్ బాఢ్గమస్తంబు బి
ట్టగలం దాఁకిన రిమ్మ వట్టి వివశుండై వ్రాలె నమ్మేటియున్. 76
తే. అవనిపై నట్లు మూర్ఛితుం డైన నరుని
దేర్చి దనుజాంతకుఁడు ప్రమోదించుచుండ

నవుడు సురధునిశిరము తదంఘ్రియుగళిం
గదిసి నెత్తిమ్మమీఁదిపట్ప్రదముఁబోలె. 77

వ. ఇత్తెఱంగున నిజపదంబుల నత్తిమిల్లిం సురధునియుత్తమాంగంబు మెత్తమెత్తన శౌరి కరపల్లవంబుల నెత్తి ధనంజయుం గనుంగొని యితం డుదాత్తచరితుం డత్యయంబు నొందియును సత్యవ్రతంబు నిత్యంబుగా విహరించినయుత్తమశ్లోకుండు కావున నిఖిలలోకవందనీయుం డనిన సంక్రందననందనుండు పరమానందంబున నందుకొని తచ్ఛిరంబునకు వందనం బాచరించె నంత నమ్మురాంతకుం డప్పాండవనందనుం గృతార్థుం జేయ నూహించి వైనతేయుం దలంచిన.

శ్రీకృష్ణుఁడు గరుత్మంతుని రప్పించుట.

మ. అరుదెంచెన్ వినతాతనూజుఁడు సముద్యత్పాపవృందారంభని
ర్భరజీమూతఘటాంతరాళవిచలద్రాఘిష్ఠవిద్యుల్లతా
పరిపంథిప్రథమానదీధితిసటత్పక్షానిలాఘాతజ
ర్జరితోడ్డీనకులక్ష్మాధరదృషజ్ఝంపాకళాసంపదన్. 79

ఉ. ఈగతి వచ్చి మ్రొక్కిన నుపేంద్రుఁడు గాశ్యపి నాదరించుచున్
వేగమ యీశిరంబు గొని వేయు ప్రయాగమునన్ ద్రివేణికా
యోగవశంబునన్ సురథుఁ డుత్తమలోకముఁ గాంచు నన్నన
న్నాగవిరోధి యట్లనియె నందకపాణికి భక్తిపెంపునన్. 80

తే. ఆత్మ నినుఁ జెందఁ గైవల్య మనఁగ నెద్ది
ధన్యుఁ డితనికి నేల తీర్థములగొడవ
మైన నీయాజ్ఞ దాఁటరాదనుచు మ్రొక్కి
శిరముగొంచును దివికేగె గరుడుఁ డపుడు. 81

క. ఆవేళ నంబికాయుతుఁ
డై వృషభేశ్వరుని నెక్కి యంబరవీధిన్
బోవుచు గరుడుని నీల
గ్రీవుఁడు వీక్షించి భృంగిరిటి కిట్లనియెన్. 82

క. సురధునితల గరుడుఁడు గొని
యరిగెముఁ దె మ్మనిన నాతఁ డచటికిఁ జని త
ద్గరుదనిలాహతి సుడివడి
సురగాలిం బడిన చొప్పచొరఁగును బోలెన్. 83

క. ఈచందమునఁ బరాజితుఁ
డై చేవ దొలంగి వచ్చునాప్రమథవరున్
జూచి వెడ నగుచు గుబ్బలి,
రాచూలి ట్లనియెభోగిరాట్కటకునితోన్. 84

ఉ. భృంగి దలంపఁగాఁ బరమభృత్యుఁడు నర్మసఖుల్ పిశాచముల్
కంగటికాలు నమ్మఁదగు కైదువు రక్షలు శల్యఖండముల్
జంగిలిగిబ్బ వారువము సర్వము నీగతి నీగతి నెన్ని చూచినన్
మంగళమేమి బ్రాఁతి పురమర్దన నీకెపుడున్ జయోన్నతుల్.

మ. అనినన్ బార్వతిఁ జూచి నవ్వుచు శివుండామూర్ధమున్ గొంచుర
మ్మని శైలాదికి నానతిచ్చిన నతం డచ్చోగి పక్షీంద్రునిన్
గని రోషస్ఫురణంబు దీటుకొన హుంకారంబు గావింపఁ ద
ద్ఘనవాతాహతిఁ దూలె నాతఁడు త్రిలోకవ్యాప్తి సంధిల్లగన్. 86

చ. ప్రమథవరుండు వెన్కొన సుపర్ణుఁడు నిల్వఁగ నోఁత లేక ది
గ్భ్రమణము చేసి చేని నిజభాగ్యవంశంబునఁ దోఁచినం బ్రయో
గమున శిరంబు నైవ నది గైకొని యాతఁడు తెచ్చి యిచ్చినన్
శమనవిరోధి యందుకొని శైలతనూభవతోడ నిట్లనున్. 87

క. శూరులు ధర్మచరిత్రులు,
దారులు విజితేంద్రియులు కృతజ్ఞులు జగదా
ధారు లని వారిశిరములు,
హారంబులుగా ధరింతు ననవరతంబున్. 88

వ. అని యానతిచ్చి యప్పరమేశ్వరుండు సురధునిశిరంబు రుండమా
లికామధ్యంబున నాయకరత్నకంబుగా నవధరించి నిజేచ్ఛం జని

యె వైనతేయుండును దద్వృత్తాంతం బంతయు మురాంతకున
కెరింగించి చనియె నంత. 89

మ. సుతు లవ్యాహతశక్తిఁ బేర్చి సమరక్షోణీస్థలిన్ వారిల న
ప్రతిమాటోపవిజృంభమాణుఁ డయి భూభాగంబుగంపింపను
ద్ధత సైన్యంబు లసంఖ్యముల్ గొలువ మాద్యత్కేళి హంసధ్వజ
క్షితిపాలుం డరుదెంచెఁ బోరికి భుజోత్సేకంబు సంధిల్లఁగన్. 90

—హంసధ్వజునితో నర్జునుఁడు స్నేహము సేయుట—

చ. గురుతరశక్తి నాలమునకుం దమకించెడువానిఁజూచి సు
స్థిరకరుణాతరంగితమతిం గమలాక్షుఁడు తేరు డిగ్గి రా
సరపతియున్ రథావతరణం బొనరించెదు రేగుదెంచిసన్
హరి తెగ నూఱడం బలికి యాతనిఁ గౌఁగిటఁ జేర్చి యిట్లనున్.

తే. జననమరణాదిదుఃఖముల్ సకలజీవ
లోకమున కెందునోఱయఁ గల్గుట యెరింగి
కాలగతి నైనపుత్రశోకంబు నూఁది
వసుమతీనాథ తగ దింతవంత యనిన. 92

క. అవిభుఁ డిట్లను మఃఖం,
బేవలనను గలుగనేర దిహపరసౌఖ్య
శ్రీవిభవంబుల కెల్లను.
దావకసందర్శనము నిదానంబగుటన్. 93

సీ. అనిన గోవిందుఁ డిట్లను మహీధవునితో
నధిప నీతోడిసఖ్యంబు మాకు
నొరకె నీవాప్తబంధుఁడవు పాండుతనూ
పాల నందనులు నాప్రాణ మగుట
దెలిసి యీయజ్ఞసప్తిఁ పిరుంద నఖిలసే
నాసమన్వితుఁడవై నరుని గూడి

చని ధర్మసూతి కుత్సవముగా నిటమీఁది
పని నిర్వహింప నీభార మనుచు
తే. హంసకేతనుఁ బ్రియమార నాదరించి
యతనిచేఁ బూజ్యమానుఁడై యర్హభంగిఁ
దత్పురంబునఁ బంచరాత్రములు నిలిచి
వనజనాభుఁడు హస్తినావతికిసరిగె. 94
ఉ. అంత మరాళకేతుఁడు ప్రియత్నమునన్ గదలింప భూరివి
క్రాంతగతిన్ గుబేరుదెసగాఁ దురగం బటు పోవుచున్ బథ
శ్రాంతివహించి దప్పి గదురన్ వెడ సాగెడుచో నుమావనా
భ్యంతరసీమ నొక్క జలజాకరముం గని డాయఁబోవుచున్. 95
—♦యజ్ఞాశ్వము గోడిగయై వ్యాఘ్రరూపము దాల్చుట.♦—
క. సలలితమణిసోపాన,
స్థలములుగా డిగ్గి కంఠదఘ్నముగ జలం
బులు గ్రోలితనిసి వెలువడి,
కొలనిసమీపమున నిలిచి గోడిగ యయ్యెన్. 96
క. క్రీడి వెఱగంది కనుఁగొనఁ,
గేడించుచు నొండుదారవికిం జనియచటన్
జూడ భయంకర మగుచును,
గోడిగ తదూప్రివ ముడిగి క్రొల్పులి యయ్యెన్. 97
క. అన విని జనమేజయుఁ డి,
డిట్లను జైమినితోడ నంబుజాకరయోగం
బున హయము తురగి యెట్ల,
య్యెను శార్దూలంబు పిదప నేగతి నయ్యెన్. 98
వ. అనిన నమ్మునీంద్రుండు నరేంద్రున కిట్లనియె. 99
మ. ధరణీనాయక శంభునిం గుఱిచి యద్దాక్షాయణీకన్య త
త్సరసీమధ్యమునం దపంబు ఘననిష్ఠం జేయు నక్తంచరే

శ్వరుఁ డొక్కఁడు మదాంధుఁడై చెనకినన్ శర్వాణి తద్దైత్యుఁ జె
చ్చెరఁ గోపాగ్నిశిఖాకలాపముల భస్మీభూతునిం జేయుచున్.

క. ఈజలజాకర మిది మొదఁ
లేజంతువు చొచ్చి వెడలు నెడపక పుంస్త్వం
బోజ చెడి యాఁడురూపం,
బై జగతిఁ జరించు నంచు నంబ శపించెన్. 101

క. దేవివచనం బమోఘము,
గావునఁ దురగమున కిట్టిగతి వాటిల్లెన్
భూవర విను మది బెబ్బులి,
యై విహరించినవిధంబు నవధానమునన్. 102

సీ. పొగడొందు కృతయుగంబున నకృత
వర్ణుండనుమౌని తీర్థయాత్రాభిరతిని
సకలపుణ్యాశ్రమ స్థలములఁగలనదీ
నదములనవగాహనం బొనర్చి
వచ్చుచోఁదత్సరోవరముఁ గన్గొనిభక్తి
నఘమర్షణస్నాన మాచరింపఁ
గానందునొకమహా గ్రాహమాతనిపాద
కమలంబుబలువుగాఁ గఱచితిగువఁ

తే. గళవళించుచు మకంబుగానెఱింగి
పెనఁగి విడిపించుకొని పోవుచు నమునీంద్రు
డిది మొదలుగాఁగ నేజంతువిందుఁజొచ్చు
నదిమహావ్యాఘ్రమగుఁ గాకయనిశపించె. 103

క. నరనాథ యివ్విధంబునఁ
దురగముపులి యైనవిధము దోఁచక నరుఁడం
బురుహాక్షుఁదలఁపనివ్విభు
కరుణన్ వ్యాఘ్రంబు ఘోటకం బయి నిలిచెన్. 104

## స్త్రీమండల వృత్తాంతము.

ఉ. ఆయెడవాద్యభాంకృతు లహంకృతి మీఱసమస్తవాహినీ
నాయకకోటితోడుత ధనంజయుఁడుత్సవమంద సర్వమే
ధీయహయంబుమారుతగతిన్ బహుదేశము లంతరించుచున్
నాయపవేళనన్ యువతిమండలమున్ గదిసెన్సమున్నతిన్. 105

ఉ. అందలిముఖ్యనాయిక మృగాక్షిప్రమీలయనంగ నొక్కనా
కేందుసభాస్వయత్తరుణి కెన్నఁగ నొక్కొకలక్షవారణ
స్యందనఘోటకంబు లదిసాహసవృత్తిఁ బ్రతాపమెల్లెడన్
గ్రిందుకొనంజరించు వృషకన్యక లిమ్ములసంరక్షగాన్. 106

మ. సరసాలాపవిలాసవిభ్రమకళాసౌభాగ్య రేఖామహో
హారకేళీపరిరంభణక్రియల నాహ్లాదంబుపుట్టించి ని
ర్భరపుంజేప్రమ వశీకరింపుదురు తద్భామాజనుల్ పాంథులన్
సురతప్రౌఢివిహారవైభవములన్ జొక్కించిచిక్కించుచున్. 107

క. ఈసరణిఁగామతంత్రా
భ్యాసపరిశ్రాంతిమిగులఁ బరవశ్యమైనన్
నాశిలి ధాతుక్షయమై,
మాసములోపలన వాఁడు మరణమునొందున్. 108

తే. తోడగతిచేయుమరు వారితోరమించు
కాంతలందరు నందోర్థుగర్భమైన
నిలుచునమ్మాసవతికి జన్మించెనేని
కొడుకుగానేర డెపుడఁడాఁడుఁబడుచ కాని 109

క. ఇవియాదేశచరిత్రము
లవనీశ్వరయధ్వరాశ్వ మవ్విధముచ నా
యువతిజన పురసమీపో
పవనాంతరములను మేఁతఁబడిఁజరియింపన్. 110

సీ. నెలవంకఁబోమలకుఁ దలఁకి మొ్రక్కుచునున్న
పగిదినాన మితచాపములు మెఱయఁ
గలికిచూపులకు భీతిలి డాఁగినిలిచిన
కైవడిం బొమలమార్గణములమరఁ
గుచమండలములఁ గన్గొనిభయంబందెడు
రీతిఁ జక్రములు పరిభ్రమింప
నలువొందుగోమావళులకుఁ గాకవడంకు
కరణిఁ బట్టెంబులు గంపమొంద

తే. వీరశృంగారములు మేళవించినట్టి
చెలువమున నిందుముఖులు తేజీలనెక్కి
వచ్చిరాహవ మొనరింప వారిఁ గోనఁ
బడఁతియొక్కతె మున్నాడి పాఱుతెంచి. 111

◆ ప్రమీల యర్జునునితో యుద్ధముఁ జేయుట. ◆

ఉ. అమఖవాజిఁ బట్టి యసహాయమునం గొనివచ్చితాని జ
స్వామినిపంపునందుగగశాలకు నప్పనచేసె నంత న
త్తామరసేక్షణల్ హయవతంసముఁ బట్టినఁ నాగ్రహించి సు
త్రామతనూభవుండు సమరంబున కుద్యతుఁడయ్యె నయ్యెడన్.

క. భూరితురంగ మరథమద
వారణములతోడ సతులవారణఁ గొలువం
బోరికిఁ బ్రమీలగదిసి గ
భీరగుణారానమడర భీకరభంగిన్. 113

చ. శతమఖసూతిపై వివిధసాయకముల్ నిగిడించి యొక్కవ
జ్రితులిత బాణఘట్టన నురస్థలి నొంచినఁ గ్రీడిమార్గణ
త్రితయము వానిమీఁద నడరించినఁ దోడ నెత్రుముంచె నంతలో
నితరవధూటులుం దెరల నేసిరితక్కిన వీరయోధులన్. 114

క. ఈరీతినుభయబలములుఁ
దారసమునఁ బోరునెడఁ బ్రతాపము మెఱయం
గారమణీమణి మధురవ
చోరచనదలిర్ప నింద్రజున కిట్లనియెన్. 115

చ. కనుఁగొనినన్ను నాహవముఖంబున మార్కొనినిల్వనీక కా
దనిమిషసిద్ధసాధ్యులకు నైననసాధ్యము కార్యకాంక్ష నె
మ్మనమునఁ గల్గెనేనురభిమానము మానిప్రియంబెలర్ప న
న్నెనసినవేడ్కతోడ వరియింపుహయంబుఁ బరిత్యజించెదన్. 116

తే. సోమపానంబు నీయగ్రజుండొనర్చ
యిష్టఫలభోగములఁ బొందనిమ్మనీవు
నిటమదీయాధరామృతంబెలమిఁగ్రోలి
యువతిమండలమునకెల్ల నొడయఁడగుము. 117

చ. అనిన ధనంజయుండు దరహాసమనోజ్ఞముఖారవిందుఁడై
వనిత నిను న్వరించిన నవశ్యముజచ్చునరుండుచచ్చి య
మ్మనుజుఁడధోగతిన్ యువతిమండల మేగతి నేలుధర్మనం
దనునకు నెవ్వరీహయ వతంసముఁ జేర్చెదువారు పిమ్మటన్. 118

క. నావుడుఁ బ్రమీలయిట్లను
దేవేంద్రజుతో మదీయదేశంబునకున్
రావలసె దైవికంబునఁ
బోవచ్చునెనీకుఁ బ్రాణములతోనింకన్. 119

చ. రణమున నాదుభీకరశరంబుల నైన లసత్కటాక్షవీ
క్షణముల నైన నిన్నిపుడు చంపుట తప్పదు రిత్త చావఁగా
రణ మది యేల నన్ను రతిరాజసుఖంబులఁ దేల్చి తీఱినన్
గణనకు నెక్కఁ బావక ముఖంబున నీబడి నేగుదెంచెదన్. 120

మ. అనినన్ గైకొన కింద్రినందనుఁడు మాద్యన్నీల నాఱమ్ములే
సిన నక్కాంతయు నేడుకాండములు మైఁ జిక్కించి తోడ్తోన శ

స్త్రనికాయంబుల ముంప నాతఁడలుకన్ సమ్మోహనాస్త్రంబువిం
ట నమర్చన్ పతి తూలెంచెమూర్ఛయునుఁ నాన్నారాచమున్ జయ్యునన్

తే. నరుఁడుగాండీవమున నొంటనారిగూర్చి
యతివఁ డెగటార్తనను చుఁ గట్టల్కతోడఁ
దీవ్రతరబాణ మొకటి సంధించి యేయఁ
గదలఁ గన్గొని పల్కె నాకాశవాణి.

క. పదివేలేఁడులు పోరినఁ
దుదినెప్పుడు గెల్పు నీకు దుర్లభ మిపు డీ
సుదతి వరియించి హయమును
గదలింపుము ముదముతోడఁ గరిపురి కనిసన్. 123

ఉ. అంబరవాణిపల్కు విని యర్జునుఁ డవ్విధ మాచరించె వా
హంబును వృక్షదేశమునకై చనె నం దుదయించు పాపివ
ర్గంబు ప్రభాతవేళ నెఱపాపియము దాల్చుఁ బగల్ దినావసా
నంబునఁ జచ్చుఁ దద్విహరణస్థితు లవ్విపినోపరిస్థలుల్. 124

వృక్షదేశవృత్తాంతము.

వ. మఱియు నవ్వృక్షదేశంబునఁ జరించు తిర్యఙ్మనుష్యవర్గంబు నైస
ర్గికవిశేషంబునుం గనుంగొనుచుఁ గదలి బహువిధస్వకర్మానురూప
జాతు లయిన యేకపాద ద్విపాద త్రిపాదానేకవికటపాదులును శశ
వృకాచ్ఛ భల్ల వలీముఖోష్ట్ర ఖర కురంగతురంగమ సృభరోమ
గో మహిష వ్యాఘ్ర మార్జారముఖులును నేకశృంగ ద్విశృంగ
త్రిశృంగ చతుశ్శృంగ వక్రశృంగ దీర్ఘశృంగులును నులూకాక్ష
కోకిలాక్ష కుళీరాక్ష కేకరాక్ష పింగళాక్ష విషమాక్షులును నాదిగా
గలవికృతవేషులు చరించు నానావిధజనపదంబు లతిక్రమించి పోవు
చుఁ దురంగం బగ్రభాగంబునననేకపిశాచనిశాచరశాకినీఢాకినీభూత
బేతాళ గణశరణ్యంబును బ్రచాడగండభేరుండచమర వేదండగండ

కరురువరాహశరభశార్దూలాదిమృగసమ్మర్దనిర్దయవిహారానుగుణ్యం
బును నగునొక్క దారుణారణ్యంబు బ్రవేశించె. 125

క. ఘనదుష్కృతాలవాలము
ననయము నశుభముల కెల్ల నాకరమును నై
జనలోకభయంకర మగు
దనుజపురం బొకటి మెఱయుఁ దద్విపినమునన్. 126

మ. భయదాకారులు మూఁడుకోట్లుదనుజుల్ పార్శ్వంబులం గొల్వ ని
ర్దయచిత్తుండు పటుస్ఫులింగవికిరద్దంష్ట్రాకరాళాననుం
డయుతాశాంతమదేభసత్త్వుఁ డనివార్యస్ఫూర్తిమై భీషణా
హ్వయదైత్యుండు బకాసురాత్మజుఁడు రాజై యుండు నప్పిటికిన్.

క. నగరోపకంఠకానన
జగతీధరబిలనివాసి సాహసకర్మా
నుగపిశితనవిద్యాపా
రగుఁ డొకఁడు చరించు బ్రహ్మరాక్షసుఁ డచటన్. 128

సీ. అఱుత యజ్ఞోపవీతాంత్రిగుచ్ఛంబులు
వఱలు నెత్తురుపట్టెవర్ధనంబు
మనుజకపాలాక్షమాలికావలయంబు
చర్మకాషాయవస్త్రద్వయంబుఁ
గరటివిస్ఫారకర్పరకమండలువును
వేల్లను గర్ణపవిత్రికమును
గరమునందుఁ బురాణకంకాళయష్టియు
నలర మేదోహోత యనెడుపేర

తే. వాఁడు దనుజపురోహితవర్యుఁ డచట
కరుగుదెంచిన యజ్ఞవాహంబుఁ జూచి
వచ్చి కొలువున్న దానవేశ్వరునిఁ గదిసి
సన్నుతోక్తుల నిట్లని విన్నవించె. 129

శా. మీఁతండ్రిం బకదానవేంద్రుని బలోన్మేషంబునం జంపి వి
ఖ్యాతిం జెందినభీముతమ్ముఁ డురుబాహాదర్పయుం డర్జును
డాతం డిందుల కేఁగుదెంచెఁ బగ సాధ్యం బయ్యెఁ గైకొందు ను
ద్గాతృత్వంబు భజింపు మీవు నరమేధం బాశఁ బ్రీతిగన్. 130

సీ. జరపిరి నియతి నాషాఢమాసంబున
వరుసతో రుధిరాసవములు గ్రోలి
శ్రావణంబునఁ దపశ్చరణ ముగ్రంబుగాఁ
జలిపిరి మాచకమ్మలను మ్రింగి
చపలత్వ ముడిగి భాద్రపదంబునందు జ
పం బొనర్చిరి పాశుపతుల సమలి
నడపి రాశ్వయుజంబునను వ్రతంబులు
బ్రహ్మచారుల విఱిచి భక్షణము చేసి

తే. నియమవిధు లన్నియును దీర్చి నిష్ఠతోడఁ
గార్తికమున భుజించిరి కన్యకలను
గలరు నీపేట బ్రహ్మరాక్షసులు మఱియు
గాలవంచకు లరయ నక్తంచరేంద్ర. 131



క. వీరల కందఱకును సుఖ
పారణ గావింపవలయుఁ బార్థునిబలముల్
ధారాదత్తము చేయు ను,
దారత విచ్చేయు మన నతం డెల నగచున్. 132

చ. ఎనయఁగ నీకు నెద్ది ప్రియ మిందులలో ననినం బురోధసుం
డనుపదతృప్తిఁ జెప్పితి సహస్రము దంతితురంగవీరయో
ధనివహమస్తకంబుల మెదళ్లు సమస్తము నిచ్చినం బ్రియం
బనినఁ గరంబు వేఁడ్రిసి దనుజాధిపుఁ డాతనిఁ జూచి నవ్వుచున్. 133

క. అగమవిధ్యుక్తముగాఁ
జాగింపుము వేద యజ్ఞసంభారంబుల్

వేగ నొడఁగూర్పు మని భూ
భాగము గంపింపఁ గదలెఁ బ్రధనోన్ముఖుఁడై. 134

క. హుంకారముఖరదానవ
కింకరచటులాట్టహాసకృతసఖ్యనిశా
తంకపటువిజయభేరీ
భాంకారము లెసఁగ నాప్తబలములతోడన్. 135

తే. భీషణుం డేగ నప్పాట భేదనంబు,
దానవాంగన లుత్సేధతనులు ద్వాత్రి
యోజనపయోధరలు వికటోగ్రముఖులు,
కామరూపిణు లద్రిశృంగంబు లెక్కి. 136

క. ఏతెంచుపాండుపుత్త్రిని,
కేతనము నుండి పోరికిన్ మలసెడున
వ్వాతూలసుతునిఁ గని సం
జాతస్మరణముల రక్కసులు దమలోనన్. 137

♦భీషణుం డర్జునునితో నని సేయుట.♦

క. వీఁడు మనలంక తోఁకం,
జూడినమర్కటము వీనిఁ జూచిన గుండెల్
నేఁడును గలఁగుచు నున్నవిఁ
వీఁ డేటికి వచ్చె నేరువిత్తయి యిటకున్. 138

ఉ. అంచుఁ గలంగఁ బాఱుసమయంబుగ నోడకుఁ డంచునొక్కన
క్తంచరి మింటి కుప్పరముగా నెసఁ దాఁటి పయోదభంగి మే
న్పెంచి కఠోరహుంకృతులఁ బేరము వాఱుచుఁ జుట్టిముట్టి మ
ర్దించె, గిరీటిసేన నతిదీర్ఘకుచద్వయతాడనంబులన్. 139

క. తక్కినదానవకాంతలు,
మిక్కుటముగ నట్ల బలిమి మెఱయ బలంబుల్

దిక్కు చెడిపఱచఁ గనుఁగొని,
యక్కపివీరుండు మిగుల నాగ్రహ మెసఁగన్.

చ. ఒడిసి మహోగ్రవాలమున నుక్కడఁగంగ బిగించి ప్రాణముల్
మిడుక సమీపశైలముమీఁదికి నుద్ధతిఁ ద్రిప్పివైచి యున్
బిడికిటఁ గూర్పరంబులఁ జపేటతలంబులఁ బార్ష్ణిఘాతలం
గెడపియు దైత్యభామినుల గీటడగించుచు నుండ నత్తఱిన్. 141

మ. రథచక్రార్భటి భూరినిష్ఠురధనుర్జ్యారావముం గూడి ది
క్పథవాటీకుహరంబు బ్రతిధ్వనుల సంపాదింపఁ గేతుప్రభు
గ్రథితాహస్కరమండలుం డగుచుఁ గింకన్ భీషణుం డుల్లస
త్ప్రధనారంభవిజృంభమాణుఁడయి యప్పార్థు వెసన్ దాఁకినన్. 142

క. ఉభయబలంబులు నప్పుడు,
రభసంబునఁ గలయఁబడి పరాక్రమమున న
క్షుభితగతిఁ బోరె బాహా,
విభవంబులు జూచి సురలు విస్మయ మందన్. 143

మ. నరుపై దానవనాథుఁ డేఁడుశరముల్ నాటించినం గ్రీడిని
ష్ఠురభల్లంబుల మూఁట నొంచె నతఁ డాటోపంబునం బేర్చి తో
మరషట్కంబు బఱపించినం దునిమి శుంభల్లీల నైదస్త్రముల్
బరులం గ్రుచ్చి కిరీటి యొక్క బలుఁగోలం జాపముం ద్రుంచినన్

సీ. దైతేయుఁ డొండుకోదండంబు సవరింప
సగుణంబుగాఁ ద్రుంచె సవ్యసాచి
రాత్రించరుండు చక్రముఁ బ్రయోగించిన
నరతోర్వఁ దునుమాడె నర్జునుండు
బకతనూభవుండు కృపాణంబు జళింప
నడిమికి విఱిచె ధనంజయుండు
క్రవ్యాదభర్త భీకరశక్తి నిగిడింపఁ
బరిపరగాఁ జేసె ఫల్గునుండు

తే. మఱియు దనుజుండు శాంబరీమంత్రమహిమ,
బర్వతారణ్యజీమూతపటలభయద
మృగసరీసృపవితతి నిర్మింప నర్జునుఁడు,
మట్టుపడ నేసె నాయాయిమార్గణముల. 145

భీషణుండు మడియుట,

క. అపుడు ధనంజయుకడ కొక,
తపోధనుఁడు వచ్చి బహువిధంబులఁ గార్యం
బుపదేశింపఁగ దానవు,
కపటమకాఁ దెలసి వానిఁ గడతేర్చుటయున్. 146

మ. గదకేలం గొని తేరు డిగ్గి యపు డాకౄవ్యాదుఁ డవ్యాహతిం
గదియం బాండుతనూభవుండు కినుకం గల్పాగ్నికీలానిభ
ప్రదరం బేసెఁ గూలె సత్త్రటి నిలింప ద్రోహిమస్తం బిలన్
భిదురాఘాతనిపాతమేచకమహీభృత్తుంగ శృంగం బనన్ 147

క. అసుర వధించి తదీయా,
వసథంబునఁ గల సమస్తవస్తువులును సం
తసమునఁ బార్థుఁడు చేకొనె,
మసలక తురగంబు నరిగె మణిపురమునకున్. 148

సీ. పద్మరాగోపలప్రాకారభాసురం
బారసాతలపరిఖావృతంబు
ప్రోత్తుంగహేమగోపురపరిష్కారంబు
పటురత్నసౌధవిభ్రాజితంబు
వినుతవర్ణాశ్రమవిశ్రమస్థానంబు
చతురంగవాహినీసంకులంబు
వివిధవస్తువ్రాత విరచితాపణకంబు
బహులతటాకారామ పరిసరంబు

తే. ప్రతిదినోత్సవదేవతాభవనఘటిత,
లలితమంగళవాద్యకోలాహలంబు
బభ్రువాహనభుజపరిపాలితంబు,
మానినైశ్వర్యధుర్యఁబు మణిపురంబు. 149

చ. అనుపమ మైనతద్విభవ మంతయుఁ జూచి మరాళకేతనుం
గనుఁగొని పార్థుఁ డగ్రికటకం బది యెవ్వని దన్న నవ్విభుం
డను భవదాత్మసంభవుఁ డహర్పతితేజుఁడు బభ్రువాహనుం
డనునరనాథుఁ డేలు సముదగ్రితమై నిజరాజధానిగన్. 150

చ. ప్రకుపితవైరివీరనరపాలసమున్నతకంఠలుంఠన
క్రికచ మితండు నే మొదలుగా నిటఁ గల్గుసమస్తభూమిభృ
న్నికరము నిక్కుమారవరునిన్ భజియించు సహస్రసంఖ్యహా
టకభరితంబులై నశకటంబు లుపాయన మిచ్చినిచ్చలున్. 151

క. సుతజనకభాంధవంబున,
నతఁ డూరకయున్న లెస్స యటుగాక సము
ద్ధతిఁ దురగముఁ బట్టిన నే,
గతి మఱి విడిపింప వశము గా దెవ్వరికిన్. 152

క. అనునెడ సుబుద్ధి యను న,
జ్జనపతిసేనాని ఖురళిసంభ్రమ మెసఁగన్
జని మనుగుతోఁ్రవఁ బ్రిమదం,
బున మెలగెడు నమ్మఖాశ్వముం గనిపట్టెన్. 153

వ. అయ్యవసరంబున. 154

శా. సామామోదవినోదిన్మై చనియె భాస్వంతుండు శానుంతమా
రామక్షోణిరుహాగ్రిపీడముల నాక్రమించె నాకాశవీ
థీమధ్యంబునఁ దారకాగణము సద్ధిచ్ఛవింబొల్చె ది
క్సీమాగోళము నంతకంతకును గొంచెంబయ్యె లేఁజీఁకటిన్. 155

క. సరసిజబాంధవుఁడీగతి
చరమాంబుధివీచికావశంవదుఁ డైనన్
దురగంబుఁ గొనుచుఁ బురమున
కరుదెంచె సుబుద్ధివేడ్క నాసమయమునన్. 156

సీ. కురువిందమయకుడ్య కుట్టిమంబులచేతఁ
బగడంపుఁ జేవకంబులచేతఁ
దళతళమెఱయు దంతకవాటములచేతఁ
గనకసోపాన మార్గములచేతఁ
దోరంపుముత్యాల చూరుమొగ్గలచేత
జిగిమించుసాల భంజికలచేత
మృదులాంబరంబుల మేలుకట్టులచేత
సరిలేనిధూపవాసనలచేత

తే. మహిమఁ బెంపొందు నాస్థానమంటపంబు
నందుమూర్ధాభిషిక్తులు సందడింప
బభ్రువాహనుఁ డధికసౌభాగ్యగరిమ
గడలుకొనరాత్రి పేరోలగముననుండి. 157

చ. క్రమమున సప్తిరక్షకులు క్రిందుకొనం గరదీపికాసహ
స్రములు వెలుంగఁ జిత్రపటచామర హేమఖలీన కింకిణీ
కములగు నుత్తమాశ్వములఁ గ్గొనుచుండెడుచోసుబుద్ధిభూ
రమణునిఁగాంచి యత్తురగరత్నముఁ గానుకపెట్టి మ్రొక్కినన్. 158

తే. అవ్విభుఁడు దానిరేఖకాహ్లాద మంది
కదియఁ దెప్పించిచూచి మొగంబునిమిరి
ఫాలసంస్థితకలధౌతపత్త్రలిఖిత
చారుతరశబ్దబంధంబు చదువుకొనియె. 159

ఉ. దుర్జయరాజిమండల విధుంతుదమూర్తి యుధిష్ఠిరక్రతూ
త్సర్జిత మైనయీహయవతంసము త్రిమ్మర నంగరక్షగా

నర్జునుఁ డేగుదెంచె నిటలాక్షుని గెల్చిన జోదు విక్రమో
పార్జితలీలఁ బట్టుఁడు రయంబున శూరులు ధాత్రిఁ గల్గినన్. 160

వ. అని పఠించి. 161

ఉ. భూపకుమారుఁ డిట్లను సుబుద్ధిఁ గనుంగొని సాదరంబుగన్
మా పెదతండ్రి ధర్మజుఁ డమానుషవిక్రముఁ డశ్వమేధదీ
క్షాపరతంత్రుఁడై విడువఁగా నిటనచ్చిన దీహయంబు నా
నాపురవాటికావిహరణంబుల మజ్జనకుండుతోఁడుగన్. 162

మ. శివుతో నెక్కటికయ్యమం దొడరి మెచ్చించెన్ బ్రతాపించి వా
సవుసర్థాసన మెక్కె వేలుపులు మెచ్చం గాలకేయాదిదా
నవులం గీటడఁగించె నట్టిత్రిజగన్మాన్యుండు చిత్రాంగదా
ధవుఁ డిచ్చోటికి నేఁగుదెంచెనఁట మద్భాగ్యంబు సామాన్యమే. 163

క. కావున మన మెమరుకొనం,
గావలయు సమస్తసైనిక వ్రాతముతో
సేవిందుకుఁ దగుయత్నము,
గావింపుము వేసఁ బ్రభాతకాలంబునకున్. 164

తే. అనుచు సేనాని వీడ్కొల్పి యర్హభంగి
జనపతుల నెల్లనిజనివాసముల కనిపి
పవనహయము సాహిణులవశంబుఁ జేసి
యంతిపురమునకరిగె భూకాంతుఁ డపుడు 165

వ. అంతం బ్రభాతసమయంబగుటయు నక్కుమారుండు సముచితప్రకారంబున మేలుకని కాల్యకరణీయంబులు సర్వంబు నిర్వర్తించి వివిధమణిభూషణాంబర మాల్యానులేపనంబుల నలంకృతుండై నిఖిల సామంతమంత్రిపురోహితానేకహితజనంబులు పరివేష్టింప నాస్థానమండపంబునకు వచ్చి హయాదిరోహణంబు సేయునెడం గంచుకిజనంబు లంతంత ముందఱం గ్రందుకొనుసందడి దొలంగఁ బడియుచు హుంకారంబులు సేయుఁ బుణ్యాంగనానివహంబులు చల్లులాజాక్షత

దూర్వాంకురప్రసూనంబు లంగీకరించుచు వందివైతాళికమాగధ
స్తుతిరవంబులును ప్రచండభేరీమృదంగశంఖబిరుద కాహళరవంబు
లును నపరిమిత చతురంగవాహినీనివహకోలాహలంబులునునొక్కటం
తనిగిడి దశదిగంతరంబులం గడలుకొన బహువిధోపాయనపురస్స
రంబుగాఁ బురంబునిర్గమించి 166

సీ. తర్కించిహేమ భూధరముఁదేఁడనికాని
సౌవర్ణవితతికి సంఖ్యలేదు
లక్షించిమలయశైలమ్ముఁ దేఁడనికాని
గంధసారమునకు గణనలేదు
దట్టించిగంధమాదనముఁ దేఁడనికాని
ఘనసారపాళికిఁ గడపులేదు
చర్చించిరోహిణా చలముఁదేఁడనికాని
వివిధరత్నములకు వెలితిలేదు

తే. నాఁగఁదనపీటఁగల్గునానావిశేష
వస్తువులతోడ నధ్వరాశ్వంబుఁ గొనుచు
వచ్చివాహంబు డిగ్గివివ్వచ్చుఁగాంచి
బభ్రువాహనుఁ డందంద ప్రణతిఁజేసి 167

అర్జునుఁడు బభ్రువాహనుని దిరస్కరించుట.

ఉ. అప్పుడమాత్యకాంజలిఁ బ్రియంబునఁజేయుచు దేవనిన్నకై
తప్పునఁజేరెనీహయము తండ్రికినోర్వకపోదుబిడ్డఁ డే
యొప్పమిఁజేసెనేనియు ననూనకృపామతి నన్నుజూచియీ
తప్పుసహింపుమంచు వసుధాస్థలిఁ జాఁగిలిమ్రొక్కెఁ గ్రమ్మఱన్.

ఉ. మ్రొక్కిననాదరింపక నరుండువియన్నదిశాపవాక్యముల్
దెక్కొననాగ్రహంబుడుపలేకకుమారునిఁ దన్నెఁదన్నినన్
గక్కసమొంద కాతఁడనికారత నిల్చినరాజు లందఱున్
గ్రుక్కననాప్తవాక్యములుగా నపుడిట్లని రింద్రసూతికిన్. 169

సీ. తనయునిఁ గృపఁ జూడు మనియె సాత్యకి యింత
కలుషింపఁ జనదనెఁ గర్ణసుతుఁడు
హంసకేతనుఁ డిది యపకార్యమని చెప్ప
నీలధ్వజుండు మన్నింపు మనియెఁ
బనిలేనిపని యని పల్కెఁ బ్రద్యుమ్నుండు
కృతవర్మ తగ దపకీర్తి యనియె
సనుసాల్వుఁ డనియె భావ్యంబు గాదనియు నా
వరాశ్వుఁ డీచంద మసాయ మనియె

తే. మఱియు దక్కిన రాజు లందఱును వేన
వేలభంగుల నీరీతి విన్నవింప
నాదరింపక మదిఁ గోపమంతకంత
కడరఁ బార్థుఁడు బభ్రువాహనునిఁ జూచి.

ఉ. ముంగలఁ బాఱుతెంచుహయముం గనిపట్టి పిఱుంద వచ్చు
నం గని ప్రాణభీతిఁ గదనంబునఁ పం జోరవైతి వోరి మా
వంగడమాట బొంకు కులవైశ్యనకుం గనెఁ బోలు నిన్నుఁ జి
త్రాంగద యన్నఁ బొక్కి పడి యూర్పు ప్రసూనుఁ డుపల్కెఁ దండ్రితోన్

మ. నను నేమన్నఁ గొఱంత లేదు సభలోనం బుణ్యచారిత్ర మ
జ్జననిం దప్పఁగ నాడి తీనికృతికిన్ సైరింపఁగా నేర నా
వినయం బింతకుఁ దెచ్చెఁ జాలుఁ బలుకుల్ వేయేల నేఁడు తిప్రియుం
డనో వైశ్యుం డనొ చూడు మంచు మగిడె న్సంగ్రామసంరంభియై.

చ. అపుడు సుబుద్ధి సైన్యముల నన్నిటి నొక్క మొగంబుగా నమ
ర్చి పురికిఁ గానికల్ మగుడఁ ద్రిప్పి జయావహఘుల్లరీమృదం
గపటహరావముల్ దిగిభకర్ణపుటీపుటికాంతరంబులం
దుపహతిఁ జేయఁ దత్క్రతుహయోత్తమ మొక్కెడఁ గట్టఁ బంపుచున్.

◆బభ్రువాహనుఁ డర్జునసైన్యంబు దైన్యంబు నొందించుట.◆

సీ. కల్పితధ్వజఘంటికామాల్యసముదీర్ణ
హేమశతాంగంబు లేను కోటు

లోకయర్బుదము మదవ్యాఘనిర్ఘాత
సన్నాహములు భద్రసామజములు
చటులధాటీసముద్భటమనోజవనిర్ణి
రోధవాహంబు లర్బుదయుగంబు
మూడర్బుదములు సముద్యద్భుజాటోప
విజయధౌరేయులు వీరభటులు
తే. క్రందుకొన సైన్యనాయకాగ్రణి ఘటించెఁ
గాలచక్రసమాకృతిగాఁ గవీంద్ర
కేతుబలనాశకరధూమకేతు వనఁగ
నాహవభయంకరం బైనమోహరంబు. 174
వ. అనుపమరత్నబంధురము హాటకనిర్మితముఁ మయూరవా
హనపరిశోభితంబు వివిధాయుధసంభృతముఁ విచిత్రకే
తురుచిరంబు నైనయరదంబు ముదంబున నెక్కి బభ్రువా
హనుఁడు తదగ్రభాగమున నాయిత్తమై నిలిచెం జలంబునన్. 175
శా. ఆరీతిన్ నరనాథసూతి కృతజన్యారంభుఁడై నిల్వనా
నీరంధ్రస్ఫారబలంబు లొండొరు లధిక్షేపంబు లేపారఁగా
వీరావేశభరంబునం జెలఁగి విద్వేషించి ప్రాక్పశ్చిమాం
భోరాసుల్ దలపక్షచందమున నార్పుల్ మింటితో నంటఁగన్. 176
మ. చతురంగంబులు నిట్లు మొత్తుకొని వాచాటోగ్రరేఖానము
ద్ధతి సంభావితులై పరస్పరజయోత్సాహంబు లుప్పొంగ న
ద్భుతవృత్తిం దెగి పోరు నుచ్చలితమేదోమాంసమస్తిష్కశో
ణితకీర్ణం బగుచుండె భండన మకుంఠీభూతశస్త్రాహతిన్. 177
క. ఈలీల దుర మొనర్పఁగ
వాలినదర్పమున బభ్రువాహనధరణీ
పాలుండు తేరు గదియం
దోలించి సురేంద్రతనయుతో నిట్లనియెన్. 178

చ. తనయుఁడఁ గాన నీచరణతామరసంబులు భక్తిఁ గొల్చువే
డ్క నరుగుదెంచినం గడవఁగా నటు లాడితి వాదు సెల్ల మ
త్పునిశితబాహువిక్రమము చూచుతలంపునఁ గాదె తీర్తు నీ
మనికిత మిప్పు డందుకొనుమా నిజకార్ముకముం దనుం బల్కినన్.

మ. అనిసాల్వుం డపు డక్కుమారు నెదిరిం చాకర్ణపుంఖముం
డనుఁడై ఘోరశరాంబకంబులు నిగుడ్పన్ వాని లెక్కింప కా
తనిమోఁదం జడి గొల్చె నూఱుశతపత్త్రిద్యోతశాంతాస్త్రముల్
కినుకన్ వాఁ డవి త్రుంచి తోడనపయిన్ గ్రొక్కెల్చె బాణౌఘముల్.

క. ఈచందంబునఁ బటునా
రాచపరంపరలఁ దొరఁగురక్తంబులచేఁ
బూచినమోదుగులకు నెన
యై చేసిరి దురము త్రిజగదాభీలముగన్. 181

ఆ. అపుడు బభ్రువాహుఁ డనుసాల్వుతేరియు
హయముల సూతు సిడెముఁ గార్ముకంబుఁ
దునిమివైచె నాలుగును నైదు నేడు నె
న్మిదియుఁ దోమరముల నదటు మిగిలి. 182

మ. అనుసాల్వుం డను నప్పు డూనశతాంగారూఢుఁడై నిల్చి తో
డన సజ్జీకృతచాపుఁడై చటులకాండశ్రేణులన్ బభ్రువా
హనుఁ దూలించిన నాతఁ డంతయును రోషావేశతం జేర్చి వేఁ
కసదస్త్రాహతి నాతనిన్ విరథునింగాఁ జేసి పెల్లార్చినన్. 183

క. గద కేలం గొని ధరఁ గ్రి
క్కదలఁగ ననుసాల్వుఁ డెదురుగా నడవ నవ
ప్రదరములు బభ్రువాహనుఁ
డెదవించిన వ్రాలె నాతఁ డెత్తినమూర్ఛన్. 184

వ. అప్పుడు. 185

శా. ప్రద్యుమ్నుం డనుసాల్వపాటునకు నుగ్రింపశ్యుఁడై హేమపుం
ఖద్యోతాశుగపఙ్క్తి లేయఁ నవు డల్కన్ బభ్రువాహుం డవి
చ్ఛేద్యపౌరిధిమఁ జేర్చి తత్తనువు ముంచెన్ బాణవర్షంబునన్
సద్యోమగ్నముగా ననంగుఁ డగుటన్ స్వాభావికార్థంబుగన్. 186

మ. గురుదర్పోద్ధతి నిట్లు మర్మములు గీల్కొ నేయఁగా శౌర్యవి
స్ఫురణాహఙ్కరణంబు కుంటువడి యచ్చో నేదుచందంబునన్
శరసంవేధితదేహుఁడై నిలిచె విష్వక్సేనసూనుం డు సం
గరకర్మోచితకృత్యముల్ మఱచి కింకర్తవ్యతామూఢతన్.

క. హరిసూను నివ్విధంబున,
దిరుగుమనడ నేసి మరియుఁ దీవ్రశరములన్
నరుని చతురంగసేనల,
నురణంబున బభ్రువాహనుఁడు సమయింపన్ 188

క. కనుఁ గొని ప్రద్యుమ్నుఁడు నె
మ్మనమునఁ దెలివొంది విక్రమంబుంబున దను నొం
చిన యట్లు బభ్రువాహను,
తనువును నస్త్రముల నొంచెఁ దద్దయు నలుకన్. 189

వ. మఱియును. 190

శా. తత్సేనానివహంబు నుద్ధతబలోత్సాహంబునం బూతనా
జిత్సూనుండు కఠోరసాయకములఁ జెండాడ నాపుంఖవి
ద్ధోత్సేధాగ్రికబంధకంఠబిలనిష్ఠ్యూతాసృగ్ధారామిళ
త్స్మృత్సాంకర్దమదుర్గమం బగుచుఁ గాన్పించెన్ రణం బయ్యెడన్

సీ. వడి జాఱి దిరిగి మొగ్గెడుమదావళములుఁ
దోనఁ దూఁగటిఁ యాధోరణులును
బల్యాణములఁ గ్రింద బడిన రాహుత్తులుఁ
గూలి విఙ్జుఁ దన్ను కొనెడుహారులుఁ

బోరవు దప్పినరథంబులసమీపంబునఁ
జక్కి నరథిరథ్యసారథులును
బొలిసినవీరయోధులుఁ జెంత దుమ్మైన
చక్రాసిధనురాదిసాధనములుఁ
తే. జింపులైనమైవడంబులుఁ జిద్రుపలైన,
సీసకంబులు నలియైనచిందములును
ద్రుంపులైనచామరములుఁ దునకలైన,
త్రొడవులునుగల్గినమరవసుత్యుగ్రమయ్యె. 190

క. అప్పుడు చతురంగంబుల,
కుప్పలు కులగోత్రగరిమఁ గొంచె పరుపంగా
నుప్పొంగి మానసంబులఁ
గప్పరపడి భూతములు జిఘాంసాపేక్షన్. 192

చ. అలమి గజాశ్వమర్త్యకణపాళి నంకము లందమర్చి తి
త్తొలిచి పృథూరుజానుజఘనోదరపార్శ్వభుజాంతరంబులన్
గల పలలాదులం దనిసి కర్పరముల్ బలితెంపుగోలలం
బెళపెళ నొక్కి లోమెదడు పీల్చి మదంబునఁ జొక్కియాడుచున్

వ. మఱియును. 195

సీ. నృకళేబరంబు మింటికి వైచి కందుక
క్రీడ వర్తించు డాకిని యొకర్తు
దంతిదంతమ్ములాతముగఁ ద్రిప్పుచు నాడుఁ,
జౌపదంబులకుఁ బిశాచ మొకటి
యజినంబు చెఱఁగుగా నభినయించుచు దేశ,
పాత్రియె యొకప్రేతపాత్రిలాడు
భుజమునఁ గూబరంబు ధరించుకొని సోలు,
దరిజేసి యగుచు బేతాళుఁ డొకడు

తే. భూతగణములు గరతాళములు ఘటింప,
జిత్రగతి నొర్త్తచకచకఝుంకృతులకుఁ
గొనుగువాళుల నఖిలదిక్కులు చలింప,
దాండవం బాడు నటభైరవుండుఁ బోలి. 196

చ. అది గని బభ్రువాహుఁ డభియాతికి నడ్డముగా వడిన్ రథం
బు దఱిమి నిష్ఠురాంబకసముత్కరముల్ నిగిడింప గూఁటిలో
నొదిఁగినగూబచందమున నుండియు నమ్ములు వో విదిర్చి ము
న్నదరఁగ నార్చి చండవిశిఖావలి నాతని నొంచెఁ గ్రమ్మఱన్

ఉ. నొంచుట బొంకుగా నతఁడు నూల్కొని కృష్ణతనూజుఁ డెక్కఁగా
ద్రుంచె రథంబు లిర్వది యదుప్రవరుండును బభ్రువాహుఁడో
రంచితవిక్రమంబు గొనియాడుచుఁ దా నరదంబు లేయుచో
నెంచ నశక్య మయ్యె నతఁ డెక్కఁగఁ ద్రుంచిన తేరు లేరికిన్. 198

ఉ. ఈసరవిం బరస్పరజయేచ్ఛల వెండియు దివ్యబాణవి
న్యాసపటుప్రహారకరణంబులఁ జక్రగదాపరశ్వధ
ప్రాసకృపాణఖేటములఁ బట్టి పెనంగిరి బాహుశౌర్యముల్
త్రాసునఁ దూఁపవచ్చు ననఁ దక్కువ యెక్కువలేక యిద్దరున్.

క. క్రోధాగ్నిజ్వలితశిఖా,
యోధంబులు వెలికి నెగయుచున్నకరణి న
య్యోధవరులతనువుల నని,
రోధక్షతజోగ్రనిర్ఝరులు గనుపట్టెన్. 200

క. నిండినమూర్ఛల ధృతకో,
దండసమత్కోటిభూషితశిరోధులతో
నుండునెడ బభ్రువాహుఁడు,
గాండివగుణరావబోధకరమతిఁ దెలిసెన్. 201

తే. అప్పు తెలివొంది బభ్రువాహనుఁడు పాండు
తనయుఁ గదియంగ నరదంబుఁ దరుముకొనుచు

వచ్చునప్పుడు రాఘవేశ్వరుఁడు గుశుఁడుఁ
గయ్య మొనరింపఁ గదిసిన ట్లయ్యె ననిన. 202

క. విని వినయంబున నిట్లని,
జనమేజయనృపతి పల్కెఁ జైమినిఁ గని సం
దనుఁ డై శుకునితో నె,
ట్లని చేసెను రామచంద్రుఁడని యడుగుటయున్. 203

మ. కరుణాపూరితనేత్ర దారుణరణత్సామ్రాజ్యనిర్భరచారిత్ర బం
ధురసాలద్రుమచైత్ర నిర్దళితశత్రుక్షేత్ర రామాదిభూ
వరచారిత్ర నిరంతరోత్సవరణద్వాదిత్రరామాసము
త్కరసమ్మోహనగాత్ర విశ్వజగదేకచ్ఛత్ర భాగ్యోన్నతా.

క. క్షితినుతమీసరగండా,
ప్రతివీరవుకోపకంఠబహువిధఖురళీ
గతచతురతురగరింఖో,
ద్ధతధూళీపాళిచుళిచుళుకితబ్రహ్మాండా. 205

స్రగ్విణి. రాజవంశాగ్రణీ రాజచూడామణీ,
యాజిలక్ష్మీకరోదద్విలాసక్రియా
వీజనాకారపృథ్వీవరాహాంకభృ,
ద్వైజయంత్యంశుకోద్వర్తితార్కాంశుకా.

గద్యము. ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్రగాదయామాత్యపుత్ర
వినయవిద్యాసముద్ర పిసవీరభద్రప్రణీతం బైన జైమినిభార
తంబునం దశ్వమేధపర్వంబునం బంచమాశ్వాసము.





శ్రీ

# జైమినిభారతము



## అశ్వమేధపర్వము, షష్ఠాశ్వాసము.



శ్రీ రామాయణ భారత
చారుత కథాసుధా ప్రసన్న మనః పం
కేరుహ యసమానజయ
శ్రీరుచిర నివేశ నారసింహ మహీశా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయ నరేంద్రున కిట్లనియె. 2

శ్రీరామచరిత్రము.

క. భూనాథ కుశలవోపా
ఖ్యానం బఘపవనలేలిహానము శ్రేయో
ధానం బాశ్రితభక్తని
ధానం బది వినుము సావధానత మెఱయన్. 3

సీ. తండ్రిపంపునఁ జతుర్దశవత్సరంబులు
రాముఁ డరణ్యమార్గములఁ దపము
గావించి కదనరంగమున రావణకుంభ
కర్ణాదికుటిలరాక్షసులఁ దునిమి
చటులాగ్నిముఖమున జానకిఁ జేపట్టి
యనుజన్ముఁడు విభీషణార్కతనయ

గొల్చి

రా నయోధ్యానగరంబుఁ జొచ్చి

తే. పౌరు లెదురుకొనంగఁ బుష్పకము డిగ్గి
యా వసిష్ఠున క్రొ సాష్టాంగ మెఱఁగి
తల్లులకు మ్రొక్కి తనను వందన మొనర్చు
భరతశత్రుఘ్నులనుభుజాంతరముఁజేర్చె.

క. అంతట రఘునాయకుఁడు సు
మంతుఁడు మొదలైనముఖ్యమంత్రివరులహృ
త్సంతాప ముడుగ నాయా
యంతరముల గారవించు నాసమయమునన్.

క. పెనిమిటివియోగమునకున్
దనయుఁ డడవి కేగుటకు వసరుకౌసల్యా
జనయిత్రి రామభద్రునిఁ
దనయురమునఁ జేర్చి గద్గద స్వర యగుచున్.

శా. అన్నా రాఘవ నన్నుఁ గన్గొని వసిష్ఠాదుల్ భ
చ్ఛిన్నుం డతఁడు డప్రమేయబలుఁ డచ్ఛేద్యుం
పన్ నాలోనిపు డద్దశాస్యుఁ గలనన్ మర్దించి నీ
గన్నారం గనుఁగొంటిఁ గాన నిజముల్గాఁ గంటిఁ

తే. అనిన నంబకు మఱియు సాష్టాంగ మెరఁగి
రామచంద్రుండు బంధువర్గంబు ననుజ
వర్గమును గొల్వ నమరేంద్రవైభవమునఁ
బాలనము చేసె సాకేతపట్టణంబు.

సీ. పాదంబులు పుష్పఫలసమృద్ధి వహించె
నఖిలధేనువులుఁ జన్నవిసి పిదికె
జగతీపఘూటి రాజన్వతియై మించె
గత మయ్యె నెచటఁ దస్కరభయ

క. అరుణోదయమున రాముఁడు
తిరముగ సంధ్యాదివిధులు దీర్చినపిదపన్
గురుఁడైన వసిష్ఠునితోఁ
జరమనిశావేళఁ గన్నస్వప్నముఁ జెప్పెన్. 14

క. విని యమ్ముని రామునితో
నను సీతాగర్భరక్షణార్థము గావిం
ప నగుం బుంసవనక్రియ
లను జనకునిఁ బిలువఁబంపు లక్ష్మణుచేతన్. 15

సీ. అనుచు నమ్మునివర్యుఁ డానతిచ్చినయట్ల
మిథిలేశుఁ బిలువ సౌమిత్రిఁ బంప
వాస్తుకర్మఠులచే వామదేవమహర్షి
వినతత్రిగవ్యూతివిస్తృతంబుఁ
గనకశోపానశృంగాటకోజ్జ్వలముఁ
గాఁ బర్జన్యమణిమండపము ఘటింప
సుముహూర్తమున వసిష్ఠుండు రాఘవు సీత
నందుంచి పుణ్యాహ మైనపిదప

తే. నాజ్యతిలలును జరుహోమ మాచరించి
వెలఁది ధమ్మిల్లమున సూత్రవేష్టనం బ
మర్చి గోధూమయష్టాంగమాలికాయు
గళము గళమున నాగమోక్తముగ నునిచె. 16

శా. భేరీకాహళఝల్లరీమురజగంభీరధ్వనుల్ దిక్కులన్
దోరంబై చెలఁగెన్ రఘూద్వహుఁడు సాధుశ్రేణికిం బాయసా
హారంబుల్ కలధౌతపాత్రములఁ బర్యాప్తంబు గావించి నా
నారత్నాశ్వగజాగ్రహారములు దానం బిచ్చె మోదంబునన్. 17

తే. జనకుఁ డవ్వేళ సుతమహోత్సవముఁ జూచి
యలరితనచేతఁ బరిపాల్య మగుసమస్త

రాజ్యమును దాశరథికి నర్పణము చేసి,
చనియెఁ గౌశికసహితుఁడై వనమునకును. 18

క. కాకుత్స్థుఁ డుర్వి సర్వము,
నేకాతపవారణముగ నేలఁగ నొకనాఁ
డాకాంక్ష వొడమి జానకి,
యేకాంతం బైనవిభున కిట్లని పలికెన్. 19

ఉ. వల్లభ నామదిం బొడమె వాంఛిత మొక్కటి జాహ్నవీతటిన్
దొల్లిటియట్ల తాపసవధూటులతోఁ జతఁ గొంతకాలము
త్ఫుల్లవనీవిహారములఁ బ్రొద్దులు వుచ్చెదనన్న రాఘవుం
డుల్లము జల్లనం గలఁగ నొప్పనికోరిక సీత కోరినన్. 20

తే. వరుసఁ గానలఁ బదునాల్గువత్సరములు,
తిరిగియును భూమిసుతకోర్కి దీఱమికిఁ
దొలుతఁ దనకన్నదుస్స్వప్నదోషలతకు,
నెలఁతకోరిక ఫలముగా నిశ్చయించి. 21

క. కానిమ్ము నిన్నవశ్యము
గా నంపెదఁ గాని రేపు కదలు మనుచు న
బ్భానుకులేశుఁడు లోనికి,
జానకి వీడ్కొలిపి తన్నిశామధ్యమునన్. 22

◆శ్రీరాములు చారులచేఁ బౌరులవృత్తాంతంబు దెలియుట.◆

క. పౌరులవృత్తాంతంబులు,
చారులచేఁ జిత్తగింప సమయం బని దౌ
వారికుఁడు చెప్పి విని రఘు,
వీరుఁడు పిలిపింప వచ్చి వినమితు లైనన్. 23

క. ఇనకులుఁడు గూఢచారులఁ,
గనుఁగొని యీప్రొద్దు మత్సకాశంబునకుం

జనుడెంచినార లేమే,
వినఁబడియెనె పురములోని వింతలు మీకున్. 24

క. దూతలు సత్యముఁ జెప్పఁడు,
నాతోఁబుట్టుగుల నైన నన్నైనధరి
త్రీతనయ నైన నేరొక,
రీతిగ నాడరుగదా పురీజను లనినన్. 25

క. శ్రీరామ నీవు సాక్షా,
త్తారకమంత్రాధిదేవతవు నిను నధ్గిం
జేరుకొనువారు దురితివి,
దూరు లనిన నిన్ను నాడుదురె పురజనముల్. 26

క. కలుషములు నిన్నుఁ దలఁచిన,
నిలువున భస్మమయి పోవు నేఁ డెవ్వలనన్
దొలఁగనిపాపము వినఁబడె,
నలికెద మది విన్నవింప నశుభం బగుటన్. 27

చ. రజకియొకర్తు నాథుఁడు తిరస్కృతిఁజేసినఁ బుట్టినింటి కే
గ జనకుఁ డాత్మజం గని జగజ్జనగాత్రిమలీమసాంశుక
వ్రిజములు శుద్ధి సేయునిజవంశము మైల వడంగఁ జేసి తిం
టిజగడ మింటిలోనె హవణింపక నీ విటు లొంటి వచ్చుటన్. 28

చ. అని తనకూఁతుఁ దోడ్కొనుచు నల్లునిబోఁటికి నేగ మామఁ జూ
చనలములోన నెయ్యెలికిఁట్టుల మంఁచు నిల్లు వెళ్ళి నా
ల్దినములు నేఁడు నాకడకుఁ దెచ్చితి వే నలరాఘువుండనే
దనుజగృహీతసీతఁ దనదారని క్రిమ్మఱ దెచ్చి యేలఁగన్. 29

సీ. అనుచు నన్నీచాత్ముఁ డాడుదుర్భాషలు
విని కర్ణములు మూసికొనుచు నచట
నిమిషమాత్రంబైన నిలువ కమ్మడివేలు,
తలవంచుకొని పోయెఁ దనయఁ గొంచు

మలినాంబరాంబుకళ్మలయువాగూచ్ఛిష్ట,
కుక్షింభరులయందు గుణము లరయఁ
గలవె యైనను విష్ణుకార్యంబు గానదే
వరకిప్పు డెఱిఁగింప వచ్చు ననిన

తే. గుండె నీరుగ నవిసి కాకుత్‌స్థవర్యుఁ
డెట్టకేలకు ధైర్యంబు మట్టుపఱచి
చాలపురుషుల నంపి తచ్ఛ్రమరాతి
గడపె నొకబ్రహ్మకల్పంబుఁ గడపి నట్లు. 30

శా. ఆలోనన్ భరతాదిసోదరులు సేవాపేక్ష రామక్షమా
పాలుం గొల్వఁగ వచ్చి కర్ణపరితాపవ్యగ్రిలోకావవా
దాలాతగ్రథితాత్మరుక్ప్రశునలోలాపాటలాసాంగధా
రాళాశుప్రవిలిప్తగండఫలకోరస్కుఁ విలోకించుచున్. 31

ఉ. ఎన్నఁడు లేమి నేఁ డినకులేశ్వరుఁ డేమికతంబొ బాష్పసం
ఛన్నముఖాబ్జుఁడై ఘనవిషాదముఁ బొందుచు నున్నవాఁడు వి
ద్వన్నుతశీలుఁ డెంతదురవస్థకుఁ దావల మయ్యె నంచుఁ దా
రన్నపదాబ్జముల్ గదిసి యందరు సాఁగిలి మ్రొక్కిలోఁగుచున్.

క. నీయంఘ్రిసేవ సకల,
శ్రీయోమూలముగ నెఱిఁగి సేవింపంగా
మాయెడ నిపు డేమియుదయ,
చేయవు నే మేమితప్పుచేసితి మనినన్. 33

శ్రీరాములు సోదరులతో జానకి నెడఁబాసెద ననుట.

క. వారలతో రఘువరుఁ డనుఁ,
జారులవాక్యములు చెప్పి సడిఁ బొందెను సీ
తారమణి లోకమున దు,
ష్టారుషుచే నిందఁ బొందు శ్రుతియుం బోలెన్. 34

తే. అశనిసంకాశ మైనలోకాపవాద
భయము డెందంబు వ్రక్కలింపంగఁ దొడఁగె
సాధ్వి యగుసీత విడిచెద జననభీతి
యోగపురుషుండు మమకార ముడిగి నట్లు 35

తే. అనిన భయకంపితస్వాంతుఁ డగుచు భరతుఁ
డనియె నిట్లానతిఁజూతురయ్య బుధులు
కపిల ఘటియించి యస్సృష్టిగలసెననుచు
దారుణాటవివిడుచుచు నెదయఁదొఱంగి. 36

సీ. అదిగాక లంక దశాస్యునిఁ బొరిగొన్న
వెనుక బ్రహ్మాదులు వినుతి సేయఁ
జిచ్చులోఁ జొచ్చి నిల్చినహీసుతఁ జూచి
యీనాతి తనకోడలై నకతనఁ
గనఁ గల్గెఁ బుణ్యలోకము లట్లు గాకున్న
సుతశోకమృతులకు సుగతి గలదె
యనుచు వానరసేన వినుచుండ నాడఁడే
మనతండ్రి దశరథక్ష్మాతలేశుఁ

తే. డలఘుచారిత్రి యిక్ష్వాకుకులపవిత్రి
జనకపుత్రిక నికటవై జనన నకట
చటులపక్షిమృగాహిరాక్షసవిహార
విషమకాంతారమున నెట్లు వీడిచె దనిన. 37

క. ఇనకులునితోడ లక్ష్మణుఁ
డను నపు డాలోకమాత నాఁడుదురాత్మక-
దునుమక జానకి విడుపం
జనునే యన నట్ల పలికె శత్రుఘ్నుండున్. 38

చ. అనఁటయు రాఘవుండు భరతాదుల కిట్లను సీత లోకపా
వని యగు నిక్క మైన నపవాదము పుట్టినచోట రాజ్ఞ మై

నను ననుజన్మపుత్త్రి లయినన్ హితుఁ డైన మదీయదేహమై
నను గణుతింపఁగాఁ దృణకణం బన జానకిఁ జెప్పనేటికిన్. 39

క. మనువంశజాతులై మును
చనినహరిశ్చంద్రముఖ్యజగతీశులవ
ర్తనములు కీర్తులచేతన
కొనియాడఁగ వలసెఁ గాదె గుఱుతుగ నిపుడున్. 40

క. కావున యశోవిహీనులు
జీవన్మృతు లగుట కేమి చెప్పఁగ నిందల్
రావచ్చినచోఁ దనువులె
పోవిడుతురు తొంటిభూమిభుజుల ట్లగుటన్. 41

క. మంగళచరిత్రి యగుసీ
తాంగన నపవాదభీతుఁ డగునాకుఁ ద్యజిం
పంగ నగు నేఁడు దుష్టభు
జంగము తనప్రాంతఁదుప్పొనం బూఁడ్చుగతిన్. 42

తే. అనిన రాముని తెగువఁ గన్గొని భయమున
భరతశత్రుఘ్ను లేగి రప్పటికిఁ దలఁగి
యన్నదుఃఖాంబునిధిమగ్ను డగుటఁ దెలిసి
యుండెనా వేళ సౌమిత్రి యొక్కరుండు. 43

క. ఆరాముఁ డపుడు లక్ష్మణుఁ
జేరఁ బిలచి విడిచిరమ్ము సీతను గంగా
తీరమున విడువవే నని
ధారన్ నాశిరముఁ దునుము తప్పుఁడ నేగన్. 44

క. జానకిఁ గానల కనుపం
గా నగుపాతకము నీకుఁ గా దది నా కౌఁ
గాని చను మన్నఁ దోరము
గా నిట్టూర్పులు నిగిడ్చి గమనోన్ముఖుఁడై. 45

— లక్ష్మణుఁడు సీతాదేవి నరణ్యమునకుఁ గొనిపోవుట. —

సీ. అన్నకు మ్రొక్కి రథారూఢుఁడై తోడ్తోఁ
దఱచుగా దుర్నిమిత్తములు గనుచు
వైదేహిమందిరద్వారదేహళి
శతాంగము డిగ్గి సీతపాదముల కెరఁగి
తల వంచుకొని భవద్భర్త నీకోరికఁ
జెల్లించెఁ గదలి విచ్చేయు వేగ
నని నీరాత్రిఁ దన్నలవోక వేఁడినఁ
జన విచ్చి నిన్నుఁ దోడనిపె ననుచు
తే. నలరి రామునిమణిపాదుకలు మునీంద్ర
కన్యలకు నర్హ మగురత్నఖచితభూష
ణాంబరసుగంధములును మేలైనవివిధ
భక్ష్యములు నేర్చి యరదంబుపై నమర్చి. 46
శా. ఆసీతాంగన యత్తలం గదిసి సాష్టాంగంబుగా మ్రొక్కి య
క్కౌసల్యం గని నాదుకోర్కి నెఱపం గాకుత్స్థుఁ డంపెన్ సుమి
త్రాసూనుం బయనంబు చేసి దివిషద్గంగావనన్మౌనికాం
తాసందోహముఁ జూడఁబోయెదఁ బ్రమోదం బార మీ రంపినన్.
చ. అన విని కోసలాధిపనరాత్మజ జానకిఁ జూచి యెట్లుగాఁ
జని యెద వమ్మ కంటకవిశంకటసంకటఘోరకాననం
బునకు భవన్ముఖాంబురుహమున్ రదనచ్ఛదమున్ మలీమసం
బును గడునీరసంబు నయి వాల్వాఱెఁ బోవుట గాదు నావుడున్. 48
క. వనవాసియుఁ గంటకమ
ర్దనుఁడును నగుదాశరథి నిరంతరమును నె
మ్మనమున నుండఁగ రా నే
ర్చునె యశుభము లెందు మీకరుణ గలనాకున్. 49

తే. అనుపుఁ డీఁక మీామనము సందియంబుదక్కి
యనిమహీజాతయత్తలకర్థి మ్రొక్కి
పెనఁచి పయ్యెద నీవిశో బిగియఁజెక్కి
హరితఘోటకయుత మైనయరదమెక్కి. 50

క. చనుసమయమున సుమిత్రా
తనయుఁడు సంజాతగద్గదస్వనుఁడై సూ
తునిఁ జూచి పలికె వేగం
బునఁ దోలుము హరుల రథముపోవలెననిన౯. 51

శా. ఆతం డిట్లను నాకు నశ్వహృదయం బామూలచూడంబు వి
జ్ఞాతం బాశుగతిన్ సమగ్రబలజన్యక్షోణులం బో నమ
జ్ఞాతుల్ మా కగుఁ గాని భావిమరవస్థల్ గాన కేతెంచు నీ
సీతాతన్వి భరింపఁ జాల మని వంచెన్ జంచలప్రోథముల్. 52

తే. ఐన నా నేర్పుఁ జూడు మీా వనుచు సూతుఁ
డలమి వలకేలఁ గందంబు లప్పళించి
సమరసముఁ జూపి నెఱయఁ బగ్గములువదలి
సైంధవంబుల ధేయనిచబుకు నేయ. 53

ఉ. స్యందన మప్పు డప్పురనిమద్యఁలు లీల నతిక్రమించు చో
ముందట నడ్డగించి మృదముల్ గలఁగంబడె జంబుకంబు లా
క్రిందన మార్తిఁ జేసె నవి గ్గానుమం దనదక్షిణాంబక
స్పందన మాటకున్ బెగడి జానకి లక్ష్మణుఁ జూచి యిట్లను౯. 54

— జానకి మార్గమున దుశ్శకునములు గనుట. —

ఉ. బెట్టుగ దుర్నిమిత్తము లుపేతము లయ్యెడు నామనంబు చే
పెట్టి కలంచినట్లు దురపిల్లెడు దైత్యుల నూఁచముట్టుగాఁ
గొట్టినశౌర్యధుర్యునకుఁ గోసలరాజతనూజనెయ్యపుం
బట్టికి రామభద్రునకుఁ బైపయిఁజేకురుగాక భద్రముల్. 55

సీ. దండకావనజన స్థానముల దేవాఁడు
ఖరదూషణాది రాక్షసులఁదునిమె
నెలయించుకొనిపోవ నెవ్వాఁడుపోనీక
తటిమిమారీచు మస్తకముఁద్రుంచె
నగములుపఱపించి నడవఁగాజలరాశిఁ
గట్టించెనెవ్వాఁడు కపులచేతఁ
గలనరావణ కుంభకర్ణాదులవధించి
కాచెనెవ్వాఁడు లోకత్రియంబు
తే. సవిభీషణనై ర నిర్యాతనుండు
రామచంద్రుఁడు శరణార్థరక్షకుండు
ప్రజలువొగడ నాచంద్రతారకముగాన
యోధ్యసుఖలీలఁ బాలించుచుండుఁగాత 56
మ. అనుచుంజానకి కొంతదవ్వరిగి యాహ్లాదంబు రెట్టింపఁగాఁ
గనియెన్ సప్తశతప్రవాహముఖజాగ్రత్తీరభూజాతపు
ష్పనవామోదసుగంధిశంబరధరప్రాజ్ఞీరధిన్ లోకపా
వనభాగీరథిఁ జక్రపత్రిజమరుద్వాచాలవీచీరథిన్. 57
క. కనిమ్రొక్కి వకులతిలకా
మ్రనమేరుప్రియక మేనురంబై సదరిన్
జనకతనూజ సుమిత్రా
తనయుఁడు మునుగా రథావతరణము చేసెన్. 58
క. కువలయమనోజ్ఞయును స
త్కవిసేవితయును సుధాప్రకాశయునై రా
ఘవుకీర్తిఁ బోలుజాహ్నవి
నవనిజగనిథన్య నైతిపనే కొనియాడెన్. 59
క. ఇరువురుఁ పుసు సనావిక
తరిఁ వలికినాఁటి యూరుదఘ్నజలాభ్యం

తరమునఁగుస్త్రింకిడి రుచిరాం
బరములుధరియించి విపినమార్గోన్ముఖులై. 60

క. కంఠీరవముఖవివరా
కుంఠకఠోరారవాతిఘూర్ణితసహితో
త్కంఠేభదహనమహాదుప
కంఠమువై దేహి తటిసికళవళ పడుచున్. 61

ఉ. సంకటవంశదంశకటుఝుంకృతులున్ నిబిరీసఝిల్లికా
ఝంకృతులుం బ్రచండమదసింధురఘీంకృతులున్ మృగద్విష
ద్ఘాంకృతులున్ జనశ్రుతిపదంబులు వ్రక్కలుసేయ వేల్పితా
తంకని వేశదీనలపితంబుల లక్ష్మణుతోడనిట్లనున్. 62

సీ. ప్రాచీననీరాసారణ్యంబు గానియో
గ్యతపోవనశ్రేణిగానరాదు
వికటోగ్రఖరకంటకకుఘంగములుగాని
కర్మందిమఠవాటి గానరాదు
నెగయుదావాగ్ని క్రొంబొగపెల్లుగాని యు
ద్గతహోమధూమంబు గానరాదు
శరభగండకసింహ శార్దూలములుగాని
మౌనిరాట్సంతతి గానరాదు

తే. కఠినపాషాణదుర్ఘర్ష కాపథంబు
గానినడయాడు మార్గంబుగానరాదు
దాశరథిఁబాసినట్టిదుస్తరపుఁబాప
కర్మురాలికిఁబవియేల గానవచ్చు 63

లక్ష్మణుఁడు సీతకు రామాజ్ఞ నెఱింగించుట.

మ. అనిసంతాపము నొందుసీతఁగని ధైర్యంబేదిసౌమిత్రివా
ల్చిననెమ్మోముపున బాష్పముల్ దొరఁగఁదల్లి నేఁడులోకాపవా

దనిమిత్తంబున రాఘవుండునినుఁగాంతారంబులోడించిర
మ్మనియత్యంతకృపావిహీనుఁ డగునన్నుంపెక్ యథార్థంబనక్. 64

క. ఆతీవ్రభాషణము విని
సీతాతన్వంగి సొమ్మసిలి వ్రాలెధరి
త్రీతలముమీఁద ఝంఝూ
వాతాహతిఁ బడినపుష్పవల్లికఁ బోలెక్. 65

క. అపుడు సుమిత్రాతనయుఁడు
విపులాసుతఁ జూచిమిగుల వెఱచినిజభుజా
గ్రపటాంచలమున విసరుచు
నుపచారముసేయఁ దెలివినొందకయున్నన్. 66

క. ఏనెపుడు రాఘవునిసే
వానిరతుడనై తినేని వసుధాసుత స
ప్రాణయయిబ్రతుకుఁ గాకనఁ
గానలమినమూర్ఛదేఱి కనుఁగొనిభీతిన్. 67

తే. ఎలుఁగు రాలుపడఁగ నిట్లనుఁబదునాలు
గేండ్లురాఘవుండు నీవునన్న
రణ్యభూమిలందు రక్షించినేఁడు
కారడవినెట్టులొంటివిడిచెదన్న. 68

◆ సీతతనదురవస్థ లక్ష్మణునితోఁజెప్పి శోకించుట. ◆

చ. మఱఁదులలోన నెన్నఁగలమాన్యుఁడ వావనదండకోర్విఁ బ
ర్ణెలుఁగులఁబర్ణశాలలను దియ్యనిపండుల నేర్చివెట్టుటల్
మఱచినదాననే యకట లక్ష్మణయీయెడ నప్రసిద్ధికిక్
బిఱుకులుగాని భానుజవిభీషణు లుండఁగనీకు నర్హమే. 69

క. పోరానికర్మబంధము
కోరియైచుట్టు ముట్టుకొనెఁ గాకిపుఁడుం

గారణములేక రాఘవుఁ
డారణ్యక్షోణిఁ బాఱనడచునె తన్నున్. 70

సీ. విపులబాహాశక్తి విఱిచెఁ బురారికో
దండంబు నానిమిత్తంబకాదె
చలపట్టిదైతేయశాంబరీమృగమును
స్త్రముఁ ద్రుంచెనానిమిత్తంబకాదె
పాథోధిగిరులచే బంధించికపిసేన
దాఁటించె నానిమిత్తంబకాదె
కదనరంగమున జగద్ద్రోహిఁ బంక్తికం
ధరుఁగూల్చె నానిమిత్తంబకాదె

తే. యట్టిరాముఁడు తావనన్నడవిలోన
డించిరమ్మనినన్నుఁ బుత్తెంచెనట్ల
తీర్చితివినీవు నన్నుపత్రిజ్ఞ నెఱయఁ
బొమ్ముతమ్ముఁడ సాకేతపురమునకును. 71

ఉ. దీక్షితుఁడై నకౌశికుఁడు దేరఁగనాఁడు వివాహవేళనా
లక్షితకాకపక్షసమలంకృతముల్ నవరత్నకుండల
ప్రేక్షితమున్ సుధాకిరణబింబనిభంబు విశాలపుండరీ
కాక్షమునైనరామునిముఖాంబుజ మెన్నఁడుఁబాయదాత్మలోన్.

క. ననుఁ బాసి విరహతాపముఁ
గొని తీఁగలఁ గౌఁగిలించుకొనె నఁట నేఁ డ
వ్వనవల్లులలోనన న
న్ను నునిచెనఁట రాముఁ డేమనుదు దైవంబున్. 73

తే. అత్తలకుఁ గేలు మోడ్చితి ననపరాధ
పూర్ణగర్భిణి యని మనంబున గణింప
కడవిఁ ద్రోయించెనురాముఁడనుముచనుము
వత్సనిర్విఘ్నమగుఁగాక వర్త్మమనిన. 74

క. కనుమలె పుణ్యాశ్రమములు
నిను రక్షింపుదురు ధారుణియు జాహ్నవియున్
వనదేవతాసమూహము
నని యూఱడఁ బల్కి డెంద మలమటఁ బొందన్. 75

చ. వలగొని భక్తితో నెరఁగి వంచినమోమున బాష్పపూరముల్
దలముగ రామునాజ్ఞ కుఁ గలఁగుచుఁ బోవ మహీజ లక్ష్మణుం
బలవుచుఁ జూచు చుండెఁ బశుపాలకుఁ డుద్ధతిఁ గొంచుబోవఁ బె
ద్దలుగునఁ జిక్కి హోమగవి తర్ణకముం బొరిఁ జూచు కైవడిన్. 76

ఉ. తేరు హుటాహుటిం గదలి దృష్టి కగోచరమై యయోధ్యకున్
జేర నరణ్యరోదనము చేయుచు నమ్మిథిలేశుపుత్త్రి మూ
ర్ఛారభసంబునన్ ధరణి వ్రాలె మృగావలితో నుపాంతకా
సారవిహంగముల్ తదుపచారవిధుల్ ప్రకటించుచుండఁగన్. 77

ఉ. ఆకడకున్ యదృచ్ఛనిగమాగమశాస్త్రకథారహస్యశి
క్షాకృతకృత్యశిష్యపరిషత్పరివేష్టితుఁడై మెలంగువా
ల్మీకి మఖక్రియార్థము సమిత్కుశమూపకలాపఖండన
స్వీకృతి నేగుదెంచి పృథివీసుతఁ గాంచి కృపాసమగ్రతన్. 78

తే. అబల యేడ్చినయ ట్లయ్యె నడవిలోన
నేకతం బిట్లు శోకింప నేకతంబొ
యనిన నమ్మౌనిసాధువాక్యము నిదాఘ
తప్తకేకిని కబ్దశబ్దమును బోలె. 79

ఉ. ఉల్లము చల్లఁ జేసినఁ గృశోదరి తెప్పిరి వీడియున్నధ
మ్మిల్లము జక్క దోఁపుకొని మెల్లన యే మిథిలేశుపుత్త్రికన్
వల్లభుఁడై సరాముఁ డపవాదభయంబున గోహటించి నా
కల్లనిజంబుఁ జిత్తమునఁ గానక కానలఁ ద్రోచె నీగతిన్. 80

వాల్మీకియాశ్రమంబున సీత కుశలవులం గనుట

ఉ. క్రొంచెశ యీశరీరమునకుం దెగఁ జూచిన భ్రూణహత్య సి
ద్ధించు నిజంబు గావున మదిం గడుసాహసకర్మముల్ విస
ర్జించితి నాపురాకృతవిశేషమునన్ నినుఁ గంటిఁ గావవే
యంచు మహీజ మౌని చరణాంబురుహంబులమీఁద వ్రాలినన్.

మ. వగలం దూలఁగ నేల సాధ్వి విను మే వాల్మీకి బితండ్రికిన్
మిగులం బూజ్యుఁడనై చరింతు నెవుడున్ నేఁ డెల్లిటన్ శౌర్యపా
రగులం బుత్త్రుల నిద్దఱం గనెదు గర్భక్షోభముల్ చేయు నీ
తెగువల్ సేయఁ దలంతురే యని ధరిత్రీపుత్త్రి నూరార్చుచున్.

క. జననీ లెమ్మని వాల్మీ
కి నిజాశ్రమమునకు జానకిం దోడ్కొనిపో
యి నిజోటజాంతరంబున
కనిచి తపస్వినుల నరయుఁ డని నియమింపన్. 83

క. మునిభామ లవ్వధూమణి
ననవరత ప్రసవఫలసమాకీర్ణనివా
తనివేశవివృతకృష్ణా
జినముపయిన్ విశ్రమింపఁ జేసి యడలుతోన్. 84

సీ. కాఁడినవిషకంటకములు మెల్లనఁ బుచ్చి
తను పెచ్చుపాదపద్మములు గాఁచి
కలఁదు లేదనుపాటి గారనూనె యొకింత
పరికించి తలచిక్కుఁ బాపి ముడిచి
తఱచుగాఁ జెక్కుటద్దములనోడిక లైన
కన్నీరు దుడిచి మొగంబుఁ గడిగి
పొరలాడఁ బెంధూళి బ్రుంగినవలు వ్రాడ్చి
పలుచనినూత్నవల్కలముఁ గట్టి

తే. పూఁటపూఁటకు నుపచారములు ఘటింప
మునివతంసంబు వాల్మీకి యనుదినంబుఁ
గథలకారణమునఁ బ్రొద్దు గడప సతికి
నెలలు దొమ్మిది పరిపాటి నిండుటయును. 85

క. మిహిరునిఁగూడక పుణ్య
గ్రహమ్ము లయి దుచ్చకేంద్ర గములై వెలుఁగన్
విహితశుభలగ్నమున న
మ్మహిపుత్త్రిక గనియెఁ వరకుమారద్వయమున్. 86

క. దెసలు ప్రసన్నము లయ్యెను
ముసురుకొనియెఁ బుష్పవృష్టి మురజధ్వని పె
ల్లెసఁగె దివి శుభానిలము లో
లసె నహ్ని ప్రదక్షిణార్చులం గనుపట్టెన్. 87

క. పుత్త్రివతి వైతి వని భూ
పుత్త్రిక నగ్గించి నేరుపునఁ బ్రసవవిధుల్
చిత్రించి మునికి మానిక
ఛత్రము లెఱిఁగింప వటువులం బనుచుటయున్. 88

క. అప్పకుమారులఁ గనె నని
చెప్పిన వాల్మీకి వచ్చి సీతాసుతులం
గప్పరపడి చూచి మనం
బుప్పొంగి పురస్కృతాగ్నిహోత్రుం డగుచున్. 89

క. అర్చిష్మదర్కసన్నిభ
వర్చస్కులఁ గవలఁ గుశలవప్రకరములం
గూర్చి తగ జాతకర్మముఁ
దీర్చి వరుసఁ గుశలవాభిధేయులఁ జేసెన్. 90

శా. నిష్ఠ న్వారికి నబ్దముల్ వరుసఁ బండ్రెం డేఁగ వాచంయమ
శ్రేష్ఠుం డయ్యలి జాతకర్మము న మౌంజీబంధ మున్ జేసి వా

సిష్టాగ్నీ యహావిగ్రవిం దలఁప వచ్చె నవ్వచ్చి తద్వాసనే
దిష్టాత్మలోనిఁ జతుర్విధాన్నములు నుత్కృష్టంబుగా నించినన్. 91

మ. కలమాన్నంబును నొల్చుఁబప్పు ఘృతమున్ గజ్జంబులుం బిండివం
టలుఁ బాసెంబులు నానవాలు ఫలముల్ నానావిధవ్యంజనా
వలులున్ రాజతపాత్రలన్ మునిసతుల్ వడ్డింప వాల్మీకి బం
తులు సాగింపఁగ నారగించిరి మునీంద్రుల్ షడ్రసోపేతముల్ 92

క. పేర్పున భుజించి సుఖసం
తర్పణు లగుమానులకు ముదం బలరించెం
గర్పూరఖండతాంబూ,
లార్పణములఁ బారితోషికాదులవలనన్. 93

క. ఉదితారుణసితకిరణా,
భ్యుదయులఁ గుశలవుల నత్తపోధనుఁ డంతన్
జదివింపఁ సర్థితోడుతఁ
జదివిరి నానాపురాణశాస్త్రాగమముల్. 94

క. ధీశక్తి నస్త్రవిద్యా,
కౌశలులై మౌని నేర్పఁగా నేరిచి ర
ద్దాశరథిసుతులు బహువిధ,
వ్యాశుగసంధానమోక్షణాకర్షణముల్. 95

తే. మౌనిజల్పిత మైనరామాయణంబు
స్వరలయగ్రామమూర్ఛల సంచుఁ దెలిసి
పాడిరాలాపములఁ దిరిసప్తకము మెఱసి
కుశుఁడు వీణెయుఁ దాళంబుఁ గొని లవుండు. 96

క. అడవుల మౌనికుమారులఁ
బడిఁ జని ఫలమూలముల సపర్యలు సేయన్
గొడుకులఁ జూచి మనంబున,
నుడు కించుక దీఱి యుండె నుర్వీసుతయున్. 97

♦శ్రీరాము లశ్వమేధంబుజేయ నారంభించుట.♦

మ. అనఘుం డంతట రాఘవుండు జను లాహ్లాదంబునం బ్రస్తుతిం
పన నయోధ్యాపుర మేలుచుండి మదిననప్పౌలస్త్యసంహారజా
తనికృష్టం బగు బ్రహ్మహత్య బలవత్తం బైనఁ దద్దోషపం
కనిదాఘంబు తురంగమేధ మని కాంక్షం జేయ నూహించుచున్

క. తలపోసి తపతి యను భూఁ
తలపతి హయమేధసప్తతంతువు నిష్ఠన్
జలిపి తనబ్రహ్మహత్యా,
కలుష మడఁచుకొని ప్రశస్తిఁ గనఁడే యనుచున్. 99

ఆ. అనుజహితపురోహితామాత్యరాజలో
కమ్ముగొలువ నోలగమున నుండి
యావసిష్ఠవామదేవగాలవగాధి,
సుతులఁ జూచి పలికె నతులఫణితి. 100

క. హయమేధ మఖలపాప ,
క్షయ మని నిగమములు చెప్పఁ గావున నాకుం
బ్రియ మొదవఁ జేయ నయ్యా,
జ్ఞ యవిధు లెఱిఁగింపు డన వసిష్ఠుం డనియెన్. 101

సీ. జననాథ బహుదుఃఖసాధ్య మీయశ్వమే
ధంబు తత్క్రతువిధానంబు వినుము
గోక్షీరతనువుఁ గుంకుమశిరోధియుఁ బీత
వాలంబు నసితశ్రవంబు నైన
వీతి నర్వ్వన చేవి విడిచి తదరిక్షకై
యతిశౌర్యధనులఁ దోడనుపవలయు
వేవు రుత్తమకులద్విజులు ఋత్విజులు గా
వలయు వేర్వేఱ వారలకు నొక్క

తే. గజము నరదంబు భటచతుష్కముతు బూజ్య
గోశతంబును నన్నియఘోటకములు
వేయిబారువు లర్ధంబు విశదమౌక్తి
కములు నల్లుము వలయు దానముగ నొసఁగ. 102

క. మహి నసిపత్త్రిం బీవ్రిత
మహిమాంశుకులేంద్రి దీని కరయుఁగ భార్యా
సహితుఁడు గావలెఁ బత్నీ
రహితునకు నుపక్రమింప రాదని పలుకన్. 103

తే. జాతరూపంబుచే మహీజాతయాప
మమరఁ గావించి చేయుదు యాగ మనుచు
మునివరేణ్యునిసమ్ముఖుంబునకు నవన
హయముఁ దెప్పించె విభుఁడులాయమున వెదకి. 104

క. వరలక్షణశోభిత మగు
తురగముఁ గని మౌని విస్మితుం డయి మాల్యా
భరణాదులతో వేవురు
ధరామరుల కవుడు విహితదక్షిణ లొసగెన్. 105

ఉ. నేమముతోడ హాటకవినిర్మితభూమిసుతాసమేతుఁడై
రాముఁడు దీక్షఁ గైకొని విరాజితచామరరత్నకింకిణీ
దామవిచిత్రమాల్యపరిధానకురంగమదాక్షతాదులన్
దా మఖవాజి నాగమవిధానసమర్చన మాచరించుచున్. 106

క. మిత్రకులాగ్రణి దివిజ
స్తోత్రపరాక్రముఁడు వీరసూః కౌసల్యా
పుత్రుఁడు రఘుపతి విడిచిన
సత్రిహయముఁ బట్టుఁ డుర్వి సాహసు లున్నన్. 107

క. అంచు లిఖించినమణిమయ
కాంచనపట్టంబు హాటకంబునొసలఁ గీ

లించి బహువాద్యరవములు,
ముంచుకొనఁ బ్రదక్షిణించి మ్రొక్కినవేళన్. 108
మ. శతమన్యుప్రతిమానవైభవముతో శత్రుఘ్నుఁ డక్షౌహిణీ
త్రితయానీకముతో రఘూద్వహుని కర్థిన్ మ్రొక్కినన్ గారవిం
చి తనం గౌఁగిటఁ జేర్చి యాహయము నీచే రక్షణీయంబు ది
క్పతిసందోహముతోడుగా హరిహరబ్రహ్మల్విరోధించినన్. 109
క. అని వీడ్కొలిపిన నన్నఁడుఁ,
బునఃప్రణామంబు చేసి పోయెను వేడ్కన్
ఘనవాద్యనినాదంబులు,
వినువీథిం బఱచె దిశలు వీడ్వడిమ్రోయన్. 110
మ. క్రతుఘోటంబు సమస్తభూములు నిరాఘాటంబుగం జొచ్చి మా
రుతవేగంబునఁ బోవఁ గొందఱు నరేంద్రుల్ డాసి తత్ఫాలసం
స్థితజాంబూనదపత్రికా లిఖితసందేశంబు వీక్షించి యా
నతులై కొల్వఁగ వామలూరుజునరణ్యానిం బ్రవేశించినన్. 111
క. ఆకాలమున మఖార్థము,
నాకుభవుఁడు వరుణపురమునకుఁ జన ధృతస
జ్యీకృతకార్ముకుఁడై లవుఁ,
డాకానన మరయ నత్యయము లేకుండన్. 112
ఉ. అమహనీయపావనవనాంతిక నాకసరిత్తటీశుక
శ్యామలకోమలాగ్రియవసస్తబకాభిరతిన్ జనన్ వటు
స్తోమము చూపఁగా లవుఁడు చూచి తదీయలలాటపట్టికా
హైమనవీనపత్రిబిరుదాక్షర పంక్తిఁ బఠించె నర్థితోన్. 113
క. మిత్రకులాగ్రణి దివిజ
స్తోత్రపరాక్రముఁడు వీరసూఃకౌసల్యా
పుత్త్రుఁడు రఘుపతి విడిచిన
సత్త్రిహయముఁ బట్టుఁ డుర్విసాహసు లున్నన్. 114

జునికోదండము రెండుగా నఱికి వక్షోభాగముం దూఱఁ జెం
దినమూర్ఛన్ ధర వ్రాలె నిశ్చలునిరీతిన్ రక్తసిక్తాంగుఁడై. 125

క. భేరీశంఖపటహాఢ
క్కారావము లవుడు దిఙ్ముఖాతీతములై
బోరు కలఁగ హతశేషచ
మూరత్నకసింహనాదములు గర్జిల్లన్. 126

మ. తురగంబు న్విడిపించి శౌర్యనిధి శత్రుఘ్నుండు చెంతం గుశా
వరజుం గాంచి యురోవిదారణగరుద్వ్యస్తాశుగక్లేశదు
స్తరసంతాపముఁ దీర్చి రాఘవునిసాక్షాత్కార విజ్ఞానదనుం
డరయం గేలమూర్తి గాఁడనుచు నధ్యాహారముంజేయుచున్. 127

క. ఒడల నసలుఁకొనునెత్తురు
గడిగి రఘూద్వహునిసమ్ముఖము చేయుదు ని
వ్వడుగు నని తనరథముపై
నిడుకొని చనియె న్మఖాశ్వ మేగెడుదెసకున్. 128

ఉ. అక్కడ భూమిపుత్రి లవుఁ డాఁకొనె రాఁ డని శోకవేదనం
బొక్కఁగఁ బాఱుతెంచి మునిపుత్రులు నీసుతుఁ డధ్వరాశ్వమున్
గ్రక్కునఁ బట్టి మార్కొను నరాతిబలంబులఁ ద్రుంచి వారిచేఁ
జిక్కె ధనుర్ధరుం డొకఁడు చేతిశరాసనయష్టిఁ ద్రుంచినన్. 129

క. అని మునితనయులు పల్కిన
ఘనమేఘధ్వనికి నళుకుకన్నియరీతిన్
విని గుండియ పగిలి మహీ
తనయ తనయుఁ దూర్చి బహువిధంబుల నడలెన్. 130

తే. కాననంబునఁ గుశుఁ డంతఁ గందమూల
ఫలసమిత్కుశపత్త్రిపుష్పములు గోయ
నచటఁ దనవామలోచనం బదర బెదరి
సమరజయచిహ్నములుచూచిసంభ్రమించి. 131

సీ. క్రమ్మన మఱిడి తస్కరులచే ధనముఁ
గోల్పోయిన ట్లున్న భూపుత్త్రిఁ గాంచి
యింతశోకముఁ బొంద నేటికి నంబ నే
డెదురుగా లవుఁడు రాఁడెందుఁబోయె
నెఱిఁగింపు మని పల్క నేచోటనుండియోధులఁ
వచ్చునధ్వరసైంధనంబుఁ బట్టి
కదళికాతరువుతోఁ గట్టి మార్కొనువీరయోధులఁ
జెక్కండ్రి నుక్కడంప

తే. ధనువుఁ దెగనేసి యొక్కపాతకుఁడు సుతునిఁ
బట్టుకొనిపోయెనఁట చేటు పాటు దెలియ
రాకఁ బొగిలెద నీవు శాత్రవు జయించి
యనుజు మరలించి నాదుఃఖ మార్పు మనిన. 132

క. శోకంబు మాను విమతా
నీకంబులఁ దుత్రించి తమ్మునిం దెచ్చెదఁ దూ
ణీకార్ముకకాసిచర్మగ
దాకవచము లిమ్ము సమ్మదంబున ననినన్. 133

మూర్ఛితుఁడైన లవునకు కుశుఁడు దోడ్పడుట.

క. కుశులుఁడవై గెలువు నిరం
కుశవృత్తిని రిపుల ననుచుఁ గుంతగదాచ
ర్మశరాసనకవచాదులు
కుశవీరున కొసఁగి వీడుకొలిపిన నతఁడున్. 134

క. తల్లిపదాబ్జములకుఁ బ్రణ
మిల్లి కదలె విలయకాలమేఘ మొనరి గ
ర్జిల్లె నన దిక్కు లదుర్వఁగ
మల్ల చఱచుకొనుచుఁ బటుసమరదోహలియై. 135

మ. తరుశైలంబు లదభ్రియానగతి చేతం జూర్ణముల్ గాగండా
తరము ల్కావిరిచిమ్మచీకటుల నీవ న్వచ్చుచుద్వద్ధను
ర్ధరు నీక్షించి పతాకినుల్ హరికిశోరంబు న్విలోకించుసిం
ధురయూధంబులభంగిఁబొలఁగవిశతుర్ఘుణ్ణంపుసేనానితోన్. 136

◆ కుశునియుద్ధము. ◆

ఉ. పైకొని లోకముల్ చెలఁపఁ బొల్పడివచ్చుయుగాంతకాలరు
ద్రాకృతి నిక్కమారుఁ డనహాయత రా నదె చూడు మాహవో
త్సేకము దక్కె శౌర్యములు చెల్లను గట్టెనుమాడ్కి నీవరా
నీకిను లుద్ధతిం బఱచె నేల పదాహతిఁ దూలి ధూళిగన్. 37

క. ఉఱుమక పిడుగులు పడియెడి
వఱదులు వాపోవఁ జొచ్చె వాహిని కెదురై
యొఱలందు నాయుధంబులు
విఱిగిపడం దొడఁగెఁ బుట్టె విపరీతంబుల్. 138

క. అదిగాక కాకఘూకస
ముదయంబులు రథికమస్తముల వాలెడుఁ బో
వఁ దలఁచిన జయపతాకల
తుదల నిమిత్తంబు లేక ధూమము లెగసెన్. 139

క. నీకార్ముకవిద్యకలిమి
నేకీడును నళినిఁ బొరయనీక రణమునం
జీకాకుపఱుపు మని యు
ర్వ్యాకుత్స్థుఁడు పనుపఁ జుఱుకుగలసేసలతోన్. 140

శా. సేనావాహుఁడు జానకీసుతుని నాజిం దాఁకి నాళీకబా
ణానీకంబుల ముంచినం గుశుఁడుఁ బల్తీవ్రాస్త్రంబులం ద్రుంచి సా
జానేయధ్వజచక్రరక్షకధనుస్స న్నాహపత్రంబుగా
సేనానిం బదహస్తమస్తములు విచ్ఛేదించి మోదించినన్. 141

క. నగుఁ డన్నపాటు గనుఁగొని
దిగిభనిభద్విపము నలుక దీకొలుపుచు బె
ట్టగుశక్తివైవఁ గుశుఁ డర
నగుచుఁ దునిమి దాని మూఁడునారాచములన్. 142

సీ. మఱియు నాగ్రహము డింపక విశంకటకా
ర్ముకంబునఁ జతురంబకములు దొడిగి
దంతావళంబుపాదములునాలుగు నుర్విఁ
దెగ నేయ నది మొగ్గతిలక మున్న
కరి డిగ్గనుఱికి భీకరగదాహస్తుఁడై
కదియ నగ్గదతోన కరము దునుమఁ
సవ్యదోర్దండలిఁ జక్రంబు సంధింప
నది సనాథనముగా నట్ల చేయ

తే. రాహు వర్కునిఁ బట్టు నాగ్రహము దోఁప
మలయునగుఁ జూచి కుశుఁడు జిహ్మగముఁ దొడిగి
కర్పమున కురుండంబుఁ గత్తరింపఁ
బాత్రిముగఁ బూనె నది కాలభైరవుండు. 143

చ. నగుపని పోరిలో నడఁగినన్ రయకాలునిమాడ్కి సేన వెన్
దగిలి గజాశ్వసద్భటరథంబులఁ జిత్రనథం బొనర్ప న
ల్క గదిరి లక్ష్మణానుజుఁ డిలాసుతపట్టి విశాతభీషణా
శుగనిహతిం దెరల్చినఁ గుశుం డతిరోషకషాయితాక్షుఁడై. 144

ఉ. అర్వసమన్వితంబుగ శతాంగముఁ జూర్ణము చేసి యానమ
త్పర్వశరాహతిన్ హృదయతాపమొనర్చుచు నాగ్రుతూపులన్
గర్వ మెలర్పఁ బేరుర మగల్చినఁ గూలె నతండు దేరుపైఁ
బర్వతసానుభూస్ఖలితభద్రిమదద్విరదంబుచాడ్పునన్. 145

◆ శత్రుఘ్నుండు కుశునిచేఁ బడుట. ◆

శా. శత్రుఘ్నుండువడన్ హతాశఁ బఱచెన్ సైన్యంబు దైన్యంబునన్
జైత్రోత్సాహము దక్కి తేజి లవుఁ డచ్చన్ జేరి తత్ప్రేరణన్
సత్రీయాశ్వముఁ బార్శ్వభూజమున నంటం గట్టి జంఝామరు
న్మైత్రిం బొల్చుహతాశులీలఁ గుశుఁడుత్సాహించె సోదర్యుతోన్.

సీ. హతశేషు లపు డయోధ్యాపురంబున కేగి
హయమేధదీక్షితు యజ్ఞవేది
కాసీను మౌనివర్గపరీతు ననుజన్మ
సేవ్యమానుఁ గురంగశృంగహస్తు
సారంగచర్మ వాససుదండమేఖలాధరు
శాతకుంభ సీతాసమేతుఁ
దిలసమిదాజ్యవర్తితహోమధూమావిలార
క్తలలితకర్ణాంతనేత్రు
తే. రామభద్రునిఁ గని సభ్రీణాయు లగుచు
దేవ నీయధ్వరాశ్వ ముద్వృత్తి సకల
దిక్కులను ద్రొక్కసడవిలో నొక్కనటువు
పట్టిబంధించెఁ గదలి శాపాదపమున 147

క. అట్టినటుగపోలిక మీ
యట్టిద శిశు వయ్యుఁ గ్రీతుహయానుగసేనం
గొట్టి తుది నీయనుజుచేఁ
బట్టుబడియె విల్లు విఱిగి బడలినకతనన్. 148

క. శాతాసిచాపధరుఁ డపు
డాతని కొకయాప్తబంధుఁ డరుదెంచి బల
వ్రాతములపై కుటెకి తన
చేతులకసిఁ దీర్చి కూలిచెను శత్రుఘ్నున్. 149

క. అను వారిభాషణంబులు
విని రఘువరుఁ డనియె మీకు వెఱ్ఱితనము ప
ట్టెనొ భూతము సోఁకెనొ నా
యనుజుం డల్లలచిక్కు నహితులచేతన్. 150

క. నావుఁడు దేవా నీపద
సేవకులకు నెందుఁ గీడు చెందునె నిక్కం
బీవిన్నప మన రామ!
క్ష్మావల్లభుఁ డాత్మలోనఁ గళవళపడుచున్. 151

తే. ఎన్నఁడును నాకు నుత్తరం బియ్యఁ డెదుర
లవణు నెక్కటిదునిమె నాలమునఁగినిసి
యట్టి నాతమ్ముఁ డాజిలో నర్భకునకుఁ
జిక్కె నఁట దైవ మిప్డెంతచేసె ననుచు. 152

## రాముఁడు సౌమిత్రిని యుద్ధమున కనుపుట.

ఉ. లక్ష్మణుఁ జూచి భాస్కరకులప్రవరుం డనియె న్ముహుర్ముహుః
పక్ష్మగబాష్పరోధికరపల్లవుఁడై యిపు డధ్వరక్రియా
లక్ష్మము దాల్చినాఁడ దెరలంజన దీవు హతానుజన్మ జ
న్యక్ష్మనిరుద్ధవాహయమళార్భక జేతవు గమ్ము పొమ్మనన్. 153

సీ. నగరాజములకు నానగరాజసముఁ జూపు
కటుతరాష్టమదాంధగంధకరులు
పవమానగతినేరు పవమానపడ దాఁటు
ధాటీచరాఘూటఘోటకములు
శరదభ్రవిభవమాశరదభ్రమును జేయు
రథికసారథిమనోరథరథములు
హరికిశోరముఁ గోహరికిశోషిలనిదు
ర్వారగర్వాటోపవీరభటులుఁ

తే. గ్రిందుకొని సేన నానాముఖముల నడవ
బ్రళయభైరవహుంకారభయదపటహ
నాదములతోడసమరనన్నాహియగుచుఁ
గదలెసౌమిత్రిరఘుకులాగ్రణికిమ్రొక్కి. 154

క. ఆక్రిందదూర్మిమాలా
తిక్రాంతావధిపయోనిధిప్రతినిధియై
విక్రమరేఖార్భటి భూ
చక్రము గ్రిక్కదలఁ గదలుసైన్యముతోడన్. 155

తే. వచ్చి సౌమిత్రి వాల్మీకివనముఁ జొచ్చి
సృత్రకచభారమేచకాస్త్రణపటమ
హావక్షోణి వీరశయ్యాగ్రసుప్త
ధూళిధూసరగాత్రుశత్రుఘ్నుఁ జూచె. 156

ఉ. అప్పుడు వచ్చునేనఁ గుశుఁ డారసి నిశ్చయతన్ సహోదరుం
దప్పక చూచి పైకొనెఁ బతాకిను లెయ్యది కార్య మిత్తఱిన్
జెప్పుము నా లవుం డిచటఁ జెప్పెడి దేమి విరోధిసేనలం
బిప్పిరి చేసెదన్ సెలవుఁ బెట్టుము నీవుఁ గడంగు మాజికిన్. 157

క. అని లవణాంతకులచే ము
న్ననిఁ దనకార్ముకము భగ్నమయినకతనభ
క్తినియమపురస్సరంబుగ,
నినుగుఱిచి లలాటతటసమేతాంజలియై. 158

తే. సవితమూర్తిత్రయాత్మక సప్తతురగ
చండపూషనతామరజలజమిత్ర
హంసబుగ్వేదరూపమేషాద్యధీశ
ఖపరికాశ హిరణ్మయ కర్మసాక్షి. 159

లయగ్రాహి. భాస్కరభవామయతిరస్కర సమజ్జనయ
శస్కర సహస్రకరమస్కర ధరశ్రే।
యస్కర నభోమణియహస్కర చరచ్ఛరదు
పస్కర సదారుణపురస్కర సదేకా।
పస్కర తమఃపటలతస్కర కిరీటగళి
రస్కరగృహీతనునమస్కర సహాగ్రో।
రస్కర జనీపసవయస్కర విసర్వజగ
దాస్కర భజే యని సమస్కరణుఁ డైనన్. 160

శా. శూరాగ్రేసరుఁ డైనయాలవునకున్ సూర్యుండు ప్రత్యక్షమై
హైరణ్యాద్రివలి స్థల స్థకము రత్నాలంకృతంబున్ సమి
ద్వీరారాతివిదారణక్రమకళావిశ్రాణనాహంకృతి
స్ఫారజ్యారవభైరవంబుననగుచాపం బిచ్చి విచ్చేసినన్. 161

క. గురుఁ డగువాల్మీకిమునీ
శ్వరుఁ డొసఁగినసారమంత్రజపమువలన భా
స్కరుఁ డిచ్చినవిలు గైకొని
యరిగి కుశున కాధనుర్మహత్వముఁ జెప్పెన్. 162

మ. ధరణీజాతతనూజు లత్తఱి సుమిత్రాపుత్రునిం దాఁకిరన్
గరటిస్యందనఘోటవీరభటయుక్తంబైనసైన్యంబు మం
దరమై నాకమహీధరభ్రమణఘూర్ణంబైన పాథోధికిన్
దరమై వ్రేల్మిడి యోజనార్ధబల మంతంబొందె నక్కొల్లలన్. 163

తే. ఆనెగులు చూచి కదిసె సేనాని యైన
కాలజిత్తుండు తాను లక్ష్మణుఁడు కుశుని
నొక్క మొగిఁజుట్టుకొ నెలవు బెక్కువేలు
భ్రములుపరిఘాదిసాధనభ్రములుమెఱయ. 164

క. కరులు పదిపదులు కరి కరి
కరదములు సహస్ర మగద మరదంబునకున్

హరిశతము హరికి హరికిం
బరివారము నూటిసంఖ్య భ్రమి యనఁబరఁగుర్. 165

క. ముంచి బలము లిట్లవరో
ధించిన లవుఁ డంతకాకృతిం గసలుచు గ
ర్జించి పటుపరిహరణహతిం
దుంచె ముహూర్తమున దశచతుష్క-ఖ్రమములన్. 166

మ. కరవాల ద్రుఘణోళికానఖర చక్రప్రాసబాణాసన
చ్ఛురికాపట్టిసకుంతతోమరగదాశూలంబులం బోరి పో
రి రణోర్విం గుశుఁ గాన కాలవుఁడు వర్మీభూతనానాస్త్రజ
ర్జరితాసృగ్ఘురగాతుఁడై నిలిచెఁ బార్శ్వంబు లీక్షించుచున్.

చ. అతనిపరాకు చూచి రుధిరాక్షనిశాటుఁడు తొల్లి రాఘవ
క్షితిపతి లెంకయై శరణు చెందినవాఁడు భయంకరాహవా
యతబలశౌర్యశాలి లవణాసురుమాతులుఁ డేమఱించి తీ
వ్రతఁ గొనిపోయె నాలవకరస్థశరాసన మభ్రవీథికిన్. 168

చ. అపహృతచాపుఁడై లవుఁ డహంకృతిఁ జక్రముఁ గేలఁ బూని చ
క్రిపటిమఁ జూపి దేశికవరేణ్యకృపార్జితమాతరిశ్వమం
త్రపఠనశక్తి నుప్పరము దాఁటి విహంగముఁ బట్టుజాలెడే
గపగిది దైత్యునిం దఱుమగా మది బెగ్గల మంది సైనికుల్.

సీ. గజశరీరములమార్గణరంధ్రముల వెంట
జొరఁ బాఱి దివిఁ దొంగిచూచువారు
భగ్నశతాంగకూబరచక్రములక్రింద
నొదిఁగి చప్పుడు సేయ కుండువారు
హయకబంధములఁ బాయఁగఁద్రోచి యెడరైన
యెడఁ బక్కెరలలోన నీఁగువారు
భటవిగ్రహములకుప్పలకేలవఁ దలలపై
హరిగలు మాటుగా నడఁగువారు

తే. నై రణస్థలి నీతఁ డెవ్వారిమీఁది
కొఱగునో యని మది వెఱచఱచి ప్రాణ
రక్షణోపాయపరత నస్త్రములు విడచి
కళవళించిరి శౌర్యంబు గట్టిపెట్టి. 170

తే. అంత దశరథమంత్రిసుమంతసుతులు
సాహసులు పదుగురు సింహ చంద్రకాల
ధార్మిక మదన శత్రుసూదక జితశ్రి
మామల శరస్నద సుకేతు లాగ్రహించి. 171

క. ఉదితజ్యాఘోషంబులు
చద లందుకొనంగ నార్చి సమసయయమునన్
బదిపదిశరముల నేసిరి
చిద్రపలుగా లవునిచేతిశితచక్రంబున్. 172

క. ఆచక్రము హతమైన ని
లాచక్రముమీఁది కుఱికి లవుఁడు లవుడీ బా
హాచాటులవిభ్రమభ్రమ
రీచండిమరేఖ సంతరించుచు విసరన్. 173

క. అశనిస్ఫదృక్పరిఘాతన
విశసములఁ గూలి రొక్కవ్రేల్మిడిలోనన్
దశరథమంత్రితనూజులు
దశరథు లత్యంతశౌర్యదశరథు లాజిన్. 174

ఉ. అంత మదోద్ధతుండు రుధిరాక్షుఁడు క్రమ్మఱఁ బాఱుతెంచి దు
ర్దాంతగదాహతిన్ లవుశిరంబుఁ బగిల్చినఁ గ్రమ్మ నెత్తుటన్
గొంతవిసంజ్ఞుఁడై తెలిసి కుంతముఁ ద్రిప్పుచు నార్చి దానవుం
గొంతుక ద్రుంచి కైకొనియె గొంకక తన్ముషితార్క్షచాపమున్.

క. దైతేయు నిట్లు గెడపిన
సైతేయునిఁ జుట్టుముట్టి సైన్యము గవిసెన్.

మాతృజఠరభరసదో

జాతార్భకుఁ బొదువుమోహజాలములీలన్. 176

చ. అడఁగినచండ్రనిప్పు నికటార్జునముం దెగటార్చి పేర్చి కా
ఱడవి దహించుమాడ్కి లవుఁ డంటినేలఁ బెక్కుభంగులన్
బొడఁ వడఁగించి ముండి బలుమూఁకల వెంపర లాడుచుండె న
ప్పు డెదిరె లక్ష్మణుం గుశుఁడపూర్వమృగేంద్రతరాక్రమోన్నతిన్

ఉ. శూరత నిల్పిదిర్చి వకుశుం గని లక్ష్మణుఁ డై దుతూపులన్
బేరురవుం బగిల్చిన సమీరశరం బరిఁ బోయుచున్ సమి
ద్ధీరుఁడ వైన నిల్వు మని తెల్పు మ నేయ ముహూర్తమాత్ర మ
త్తేరు కులాలచక్రముగతిం దిరిగెన్ గడువిస్మయంబుగన్. 178

క. అరదము బిరబిరఁ దిరిగెను,
భరమున రథ్యములు నాల్గుఁ బంచత్వము నొం
ద రణకుతూహలమున నొం
డురథ మ్మపు డెక్కి లక్ష్మణుండు కట్టలుకన్. 179

క. క్రమమునఁ గిరీటమును గవ
చము నైదస్త్రములఁ దునుము సంహృతనిర్మో
కమహాహిలీల విగత
క్లముఁడై కుశుఁ డనియె నగుచుఁ గారుత్ స్థునితోన్ 180

తే. మోపుచేటుగ నున్న యీముకుటకవచ
భార ముడిపినపరమోపకారి వగుట
నేను బ్రత్యుపకారినై యిపుడ తీర్తు
బాణపంక్తుల నీసైన్యభారమనుచు. 181

శా. ఆగ్నేయాస్త్ర మధర్వమంత్రమున నేయం దన్మహార్చిశ్ఛటా
భగ్నంబై నెటి మూఁకసైన్యముఁ బరిభ్రష్టాశ్వముం జేతనా
ముగ్నాగప్రకరంబుఁ జూర్ణితరథంబున్ దగ్ధపాదాతమున్
ద్రాగ్నిర్మూలితచామరాభరణతూర్యచ్ఛత్రశస్త్రంబుఁగన్ 182

క. ఆరణమున నిటు శిఖిశర,
దారుణశిఖలాక్రమింప దాశరథి కన
ద్వారుణమార్గణమున నప
వారణ మొనరింపఁ గుశుఁడు వారనికినుకన్. 183

శా. వాయవ్యాస్త్రము వింటఁ గూర్చి విమతవ్యాపాదనైదగ్ధమై
నేయం దచ్చటులాశుగప్రభవబంహిష్ఠభ్రమీధూతవా
త్యాయాత్రోత్థితసైన్య మాకసము డాయంబోయె నాయోధన
శ్రీయోషిన్మణిమండపంబునకు మాంజిష్ఠంపు మేల్కట్టనన్.

క. సేనదురవస్థ గని యా
సేనాధీశ్వరుఁడు కాలజిత్తు కుశు నురం
బానతపర్వశరాహతి
చేనటంగ నేసి పలికె సెలవుల నగుచున్ 185

క. నాలా గెఱుఁగవు బాలుఁడ
వాలము నీకేల తొలఁగు మనఁ గుశుఁ డలుకన్
వాలికతూపునఁ బేరెదను
వాలికఁ ద్రెంచెన్ గ్రశరము సం దలఁ దుత్రించెన్. 186

ఆ. కాలజిత్తు కలన వ్రాలిన సౌమిత్రి
కనలి బహువిధాశుగములఁ జక్ర
శూలముసలభిండివాలఖడ్గాదిప్రి
హారణముల నిగుడ్చ వరుసఁ దునిమి. 187

సమరంబున లక్ష్మణుడు నిహతుం డగుట.

చ. హితమతి వాయులూరుభవుఁ డిచ్చిననిశ్వసదుగ్రపన్నగ
ప్రతిభటతేజిత ప్రదరపంచక మార్పుచు నేయ నుద్గతా
ప్రతిహతకీల లాకసముఁ బ్రాక నురస్థలి గాడిసన్ రణ
క్షితిఁ బడె లక్ష్మణుం డనవశిష్ట రుగ స్తమితార్కుఁ డోయనన్,

చ. దురమున లక్ష్మణుండు నిహతుం డగుటన్ గుశుఁ డచ్చలంబునన్
హరిగయు వాలుఁ గైకొని కులాద్రుల నింద్రుఁడు వజ్రధారచేఁ
బొరిగొనుమాడ్కి నగ్రమునఁ బోరెడుతమ్మునిఁ గ్రమ్మకొన్నసిం
ధురములఁ గూల్చనిద్దఱు నెదుర్పడి త్రుంచిరి సైన్యమంతయున్.

క. పట్టినచలమున నీగతి
మట్టముగా నేఁ బిలుకుమార్క్రు కదలిరా
నెట్టికసీలలు మదిఁబోఁ
బుట్టినహర్షమునఁ దమతపోవనమునకున్. 190

సీ. కాకుత్స్థుఁ డపుడు గంగాపుణ్యవాహినీ
తీరయజ్ఞవితద్దీక్ష పూని
యతులతో నగ్వాస నాసీనుఁడై భర
తునిదిక్కుఁ జూచి శత్రుఘ్ను నాజిఁ
గూల్చ నహాయ చోరకులఁ ద్రుంచిరా కేల
తెడసెనా కో సుమిత్రాసుతుండు
కలనైన నెదిరింపఁ దలఁపముల్లోకంబు
విరసించియే శూరుఁ డౌరయనతని

తే. జీవితేచ్ఛ లశరణుఁ జొచ్చిరో కోమాస్ఫు
లేక చలమునఁ బోరి తెళ్ళిరో ధరిత్రి
గాక వారలతల్లి శోకమున మిగులఁ
బొగలుచును వేఁడుకొనెమొనో పుత్త్రభిక్ష. 191

ఉ. జన్మము పక్రమింప దివసత్రయమాత్రను ధూర్త బాలకుల్
సన్నవిభీషణాదులఁ దలంపక లక్ష్మణుబాహువీర్యమున్
సన్నముగా గణించి రవిచారతఁ దమ్ముఁడ వేగబుద్ధిసం
పన్నులఁ బంపు మచ్చటికి ప్రమం బఖిలంబు నెఱింగి రాఁగగున్. 192

క. నావుడు భరతుండేవుర
లావు వెరవుగలుదూతలను వెసరామ

ఘోరవరుసమ్ముఖమునకున్
రావించిన వారికాధరావరుఁ డనియెన్. 193

మ. కొమరుల్ మిక్కిలి సాపరాధులయినన్ క్రోధాతిరేకంబునన్
సమరక్షోణివధింపఁజూడక దయన్ సమ్మోహనాస్త్రప్రయో
గమునన్ వారలఁ బట్టితెండిటకు నాకారంబులస్మన్నరూ
పములంచున్ బలుమాఱు వేగరులు చెప్ప న్వింటినిక్కంబుగన్ 194

ఆ. అదియుఁగాక సీతయాస్యలక్షణముల
క్కవలమొగములందుఁ గలవొ తెలిసి
యడవినేలతిరుగ నంబపేర్దిసా
మిత్రిసముగుఁ డనెడుమాత్రలోన. 195

శ్రీరాముఁడు లక్ష్మణుంగూర్చి పలవరించుట.

ఉ. క్రిమ్మెశోణితంబు గరగట్టఁగగంటుల వెంటబెట్టుగా
జిమ్మనఁబాఱుతెంచి హతశేషులుదీక్షితుఁ డైనరాముపా
దమ్ములవ్రాసియోరఘువతంస సుమిత్రిసుతుండు నాజిమ
ధ్యమ్మునఁగూలెఁదత్కుశ శరాభిహతిన్ లవణారికైవడిన్. 196

ఉ. వీలకకాలజిత్ప్రముఖవీరులు మున్నరుశాశుగాహతిన్.
గూలిరిరక్తధారలు బుగుల్కొన లక్ష్మణుమోవ్రిలధాతుకు
తిక్కలమునాల్గువంకల నతిత్వరమాణసమీరవర్త్తనో
న్మాలితసంప్రఫుల్ల సుమనోభరకింశుక వాటికైవడిన్. 197

క. ఇచ్చుటికిఁ గుశుఁడవశ్యము
వచ్చునతఁడురాకమున్న వలయునెదురుగా
విచ్చేయనేటియాగము
చిచ్చెగసినవెనుక వశమెచేటనుగ్రిమ్మన్. 198

క. అనుయోధవరులమాటలు
వినిరఘువీరుండు వీఁపువిరిగిపడియెఁగ్రి

మ్మినమూర్ఛ భరతునంతిక
మునఁబడెసుచ్ఛిన్నసాలభూజముఁబోలెన్. 199

ఉ. అప్పుడువిన్ననై భరతుఁ డన్నఁగనుంగొని మేనికుమ్మగాఁ
గప్పిహిమాంబుపూరములు కన్నులబల్మరు నొత్తి వీనులం
గప్పరమూఁదఁగా నెఱయఁగప్పినమూర్ఛ యొకింత దేఱినన్
దెప్పిరిలేచివాఁడిచి విల్వకి ఔట్టులుఁగత్తి యేమ్చుచున్. 200

మ. అనురక్తింబదునాలుగేండ్లడవులం దాహారనిద్రల్ దొఱం
గి ననుఁగాచితి పెక్కుభంగుల సురల్ గీర్తింపనయ్యింద్రజి
త్తునవింద్రుంచితి నిన్నుమాణవకమాత్రుం డెల్లునిగ్గించెరా
యనఁదండ్రీ యనునీవులేనిమఖదీక్షాపేక్ష లింకేలనున్. 201

క. తమ్ములుపడియున్ననమీ
కమ్మనకేఁజనెదఁగార్ముఖమునస్త్రములున్
తమ్ముఁడయుడచేయకనా
కిమ్మనఁగేల్మోగిచి భరతుఁడిట్లనిపలికెన్. 202

సీ. సంగ్రామభీరులై చారులుపఱతెంచి
విన్నవించిరిగాని వినఁబొసంగ
దదిమూర్ఛగాఁబోలు నమ్మహాభుజులకు
మరణమెక్కడిది రామక్షితీశ
లక్ష్మణశత్రుఘ్నులకు సహాయుండనై చని
తేరతురగతస్కరులఁబట్టి
బంధించినీపరితాపము చూపియజ్ఞవా
హమ్ముఁదెచ్చెదనన్ను నంపుమనిన

తే. నధిపుఁడిట్లనునీకుఁ దోడక్కసుతవి
భీషణులుతక్కఁ దక్కినపేరుగలుగు
వృషచరయామినీచరవీరయోధ
వరులుదోకొనిచను షూహనమునకనిన. 203

భరతాదులు యుద్ధంబునకు వెడలుట.

తే. భరతుఁడురఘూద్వహునకు సద్భక్తిమొ్రక్కి
సాసిదూణీరచాపుఁడై యరదమెక్కి
వెడలి సేనలతో జాహ్నవీవిశాల
తటమునను నిల్చి పవమానతనయుబిలిచి 204

క. ముందఱఁజని సౌమిత్రిల
చందమరసిరమ్మనిన వెసం బాణిమరు
న్నందనుఁడు వారిఁగనితన
నందిటఁగొనివచ్చి భరతుసన్నిధిఁబెట్టెన్ 205

తే. పెట్టిసౌమిత్రి కుశుబాణఘట్టనముల
నెంతకదునొచ్చెఁ జూచితేయితఁడునాఁడు
నింద్రజిత్సాయకములచే నింతనొవ్వఁ
డనుచుభరతేశునకుఁ జూపనతఁడుపొగిలి 206

క. శూరాగ్రగణ్యు లగుని
వీవ్వరులశరనిహతిఁ బరిభవించినవారిం
దారకు లనరాదే బ్రం
దారకులో కాని యని రథముపై నిగుడన్. 207

శా. ఆఘోషించుతదుగ్రశంఖపటహోద్యద్ధ్వానముల్ దిక్తట
వ్యాఘూర్ణంబులుగా సహంకృతిఁ గుశుం డాలించి కోదండమౌ
ర్వీఘంటారవముల్ చెలంగ రథసోద్రేకంబునన్ వచ్చువో
నాఘోరాజి దురీశ మన్నటు లినుం డస్తాద్రికిన్ వేచనెన్. 208

క. ప్రాంతవనసీడములను శ
కుంతములు శయించె నిరవుకొనె మృగములు వే
శంతతటకుంజముల భా
స్వంతుఁడు చరమాద్రిఁ గ్రుంకుసమయమునందున్. 209

ద్ధతి వెడలె విభీషణసూ
ర్యతనూజులతోడ నమ్మహారథుఁ డనికిన్. 220

క. చతురంగవాహినీపరి
వృతుఁడై యరుదెంచి కనియె వీతభయుల న
ద్భుతచాపధరుల నాత్మ
ప్రతిబింబములై వెలుంగుబాలురఁ బ్రీతిన్. 221

ఉ. వారలఁ జూచి పల్కె రఘువర్యుఁడు మీకిట జాతకర్మసం
స్కారము లెవ్వరుక్తవిధిఁ జల్పి రొగిన్ ధనురాదిశాస్త్రవి
ద్యారతు లైతి రెవ్వరికతంబున నేగతి యుద్ధచాతురి
న్నేరుచుకొంటి రెవ్వ రవనిం దలిదండ్రులపేరు నావుడున్. 222

తే. పోరి కెదిరించి మాపుట్టుపూర్వములను
దెలియఁ బని యేమి మీకు నీతేటలకును
హయము విడుతుమె యైన మీయంతవార
లడుగఁ జెప్పమి తగవుగాదనికుశుండు.

మ. సరవిం జేకొని జాతకర్మముఖసంస్కారంబులున్ వేదశా
స్త్రరహస్యంబులుఁ గార్ముకాదివివిధాస్త్రప్రౌఢియుం బావని
ర్ఘూణంబై నుతి కెక్కురామకథయున్ రాజేంద్ర వాల్మీకి స
త్కరుణన్ మాకెఱిఁగించెఁ గాంచె మముసీతాదేవియిక్కాననలోన్

క. అనుసప్పుఁడు జానకిఁ జే
రొకనుటయు రాఘవుఁడు మూర్ఛఁ గుంది రథముమీఁ
ద నొఱగి యొక్కముహూర్తం,
బునకుఁ దెలిసి పలికెఁ ధరణిపుత్త్రునితోడన్.

మ. తెలియ జూడుము వీర లెవ్వరన నాదిత్యోద్భవుం డిమ్మహా
త్ములు భావింపఁ బురాణపూరుషునిమూర్తుల్పోలికన్ మీకుమా
రులు సందేహము లేదు సంగరసమర్థుల్ నాఁగ సీతాతనూ
జులకై యత్తఱి నీలుఁ డొక్కవిపులక్షోణీధ్రమున్ వైచినన్. 226

ఉ. తూలగ వార లన్నగము దూపులఁ జూర్ణము చేసె యొక్కఁబ
ల్గోల నురంబు నొంపఁ గుటిలుం డగునీలుఁడు గూలెఁ గూలుచు
న్నీలునిరక్తబిందువులు నీలునిరూపుల దాల్పఁగాఁ గుశుం
డాలములోన నందఱును నన్నిశరంబుల రూపు మాపుచున్. 227

మ. నరదైతేయకపీంద్రసైన్యముల నానాశస్త్రజాలంబులన్
బరిమార్చన్ రఘురాముఁ డగ్రనిహతభ్రాతృవ్యథాక్రోధని
ర్భరుఁడై యక్కుశుమీఁద హాలహలకల్పక్రూరనారాచముల్
పరఁగింపన్ విఫలంబులై యతని నొంపన్ లేక కేడించినన్. 228

తే. అలిగి మఱియును నేయదివ్యాశుగములు
కవలు నాలుగు నాల్గుదున్కలుగఁ జేయఁ
దనతనూజులసమబలత్వమ్ముఁ దెలిసి
రాముఁ డవ్వేళ యుద్ధవిరక్తుఁ డగుచు. 229

శ్రీరాముఁడు మూర్ఛితుఁడగుట.

చ. అదయత నేయునక్కుశునుదగ్రశరాహతిఁ బ్రాణమర్మముల్
వదలి శతాంగయష్టి నొఱవంబడఁ గ్గొని మైథిలేయులే
కొదయును లేక గ్గొని రఘుప్రవరుం బొరలించి కుండలాం
గదమణిహారవల్లికలు గైకొని యుల్లము పల్లవింపఁగన్. 230

క. పడినభరతాదియోధుల
తొడవులుఁ గొని లవుఁడు ముదముతోఁ గనె నొకచోఁ
గడునొచ్చి గుక్కుమిక్కన
కడఁగినభల్లూకనాథు ననిలతనూజున్. 231

క. కనికుశునితోడ దశరథ
తనయులయాదివ్యమణిరథము లెక్కి ముదం
బున మనయాశ్రమమున కి
వ్వనచరులం గొంచుఁ బోవలయుననంగన్. 232

తే. అనిలజుఁడు జాంబవంతుఁ గన్గొనుచునల్ల
పలికెఁగంటివె రాఘవాదులయవస్థ
మనమునఁగ నెంత వనజగర్భునకు నైన
ననుభవింపక చనవుశుభాశుభములు. 233

చ. కిఱుకులఁబెట్టి పీరినడకించి తొలంగుగమన్న వట్టిక
క్కుఱితియకాని దైవమనుకూలము గాదు లవుండు మొక్కలీఁ
డుఱికినఁ బ్రాణహానియును నొప్పమివచ్చునటంచుఁబ్రాణముల్
దొఱఁగినభావముల్లమునఁ దూకొని చేష్టలు దక్కియుండఁగన్. 234

ఉ. చిందములన్నభంబుగరిసించు శతాంగములెక్కిజానకీ
నందనులేగి యాశ్రమమునన్ రథముల్ దిగిపర్ణశాలికా
ళిందముచేరి తెచ్చిన వలీముఖపుంగవజాంబవంతులన్
ముందటఁబెట్టితల్లికిని మ్రొక్కిసమస్తము విన్నవించినన్. 235

సీ. వినియమ్మహీకాంత విస్మయాక్రాంతయై
కదనరంగమున రాఘవునిమీరు
గెలుచుటఁజింకపిల్లలు సింహముజయించు
తెఱఁగుదైవిక మెట్లుతెలియవచ్చు
వనమునఁనజ్ఞాతవాసనై పడియెడు
పాటుమీచేబయల్ పడియెననుచు
లవుఁజూచివరుణసంభవుఁ డిచ్చటికిరాక
మునుపయీజాంబవం తునిసమీర

తే. సూనునభిమానధనువు నచ్చోటసవిడిచి
వేగరమ్మన్న నట్లకావింపఁదద్వి
ధంబునారదువలన నంతయునెఱింగి
వచ్చెవాల్మీకి నిజతపోవనము నకును. 236

తే. వచ్చియమ్మౌని యాశ్రమద్వారసరణి
మూర్తివంతంబులై శోకములుహరింపఁ

గడఁగునస్త్రవేదములకై వడివెలుంగు
నతులతేజులజానకీ సుతులఁగాంచి. 237

మ. తనకున్వందన మాచరించినఁబ్రమోదంబారదీవించిము
ట్టినకయ్యంబు ఘటిల్లమిఁగనని వింటిన్గొంత నాశాస్త్రన
స్త్రనిపాతంబులచేత నొవ్వరుగదా సంగ్రామమే లయ్యెఁ బో
రినచందంబది యెద్దిచెప్పఁడిక తద్వృత్తాంతమాద్యంతమున్. 238

తే. అనినఁగుశవీరుఁ డమ్మునీంద్రునకులవుఁడు
హయముఁబట్టుట సౌమిత్రులంతరించు
టగచరులతోడ భరతుండు తెగుటరామ
విభుఁడునిధనంబగుట విన్నవించుటయును. 239

వాల్మీకి శ్రీరాములను స్తోత్రముఁ జేయుట.

శా. హాహాకారమునన్ మునిప్రవరుఁడభ్యర్ణక్షమాఖండిత
వ్యూహంబత్తఱిఁ జొచ్చిహస్తకరకాయుగ్మంత్ర తోయంబునన్
దేహక్షాళనమాచరింప సుఖసుప్తింజెందిమేల్కాంచిన
ట్లాహైన్యంబు దొలంగిరాఘవుఁడుబాలార్కప్రభన్ బొల్చెనన్ 240

తే. మొరసెసురదిందుభులుగళత్సురభిదుగ్ధ
కుసుమవృష్టులతో నతారొక్కనుచుఁగురియు
నమృతధారాభిషిక్తసర్వాంగనుగుచు
బ్రదికెనరవానరాసుర ప్రబలబలము. 241

మ. ప్రతిసమాగ్రడనుగమ్యమానుఁ డగునవల్మీకజన్ముఁడ్ రఘు
క్షితినాథుండుబహూకరించి యనురక్తిందమ్ములుం దానమ
స్కృతిఁగావించిన నత్తపోధనిఁడు డాశీర్వాదముం జేసి సం
భృతమాధుర్యసుధాపరిస్ఫురిత గంభీరోక్తిమెనిట్లనున్. 242

శా. మృద్ద్వైగుణ్య కుంభకారఘటనో న్మేషనంబునం బోలెఁద
త్తద్వైళందిలకించు నీభువనసందర్భంబు నీచేతరా

గద్వేషాదులునిన్నుఁబొంది నిలువంగా నేర్చునేనీవు సా
క్షాద్విష్ణుండవు సీతలక్ష్మి నిగ మోక్తంబుల్ భవత్కృత్యముల్.

చ. తనయుఁడుచాపలప్రకృతిఁ దప్పి యొకానొకతప్పు చేసినన్
గనికరుణింపఁగా వలయుఁగాని చలంబున నిగ్రహింపఁగాఁ
జనదటులుండె బుత్త్రులనిశంబును జూపెదుశౌర్యతేజముల్
జనకున కెయ్యెడం బరమసౌఖ్యవిశేషముఁ లెన్నిచూచినన్. 244

సీ. చిఱుతప్రాయమున హెచ్చినతాటక
వధించిజమదగ్ని సూనుగర్వముగుదించి
కరదూషణాదులఁ గాలునిలుపురికన్చి
మారీచుచర్మ వర్మములుసించి
యోజనబాహునత్యుగ్రతనధించి
యనిషాధీసునం దనుహరించి
లవణపయోరాశి నవలీలబంధించి
దశకంఠునాస్థలి నడంచి

తే. నట్టిభవదీయచటుల బాహాప్రతీప
విక్రమాటోపమున కంగవించి నిలువఁ
బద్మగర్భాదులకు నీతబంటె యనిన
జెక్కుమీటెన వసవల్చుశిశువు లెమరె. 24

క. పాతాళమునకు వరుణా
హూతుఁడనై యేనుబోవ నుదవృత్తి నప
ఖ్యాతి యిటు సంభవించెను
నీతనయులు నిన్నెఱుంగ నేరనికతనన్. 246

తే. అనినఁ బరితోషమానసుఁ డగుచు రాముఁ
డనఘ మీదర్శనంబైనయపుడ మాకు
నన్నిపనులును సఫలంబు లయ్యెవారిఁ
జూడవలెఁ బిల్వఁబంపుఁ డిచ్చోటికనిన. 247

తే. సంతసమునొంది మునిశిష్యసమితి ననుప
నతులకోదండవల్లకీ హస్తులగుచు
జానకీసుతు లరుదెంచి సమయ మెఱిఁగి
కౌతుకంబున గురుసమక్షమున నిలిచి. 248

క. ఘోరదురితాపహం బగు
శ్రీరామాయణము చదివిరి వివిధ మగునా
నారాగరచనఁ దుంబురు
నారదులన నఖిలజనమనః ప్రమదముగన్. 249

మ. మనువంశాగ్రణి యక్కుమారవరులన్ మన్నించి ప్రేమన్ బునః
పునరాలింగన మాచరించుచుఁ బరిస్ఫోటించు సీతావియో
గనిమిత్తజ్వరదాహముం దొఱఁగి గాద్గద్యంబునన్ హర్షబా
ష్పనిరోధాలసపక్ష్మనేత్రుఁ డగుచున్ సౌమిత్రితో నిట్లనున్. 250

ఉ. ఆననవిభ్రమంబు రుచిరావయవాదిక సౌకుమార్యమున్
జానకి యట్ల దృప్తభుజశౌర్యజిత శ్రమదివ్యబాణసం
ధానసమగ్రశక్తియును దంటతనంబును మద్విధంబ యీ
సూనులయందుఁ దేరకొనఁ జూచితివే యనఁ బల్కె నన్నతోన్.

ఉ. దేవరయానతిన్ వసుమతీసుత నుత్కటగర్భవేదనా
ప్లావభరాలసాంగి నకృపామతి నొంటియుఁ గొంచువచ్చి నా
డీవిపినాటవి న్విడిచి యే మగుడన్ జనుదెంచునప్పు మూ
ర్ఛావివశాత్మయయ్యె ననసంయమి రామునితోడ నిట్లనున్ 252

చ. అట మఖయూపదారుహరణార్థము శిష్యులు నేము జాహ్నవీ
తటమున కేగుదెంచి యెడదవ్వుల నొంటివిలాప మాత్మ సం
కట మొనరింపఁగా వెదకి కంటిమి శోకపరీతయున్ రజః
పటలవివర్ణ కీర్ణకచభారయు నైనవధూలలామమున్. 253

తే. కాంచి నీవెవ్వరేల శోకమునఁ బొందె
దనిన నెఱిఁగించె నాకు నయ్యబల జనక

తనయను రఘూద్వహుండు మద్భర్త నింద్య
నైతిననినన్నుఁ ద్రోయించె నడవిననుచు. 254

క. విని యూరడించి యాశ్రమ
మునకుం గొనిపోయి యుటజమున నుంచి తప
స్వినుల నియమించుటయు వా
రనువుగఁ బోషింపఁ గతిపయదినంబులకున్. 255

తే. కనియె వైదేహి వంశవర్ధనుల వీరి
నాగమోక్తిన జాతకర్మాదివిధులు
సలిపితిమి పుత్త్రిలెడ మేముజనకవిభుఁడు
దశరథుఁడు నీవునొక్క చందంబకాన. 256

చ. చదివిరి వేదముల్ సకలశాస్త్రములుం బఠియించి రాహవో
న్మదరిపువాహినీ విదళనక్రమ దుర్ధరదివ్యబాణసం
పదలఁ బ్రసిద్ధులైరి నరపాలక నీతనయుల్ ప్రసన్నతా
హృదయులు నీదుభాగ్యమున కెయ్యది మేర తలంచి చూడఁగన్.

చ. అనవుడు రాఘవుం డనుమహాత్మ భవత్కృప యెవ్వరందుఁ గ
ల్గిన గణుతింప వారు కృతకృత్యులు నిత్యము నీయనుగ్రహం
బున నభివృద్ధిఁ బొందుమముబోఁట్లను బేర్కొననేల నాఁగ న
మ్మునికనుసన్న నర్భకులు మ్రొక్కి కరంబులు మోడ్చి తండ్రితోన్

క. మోహపరవశుల నూహా
పోహపరిజ్ఞానమూఢబుద్ధుల నాత్మ
ద్రోహుల మముఁ బ్రోవుము వై
దేహీనందనుల నన ముదితహృదయుండై. 259

శ్రీరాములు సోదరపుత్త్రసమేతముగా నయోధ్యాపురంబుఁ జేరుట.

క. కమలాప్తకులీనుఁడు దన
కుమారకులఁ గౌఁగలించుకొని మూర్ధఘ్రా

ణము చేసి యధికవాత్స
ల్యమునను మన్నించి యధ్వరాశ్వముతోడన్ 260

ఉ. దానవమర్త్యవానరపతాకినులిమ్ములఁ గొల్చిరా నయో
ధ్యానగరంబుఁ జొచ్చి రచితాధ్వరమండపవేది నిష్టభృ
త్యానుజపుత్త్రి బాంధవసమన్వితుఁడై కొలువుండి యాత్మవి
ద్యానయశీలు నమ్మునివతంసముఁ గన్గొని రాముఁ డిట్లనున్ 261

తే. వరుణసంభవ నీపుత్త్రి పరమసాధ్వి
లంకలో నాఁడు లోకపాలకు లెఱుంగ
హవ్యవాహన ముఖమునం దైనవిధము
ప్రజలెఱుంగరు మిగుల దూరంబుగాన. 262

క. ఇందలి జనముల కెల్లను
సందేహనివృత్తి యొదవుచందముఁ జేయం
పంపుఁడు మీరు ధరిత్రీ
నందనఁ గొనిరండు పొండనన్ హితబుద్ధిన్. 263

ఉ. ఆరఘురాము వీడ్కొని మహాత్మవరుం డరుదెంచి కాంచెఁ బె
ల్లారటఁ బెట్టు శోకవిరహంబులు రూపగుమాడ్కి నాశ్రమ
ద్వారనివిష్టదృష్టియు వివర్ణయునుం జిరబద్ధవేణికా
భారయుఁ బ్రోచ్ఛలద్గళిత బాష్పవినేత్రయు నైనజానకిన్ 264

సీ. కని పర్ణశాల డగ్గఱఁ జూచి యమ్మహీ
తనయ వాల్మీకిపాదముల కెరఁగి
తనయులు రాకేల తడసిరి పతివియో
గము కాక పుత్త్రశోకంబు నకట
సిద్ధించె నినుసృజించి విరోధులకు బారి
గొఱియలఁ జేసెనో కో విధాత
యని విలాపింప నూరార్చి యేటికి గ్రేఁపు
బాసి గొడ్డావలెను పగిదినడలె

తే. దబల సీవలె దుఃఖార్తులైనవార
లెంత మముదూఱనాడిన నెగ్గుగాదు
సీతనూభవులున్నారు నెయ్యమలరఁ
దండ్రి మన్నింపఁగా నయోధ్యాపురమున. 265

క. కాకుత్స్థకులుఁడు నినుఁ బు
త్త్రీ కొనిరమ్మనియె నరుగుదెమ్మని కడఁకన్
సాకేతనగరమున క
న్నాకుభవుఁడు జనకనందనం దెచ్చుటయున్. 266

మ. సుతభార్యాయుతుఁడై రఘూద్వహుఁడు చక్షుఃప్రీతి సంధిల్లఁ ద
త్క్రతుశేషంబు సమగ్ర దక్షిణలఁ బర్యాప్తంబు గావించి యం
చితరత్నాంబరభూషణావళులఁ బూజించె న్నృపశ్రేణి నా
శ్రితమౌనీంద్రవిశిష్టబాంధవధరిత్రీదేవతాకోటులన్. 267

క. ఏసరవిఁ గుశలవులతో
రాసి దుర మొనర్చె దాశరథి చేసె రణం
బాసరవిన జనమేజయ
వాసవనందనుఁడు బభ్రువాహనుతోడన్. 268

మ. అని సూతుం డను శౌనకాదులకు నిక్లైతిహ్యముం దొల్లిజై
మిని చెప్పెన్ జనమేజయుం డనుగ నిమ్మే నేతదాఖ్యానమున్
వినినన్ వ్రాసి పఠించినన్ జనులకున్ సిద్ధించునశ్రాంతమున్
ధనధాన్యాదికపుత్త్రపౌత్త్ర సుఖనానాభోగభాగ్యోన్నతుల్. 269

క. వెలయఁగ నీకథ విను ధ
న్యులు తక్కినకథలు వినఁగ నొల్లరు మదిఁ గా
కులరొదలు విన రుచించునె
కలకంఠధ్వనులు విన్న కర్ణంబులకున్. 270

మ. కనకాద్రిప్రతిమానధైర్యజగదేకస్తుత్యసౌభాగ్యమో
హనలీలానవపంచబాణనిజబాహాశౌర్యవీరావిరా
జనయోపాయవిహార బోనగిరిచెంచీకొమ్మథారాపురీ
పెనుకొండాద్యఖిలైకదుర్గహరణప్రేంఖత్ప్రతాపోదయా. 271

క. అహితనృపాలమహాంబుధి
బహులహరీవిహారదంఘ్రిభాగ్యాంకసరో
రుహమీనశంఖచక్రని
వహవిశదీభూతచక్రవర్తివిలాసా. 272

తోటకము. బలభిద్విభవాముణిబాలలితాం
చలసంకులకీలితశత్రుసుభృ
త్కులహాధ్వనితర్కవిధాయిఝుళం
ఝుళనాదపదాంగదసవ్యపదా. 273

గద్యము. ఇది భారతీతీర్థ శ్రీకరణకరుణాపాత్రగాదయామాత్యపుత్త్ర
వినయవిద్యాసముద్ర పినవీరభద్రప్రణీతం బైన జైమినిభార
తంబునం దశ్వమేధపర్వంబున షష్ఠాశ్వాసము.





శ్రీ

# జైమినిభారతము



అశ్వమేధపర్వము, సప్తమాశ్వాసము.



శ్రీచికురబంధగంధఫ
లీ చంచద్గంధభరమలిమ్లుచమత వా
చాచణకవికర్ణ సుధా
సేచనసల్లాప నారసింహమహీపా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున కిట్ల
నియె నివ్విధంబున బభ్రువాహనుండు పాండవమధ్యముం దొడరు
సమయంబున. 2

తే. హంసకేతుండు సుతులు గయ్యమునఁబడిన
యపుడు తనుశౌరి మన్నించినట్టితగవు
హృదయమున మాటిమాటికి నెచ్చరింప
నచ్చలంబున బభ్రువాహనునిఁ దాఁకి. 3

మ. బలిమిన్ వేవురు పార్శ్వరక్షకు లెదుర్పన్ దున్మి తూఁటాడి బి
ట్లలుకన్ వానిఁ దెరల్చి తీవ్రతరబాణౌఘంబులన్ దేరు చె
క్కులుగా నేసి తదస్త్రముల్ విఫలముఁ గావించి సంగ్రామదో
హలియై గీటణఁగించె మాఱొ్కనినపంచాక్షౌహిణీసైన్యమున్. 4

వ. అప్పుడు. 5

చ. చలమున నొండుతేరు రభసంబున నెక్కి కిరీటినందనుం
డలమి మరాళకేతను శతాంగము రూపఱ నేయుచున్ శరం

బలు నిగిడించి వానిఁ బెనుమూర్ఛితుఁ జేసి సహస్రమేదినీ
శులఁ గలనన్ సరథ్యరథిసూతముగాఁ దెగటార్చి యార్చినన్. 6

చ. కినుక సువేగుఁ డక్షపడి క్రీడికుమారు నురంబు గాఁడ బా
ణనవక మేసి మూఁడుబలునారసముల్ దొడి గాతపత్రముల్
ధనువుఁ బతాకయుం గెడపి తద్రథయోధనహస్రముల్ బృష
త్కనిహతిఁ గూల్చుచున్ దశశత ప్రదరంబుల ముంచె నాతనిన్.

వ. ఇవ్విధంబున సువేగుండు శరవేగంబు చూపిన. 8

మ. సురరాట్పౌత్రుఁడు దావపావకపరిస్ఫూర్తిన్ విజృంభించి ని
ర్భరశౌర్యోన్నతి వానిబాహుబల గర్వప్రౌఢి వారించుచున్
శరజాలంబుల శుభ్రవారణఘటా సంఘంబులం దున్మి త
త్కరమూర్ధాశ్వకళేబరోత్కరములన్ గప్పెన్ సమిద్భాగమున్. 9

ఉ. వెండియు నాగ్రహంబున సువేగునిమధ్యము ద్రెవ్వ నొక్కబ
ల్కాండ మడర్చె వానికరలాఘవ మేమనిచెప్పఁ దూఁచిన
ట్లుండ సమంబుగాఁ దెగి రణోర్విపయింబడ కంతలో జతుః
ఖండములై సురల్ బెదరఁ గవ్వడిపట్టి యురంబు దాఁకినన్. 10

క. నిలుపోప కతఁడు మూర్ఛా
కలితుఁడగుచు, దోన తెలిసి ఘనభుజశక్తిం
బొలియించెఁ బార్థయోధవ
రులఁ బలువురఁ బ్రళయకాలరుద్రుఁడుఁ బోలెన్. 11

తే. బభ్రువాహనుచే నాజిఁ బడినదొరలఁ
దత్పురంబునఁ జిత్రాంగదాసపత్ని
యగునులూచి క్రమంబున నరయుచుండెఁ
దగువిశల్యాది వివిధౌషధములచేత. 12

అర్జునుఁడు దనకుదోఁచు దుర్నిమిత్తంబులు
వృషకేతనుతోఁ జెప్పుట.

సీ. అపుడు ధనంజయుండను వృషకేతుతో
సైన్యనాశమకాక సకలవస్తు
వులు నష్టమయ్యె నీవును నేను శేషింపఁ
బడిరి హంసధ్వజ ప్రముఖులాజిఁ
బ్రద్యుమ్నుఁడును బట్టుపడియె నయ్యనుసాల్వ
క్రమ మేమియును గానరాక పోయెఁ
దనతనుచ్ఛాయ మస్తకహీనమై తోఁచెఁ
గనుఁగవ విస్ఫులింగములు దొరఁగె
తే. దుర్నిమిత్తంబు లివిగాక తోఁచెఁ బెక్కు
చావునకు నింక లంకెగాఁ జనదు మొదల
నస్త్రజర్జరితాంగుఁడ నన్వయాభి
వృద్ధికై నిల్వ నీవైన విధుర పనీరు. 13

వ. అసిపత్త్రవ్రత దీక్షాపరుండై పాండవాగ్రజుండు మద్భుజావిక్ర
మంబు నిర్వక్రింబగునని యొనర్చిన క్రతూపక్రమం బపక్రమం
బయ్యె చషాలకలితం బగుఖదిర బదరీపలాశ బిల్వయూపకలా
పంబు లోపంబయ్యె వసుమతీనిలింప జంపతీజనంబు సంపాదించు
చతుష్షష్టిసలిల పాత్రాభిషేచనవిధానంబు తిరోధానంబయ్యె నధ్వ
రారంభ సముత్తంభితంబగు విహితశత శలాకారచిత శార్దూలాజినో
పయోజితాతపత్త్ర విలాసంబు నిరాసంబయ్యె సవనమండపాభ్యం
తరంబున హర్షమాణులయిన పరిసూనలాజిపరివర్షి మహర్షిపుంగ
వుల మంగళాశీర్వాదంబు లర్థవాదంబులయ్యె నవభృథ స్నానసమ
యంబున సముచిత మాల్యానులేపన మణిమయ విభూషణాంబర
విరాజమానంబైన గౌరీసహస్రంబు కరకమలంబుల ధరియించు

కాంచన దండమండితచమరవాల చాలనపరిచారంబు దూరంబయ్యె రుక్మిణీసహాయుండగు పుండరీకాక్షు నగరిపూజా పరిసంగంబును భంగంబయ్యె కావునమదీయజీవనం బపరియోజనంబు తనకు సంగరమరణంబ శరణంబు నీవు కృష్ణధర్మజుల పాలికిం జనుమనిన వృషకేతనుండు కపికేతనున కిట్లనియె. 14

మ. పలుకుల్ వేయును నేల తూలి రవిబింబం బుర్విపై వ్రాలినన్
గలఁకన్ వైరికి వెన్నుసూపుదునె మూఁకల్ గట్టి బృందారకుల్
దలపడ్డన్ బలిమిన్ జయింపఁగల నేతన్మాతురి లీశాత్రవుల్
నిలువన్ శక్తులె నన్నెదిర్చి కలనన్ నీపాలిపు నాకుండఁగన్. 15

తే. స్వామి సఖిగోమహీసురపర్వపరియోజ
నార్థమై మేను వోఁడిఁగుధన్యాత్ముఁ డెవ్వఁ
డతఁడు కైవల్యసౌఖ్యంబు లనుభవించు
ననుచుఁ జెప్పుదు రఖిలధర్మార్థవిదులు. 16

క. ననుఁజిత్తగింపు మని చ
య్యన మ్రొక్కి రథాధిరూఢుఁడై భుజగర్వం
బున బభ్రువాహు నెదిరిం
చెనువృషకేతుండు రెండుసేనలుఁ బొగడన్. 17

తే. అట్లెదిర్చిన వృషకేతునవుడు గ్రీడి
సుతుఁడు మార్కొని సాయకతిరితయమేయ
నవి యురముగురిచ్చిధరఁ దూఱె నధికతృష్ణ
భోగవత్యంబువులు గ్రోలఁబోవునట్లు. 18

క. నరసూనునవుడు కర్ణజుఁ
డిరుమూఁడు శిలీముఖంబు లెద నించిన నొ
చ్చిరయంబునఁ గోల్కొని నా
నరదముఁ దునిమెన్ సకేతుహయసూతముగన్. 19

ఉ. ఆరవిపౌత్రుఁ డొంటొకశతాంగముఁ గైకొని హేమపుంఖవి
స్ఫారశిలీముఖౌఘములఁ బార్థసుతుం దెరలించి క్రమ్మఱన్
దేరిలఁ గూల్ప వెండియును దీవ్రత నొండురథంబుతోడ న
వ్వీరుఁ డెదుర్పఁగాఁ దునిమె వేయిరథంబులదాఁక నాతఁడున్. 20

మ. నరరాధేయతనూభవుల్ మఱియు నానాదివ్య బాణంబులన్
సరిపోరన్ వృషకేతనుం డనలపర్జన్యాంత కార్కాదిని
ష్ఠురనారాచపరంపరం బొదువ నాటోపంబు మీఱన్ బురం
దరపౌత్రుండని త్రుంచె నన్నియును దా నారాయణాస్త్రంబునన్

తే. కర్ణజునిఁ జూచి యిట్లనుఁ గాన్ని యపుడు
పొలిసె నీసేన మద్భుజా విలసనమున
వృత్రుఁడమరేంద్రు నెదిరించు విధముగాక
యెందుఁ బోవచ్చునీకునా యెదురననుచు. 22

మ. దరహాసంబున బభ్రువాహనుఁడు రాధాపౌత్రు మాఁగ్యద్భుజాం
తరమున్ దూఱ మరుచ్ఛిలీముఖము సొంపన్ దూలి బ్రహ్మాండక
ర్పరముం దాఁకి ధరిత్రిపైఁ బడక సర్వక్ష్మాభృతాశావధిన్
శరధుల్ చుట్టుక ముమ్మహూర్తమున కాజన్యస్థలిన్ వ్రాలుచున్

తే. కుమురుకొని కర్ణజుఁడు క్రీడికొడుకు నుద్ధ
రాస్త్రహతి నొంప నతఁడు జోద్యముగఁ ధరణి
బింబ మొరయంగ నెగసి రథంబు దిరిగి
పడియె ధరమీఁద సంపాతిపక్షిఁబోలె. 24

వ. ఇత్తెఱంగునం బడిన బభ్రువాహను నవలోకించి. 25

చ. తొడరి మరాళకేతనుసిఁ గ్రమ్మించిన దుష్కృతాళి దీర్తునంచు బ
ల్విడివృషకేతనుం డురుశిలీముఖము న్నిగిడింపఁ ద్రుంచి క
వ్వడినతనయుండు బిట్టుగసి వాలిపయిం దరికొండకై వడిన్
బడి వడి గెంటి మింట శరపంచకముం దొడి గేసి యార్చినన్ 26

తే. క్రీడితోఁ జుతనను వృషకేతనుండు
అరద మిగులఁ గ్రుంగ రాధేయునంతవాఁడు
నిలువుమనె నిన్ను నివ్వీరునలవుగంటె
యొక్క మొగిస ప్రతాపించు మన్నవాఁడు. 27

క. అను నెడఁ బార్థుఁడు శోకశర
ముసఁ బగిలిచెఁ గర్ణసుతుని మూర్ధ మతఁడు నా
తనిముంచెఁ బెక్కు శరముల
జనమేజయ యిట్లు భయద సమరంబయ్యెన్. 28

చ. అరుదుగ ధాత్రిఁ గొంతదడ వంబరమార్గమునందుఁ గొంతసా
ద్దరదము లెక్కియుఁ జిరథులయ్యును బోరిరి పంచరాత్రముల్
శరములు తచ్ఛరీరపలలంబులఁ దేంచుక పాఱ నల్లడన్
గెరలి యహర్నిశంబుఁ దమకించుచుఁ బైకొనఁ గాకఘూకముల్.

క. ఇప్పరుసున నయ్యిరువురు
డెప్పరముగఁ బోరునెడఁ గడిఁది బాణములన్
నొప్పించి బభ్రువాహనుఁ
డప్పుడు వృషకేతుఁ బలికె నాగ్రహ మెసఁగన్. 30

క. ఇన్నిదినంబులు మార్కొని
నన్నెదిరితి నిలిచి మేలనందగుఁ గలనన్
నిన్నుఁ బోరికొనక విడువ మ
ది న్నిలుపుము నేఁడు వాసుదేవుని ననుచున్. 31

చ. కనుఁగొని యర్ధచంద్రవిశిఖం బడరించినఁ గర్ణసూతి ము
క్తునియలు సేయుచుం జెలఁగఁ దోడనె హేమవిచిత్రసాయకం
బున మెడద్రుంపఁ దచ్ఛిరము మొండెము పైనటియించి చెంతుభం
గి నెగసి కృష్ణుఁ బేర్కొనుచుఁ గ్రీడిపదంబులమీఁద వ్రాలినన్.

తే. అక్కబంధంబు వడుచుఁ బ్రత్యర్థిసేన
నద్భుతంబుగ మురియించె నవుడు పార్థుఁ

డతనిమణికుండలాన్విత మగుశిరంబు
కరమున ధరించి మిగులశోకము వహించి. 33

అర్జునుఁడు వృషకేతనుని మరణంబునకు శోకించుట.

సీ. రక్తార్తమార్తికారాతిమూర్ధాబ్జాంఘ్రి
శాలి నాఁడి రిత్తచంపుకొంటిఁ
బుత్రిపౌత్రాలింభమునకు మైకొని యబ్జ
హితునితోడ విరోధ మియ్యకొంటి
నభిమన్యుపిమ్మట నన్వయస్థితికి నె
న్నఁగఁ నీవు గలవని నమ్మికొంటి
గుణనిధానము నిన్నుఁ గోల్పోయి హరి యుధి
ష్ఠిరులచిత్తముఁ దప్పఁజేసికొంటి

తే. సకట మఖవాజి సాధించినపుడు భీము
నెమరఁ బ్రతిపక్షులను సమయించినేఁడు
నాకుఁదోడయి వచ్చి జన్యమున సమసి
యిచట బక్షుల పాలైతివే కుమార. 34

తే. అంబుజాప్తుండు లేనినభంబు దివియ
లేనిగేహంబు లింగంబు లేనిపీఠ
మసప్రయోజన మైనయట్లనఘ నాకు
నీవులేని జయంబది నిష్ఫలంబు. 35

వ అని ధనంజయుండు తచ్ఛరంబు శరీరంబునం జేర్చి మూర్ఛితుండైన
తెలిసి బహుప్రకారంబులం బలవింప నతనిం గనుంగొని బభ్రు
వాహనుం డిట్లనియె. 36

తే. వైశ్యజుఁడఁగాన సంగ్రామ వసతిలోని
వీరకోటీరమణులకు విలువ గంటిఁ
గర్ణసూనునిశిర మనర్ఘంబు దీని
భవున కర్పించి పడయుము పాశుపతము. 37

క. అన విని కిరీటి కర్ణసు
తునిమస్త్రము రథముపైఁ గుదుర్పఁజేచి మదిఁ
గసలుచు బభ్రువాహనుఁ
గని యిట్లనుఁ జటులసజ్య గాండివధరుఁడై. 38

చ. బిరుసుగ నేటికిన్ దఱుచు పేర్లెడు శూరుఁడవైన నిల్చి నీ
పరుసఁదనంబు చూపు మని పాండునూజుఁడు చిత్రజల్లుగాఁ
గురియుపయోధరంబు క్రియఘోరశిలీముఖవృష్టి ముంచినన్
దురమున బభ్రువాహనుఁడు దూలె బలంబులు గూలె నప్పుడున్.

శా. మూఁకల్ గట్టిన యోధయూధపహరుల్ మొండెంబులై రాలఁగాఁ
దూకంబుల్ సెడి తేరులాకసముపన్ దూలంబులై తూలఁగా
నాకౌంతేయుశరాగ్ని మించి జటిలంబై గోపురాట్టాలక
ప్రాకారంబులుమున్నుగా మణిపురిన్ భస్మంబు గావించినన్. 40

శా. ఆసంరంభము బభ్రువాహనుఁడు బాహాశక్తి పూరించి తో
డ్తో సూతాశ్వకపీంద్రులన్ వరుస మూఁడున్నాల్గు నేనమ్ములన్
వే సోలించుచు నుగ్రభల్లముల నవ్వీరుండు గారింపఁగా
గాసింబొందెఁ గిరీటి సన్నిహిత గంగాశాపసంవిష్టుఁడై. 41

క. అవ్వేళ దివ్యబాణము
లెవ్వియుఁ బనిసేయకున్న నెదవడి మదిలోఁ
గవ్వడి దూలఁగఁగని యెల
నవ్వుచుఁ జిత్రాంగదాతనయుఁ డిట్లనియెన్. 42

శా. మాతల్లిన్ వనితామతల్లిని సభామధ్యంబునం ద్రోల్లి య
ప్రీతుల్ పల్కినపాతకంబునకుఁ జేరెం గాల మివ్వేళ ని
న్నాతంకంబునఁ బెట్టుచున్న పితృపుత్రాశల్ విసర్జించి నీ
సూతుం గృష్ణుఁ దలంచుకొమ్మనఁగ నచ్చోఁ బుట్టె నుత్పాతముల్.

సీ. నెత్తురు వర్షించె నీరదంబులు వీచె
శర్కరాభీల ఝంఝూమరుత్తు

విఱివిగాఁ గప్పెఁ గావిఱిదిగంతముల సం
గ్రామభూస్థలి ధూమము వ్రియ్యలయ్యె
రాలె నుల్కాసహస్రము లెల్లెడల నిల్చి
దట్టించె భూతభేతాళగణము
పొగలేక యాయుధంబులు మండె నుజ్వల
ప్రతిసూర్యమండల ప్రభలు వెలిఁగె
ఆ. బభ్రువాహనుండు పాండవమధ్యను
పాణిహరణ నిష్ఠురప్రచార
జాగ్రదుగ్రశరధి సంచితజ్వాలాభి
ధానశరము వింటఁ బూనుటయును. 44
శా. ఆవిఖ్యాతశరంబు హాలహల సత్యార్చిశ్ఛటల్ గ్రాయుచుం
రావీక్షించి సురేంద్రసూతి వివిధాస్త్రప్రౌఢి వారింప ది
ద్యావాపృథ్వ్యవరోధమై నిబిడక్రౌర్యస్ఫూర్తమై బంధుర
గ్రీవంబున్ పడిఁ ద్రుంచెఁ దచ్చిరము లక్ష్మీనాథుఁ గీర్తింపఁగన్.

బభ్రువాహనుం డర్జునుఁ దెగనేయుట.

తే. అహిమకరుఁ డుత్తరాగతుం డైన శుక్ల
పక్షకార్తి కైకాదశీ భానువాస
రమున నిను నస్తమయవేళ వ్రాలె నతని
తలయు నట్టయు వృషభకేతనుని మ్రోల. 46
క. అప్పుడు కర్ణజపూర్వక
కుప్పునుతాస్యములు రత్నకుండలరోచుల్
గప్పుకొని మెఱసె ధరఁ బడి
యొప్పారెను సూర్యబింబ యుగళముఁబోలెన్. 47
వ. ఇవ్విధంబున బభ్రువాహనుం డాహవముఖంబున వృషకేతన కపి
కేతనుల వధించి జయోత్సాహమునం బొదలి మగుడునప్పు డప్పు
రంబున. 48

సీ. కొలఁదిగాఁ బన్నీరు చిలికించి కప్పురం
బున గృహాంగణముల ముగ్గుదీర్చి
సమకట్టు చీనాంబరములతో బెరయఁ జి
త్రములుగా మకరతోరణము లెత్తి
యెడనెడ వారమృగేక్షణా నృత్యయో
గ్యములైన వివిధయంత్రములమర్చి
సాంబ్రాణి ధూపవాసనఁ గడంబించు వీ
థుల మాంగళ్య ద్రవ్యములు ఘటించి

తే. భూరిజయవాద్య ఘోషముల్ బొరుకలఁగఁ
బౌరజను లెదుర్కొనెడు సంభ్రమము బభ్రు
వాహుచే నిండ్రిసుతుఁ డాహవమునఁ దెగుట
గా విచారించి చిత్రాంగదావధూటి. 49

అర్జునుని మరణంబు విని చిత్రాంగదాదులగు
నంతఃపురస్త్రీలు దుఃఖించుట.

ఉ. ఉల్లము వ్రక్కలై కలఁగ నొత్తినమూర్ఛ వహించి ధారణిం
ద్రెళ్లి నఁజేరి యుత్తరుణిఁ దేర్చి యులూచి యురంబు మోము జొ
త్తిల్లఁగ మోఁదుకొంచుఁ బరిదేవనమొందఁ బురీవధూజనం
బల్లుక చేయురోదనము లంతిపురంబున నిండఁ బర్వినన్. 50

వ. తత్కోలాహలం బాలకించి బభ్రువాహనుఁ డంతఃపురంబు ప్రవే
శించునప్పుడు. 51

శా. వేలన్ రాలినహారవల్లికలు ఖండీభూతపాటీరదూ
ర్వాలాజాక్షతహేమపాత్రికలుఁ బ్రభ్రష్టార్ద్రనీరాజన
జ్వాలాకోరకితాంగణంబులు నని శ్వాసంబునన్ భూవిభుం
డాలోకించుచు వచ్చి కన్గొనియె శోకాక్రాంతలం దల్లులన్. 52

తే. కాంచి యిట్లను నర్హాశృంగారరచన
లెడల నేటికి నింతవానిడిచి యేడ్వ
ననన్యశానందకారణం బైనమద్వి
జయమునందిట్లు శోకింపఁ జనునె యనిన. 53

క. తరువున జనించి వైశ్వా
నరుఁడు తరువుఁ గాల్చువిధమునను బుత్త్రుఁడవై
నరున కుదయించి తండ్రిన
పొరిగొంటివి విధవకేల భూషణమింకన్. 54

క. కాంత ధనంజయముఖమునఁ
గాంతు ధనంజయముఖంబు గావునఁ గొనిపా
మ్మంతముఁ బొందినవిజయా
భ్యంతికమున కన్నుఁ బన్నగాత్మజపలికెన్. 55

ఉ. నాయెలదోఁటలో మొదల నాటినదాడిమ పంచకంబు నీ
పోయినరేయి దగ్ధమయిపోయె నిమిత్తములేక యల్లకాం
తేయునికీడు గంటెఁ దరుణీ యనఁ దల్లి కుమారుఁజూచి పు
త్రా యెఱిఁగిట్లు చేయుపితృహత్య జయంబనికోరె దేమనన్.

క. అన బభ్రువాహనుఁడు ప
ర్వినభయమునఁ గలఁగి మోము వెలవెల నాఁగన్
కొనిపోయె నపుడ తల్లుల
జనకుఁడు పడియున్న ఘోరసమరస్థలికిన్. 57

ఆ. చేత నరుగుదెంచి చిత్రాంగదయు భోగి
రాజసుతయు దివిజ రాజసుతుని
పాదపంకజముల పైఁబడి యందంద
పొదలు శోకవహ్నిఁ బొగిలి పొగిలి. 58

సీ. దివిజులఁ దఱిమి ఖాండవము సప్తార్చికి
ధారవోసిన యశోధనుఁడు వీఁడె
నిటలాక్షుతోడ నెక్కటి పోరి పాశుప
తము గొన్నవిక్రమోద్ధతుఁడు వీఁడె
కాలకేయాది రాక్షసుల నుక్కడఁగించి
జయము గైకొనిన దుర్జయుఁడు వీఁడె
కలన భీష్మాదియోధుల గర్వ మెడలించి
పసి మరల్చిన బాహుబలుఁడు వీఁడె
తే. యగ్రజునకును రాజసూయాధ్వరప్ర
శస్తి నెరపినభ్రాతృవత్సలుఁడు వీఁడె
యదుకుమారుల నరకుసేయక సుభద్రఁ
గడిమిఁ జేకొన్నహరిచెలికాఁడు వీఁడె 59
తే. అని విలాపించి వృషకేతనుని శిరంబుఁ
గాంచి తల్లులు దిగిచి వక్షమునఁ జేర్చి
తండ్రిపనిఁదీర్ప కిట్లు నాతండ్రి నిలువ
నగునె సీకంచు బభ్రువాహనునిఁ జూచి. 60
మ. తనయా చంపితి కర్ణసూను బుధమందారంబు నిం దేమికీ
ర్తి నిను జెందె హయంబు వెంట నిఁకఁ గూర్మిన్ హస్తినాపట్టణం
బునకు బోవఁగఁగల్గె బంధువితతిం బూజింపఁగాఁగల్గె నం
దు నిజేశుం గలయంగఁగల్గె ననఁ దోస్తోఁ దుంచి తయ్యాసలన్.
క. జనకునిఁ జంపినమాడ్కిని
జనయిత్రుల మమ్ము నిపుడ చంపుము జననీ
జనకవధం బొనరించినఁ
గనియెదు భార్గవునికన్న ఘనతరకీర్తుల్. 62
తే. ప్రియుఁడు పరలోకగతుఁడైన పిదప సతుల
కనుగమన మెందునర్హకృత్యంబు దగిన

తెఱఁగు గావింపఁబనుపుము తీర్చికొనెద
మగ్నిముఖమునఁబతివియోగాగ్నియనిన 63

శా. అంబా తండ్రికి మున్ హయంబుఁగొనుచున్ హస్తాంగదండప్రణా
మం బేఁ జేసిన నాదరింపక సభామధ్యంబునన్ దుచ్ఛవా
క్యంబుల్ పల్కఁగ సంభవించెఁ బితృహత్యాలబ్ధి యిక్కడునా
శంబై పోదు తపోవ్రతానశనయజ్ఞధ్యానదానాదులన్. 64

క. మునుదానుదయించినవే
ళనె పితృఘాతుఁడను గాఁగలఁడు వీఁడని నె
మ్మనమున నెఱిఁగిన ఫణిసుత
ననుఁజంపక పెనుప నఘమునకు లోనైతిన్. 65

క. కావున నిత్తను వనలము
లో వేల్చెద ననిన విని యులూచి వలికె నే
లా వేగపడెదు మృతసం
జీవనమణి గలదు తండ్రి శేషునిసగరన్. 66

తే. కుళికవాసుకిశంఖకర్కోటకాది
ఫణులు మణిదీప్తఫణాఫరంపరలు మెఱయఁ
గాతు రధి మృతభోగిరక్షణము గాన
గరుడభయపన్నగుల కిచ్చెఁ గాళగళుఁడు. 67

ఉలూచిచిత్రాంగద నూర్ధ్వమృతసంజీవనీరత్నంబు
దెచ్చుటకు పుండరీకుని పాతాళంబున కనుచుట.

మ. బలిమిం జేకొనరాదు సామమునఁ దప్పన్ బుండరీకుండు దేఁ
గలఁ డారత్నము మత్ప్రధానుఁ డని యక్కల్యాణి తాటంకమం
గళసూత్రంబులు జేతికిచ్చి ఫణిలోకస్వామి కీదుర్దశల్
తెలియంగా వినిపించి యమ్మణి నెసం దెమ్మంచు వీడ్కొల్పినన్.

తే. వికృతిఁ బొందక యుండ నవ్విజయకర్ణ
సుతులదేనులు మూర్కొని యతఁడు వీరి

నేమఱక యుండుఁ డనువారి నెచ్చరించి
కదలి వెసఁజొచ్చె వసుమతీగహ్వరంబు. 69

సీ. ఆయుతయోజనసువర్ణాశ్వత్థగహనభో
లత్పన్నము వితలంబు సొచ్చి
ఫలితకాంచనశమీపాదపచ్ఛాయావి
లాసవాసము సుతలంబు గడచి
శాతకుంభరసాలసాలచిత్రానేక
తరుసంకులంబు మహాతలముదాఁటి
మరకతమాణిక్యమయచందనద్రుకాం
తారాంతరము రసాతలము వెడలి

తే. చనియె భోగవతీతీరవనవిహార
హాటకేశ్వరభవనదోలాధిరూఢ
గూఢపాత్కన్యకాగానగుంభమాన
తాళకోలాహలమ్ముఁ బాతాళతలము. 70

వ. కనుంగొని. 71

తే. అచట భోగవతీస్నాన మాచరించి
నియతకృత్యంబు లెన్ని యున్నియును దీర్చి
పుండరీకుఁడు హాటకపుండరీక
షండముల హాటకేశు నర్చన మొనర్చి. 72

మ. ముకుటన్యస్తకరారవిందుఁ డగుచున్ ముగ్ధేందుచూడావతం
సకునిన్ వీడ్కొని నూత్నరత్నఖచితాస్థానిన్ విలోకించె వా
సుకి కర్కోటకతక్షకాదిభుజగేశుల్ గొల్వ దీపించునం
దకపాణిస్మరణప్రమోదయుతవిద్యాశేషునాశేషునిన్. 73

చ. కనివినయంబు గ్రందుకొనఁగా బ్రణమిల్లి యులూచి దాల్పుకుం
దనపు మెఱుంగుఁగమ్మలును దాళియుఁ జూపి కిరీటి ధర్మనం

దనమఖవాహరక్షణచణస్థితి నేఁగుచు బభ్రువాహను మా
ర్కొని హతుఁ డయ్యె నీతనయుఁడుం బతిదానము సేయఁగాఁదగున్
చ. ధరణితలంబు మస్తమునఁ దాల్చి యొసర్చితి జీవకోటికిన్
బరమసుఖానుకూలముగ మధ్యమలోకము శైలధన్వికిం
బురజయు మిచ్చినేలుపులఁ బోషించితి వేగతి నెన్ని చూచినన్
బరపురుషోపకారములు పన్నగనాయక నీవిహారముల్. 75
క. కావున నీనిలయమున స
దావిషధరముఖ్యరక్షితం బగుమృతసం
జీవని యొసఁగినఁ బునరు
జ్జీవితుఁ డగుఁ బార్థుఁ డనిన శేషుఁడు పల్కెన్. 76
క. హరిభక్తపరాయణుఁడ
స్మరుని జయింపంగ నాదినారాయణుఁ డో
క్కరుఁడును దక్కఁగ నెవ్వరి
తరమతని నెదుర్ప నద్భుతం బిది యనినన్. 77
క. అపుండరీకుఁ డనుఁ బ్ర
ద్వీపతులెనగారు విజయు దీకొన గంగా
శాపహతిఁ బుత్త్రుచేతన,
రూపఱెఁ గా కనిన విని కరుణ దళుకొత్తన్. 78
క. మృతసంజీవనమణియు న
మృతకుంభము నొసఁగెదను సమీరకహతు శత
క్రతుసుతు బ్రతికించి జగ,
త్ప్రియంబునఁ గీర్తి విస్తరించెద ననుచున్. 79
క. కృతనిశ్చయుఁ డగుశేషుని
ధృతరాష్ట్రుం డనెడిఫణి గదిసి యిట్లను సం
చితవస్తుజాతములలో
వితరణులకు నొసఁగ రానివియు లేవెచటన్. 80

తే. అయిన నొకవిన్నపము మర్త్యు లమృతవాదు
లిచ్చినను వారిమెడ ఫలియింప నేర
దమృతమును రత్నమును బోయినపుడఫణుల
బైసిచెడిపోవుటదినీరుపాములకును. 81

క. గరుడుడు తోలుక తిరుగును
పురముల నాడింతు రుదరపోషణములకున్
బరిజోగులు పెట్టెల నిడి
తరుణు లొలుచుకొందురుమణులు తలతలవారిన్. 82

ఆ. మును మతంగశాపమున వైనతేయుడి
కడకి రాక తక్కగాక యివ్వి
ధం బెఱింగనే సుధారసరత్నంబు
లేల మనకు మగుడ నిచ్చు నతఁడు. 83

క. మత్తకరివిభుఁ డమాత్యుఁడు
మెత్తని యంకుశము మేరమీఱి నడచునే
నొత్తి మరలింపఁదగు నీ
చిత్తంబిక ననినటుచు శేషుఁడుపలికెన్. 84

తే. గోపసూనులఁ గ్రేపుల గోధనములఁ
గమలజుఁడు దాఁచి సత్యలోకమున నున్న
నపుడె ప్రతిసృష్టి యొనరించె నాప్తుఁ డైన
గ్రిడి బ్రతికించుటే దొడ్డకేశవునకు. 85

క. పూరిపుడక కులిశంబగు
నారాయణుకరుణ గలిగినను లేకున్నన్
మేరువుతృణమగు నవ్విభు
కారుణ్యముగాదె వజ్రకవచము మనకున్. 86

వ. అనిన ధృతరాష్ట్రుండు శేషునకిట్లనియె. 87

క. వనజోదరుండు వాసవ
తనయుని బ్రతికించునట సుధారసముఖులన్
బనిలేని ప్రయోజన మి
చ్చినిరర్థక మేలఫణులం జెఱచెద వనినన్. 88

{ పుండరీకుఁడు శేషునిచే తిరస్కృతుండై మరల నులూచికడకు వచ్చుట. }

తే. పుండరీకునిఁజూచి శేషుండుపలికె
మాకులమువారు సంజీవమణియు సుధయు
నీరు హరిక్రీడఁ బ్రోచునీవేఁగుమనిన
తిరిగియాతండు వచ్చెనతెరవుఁ బట్టి. 89

ఉ. సంగరభూమిఁ జేరఁ ఘనసారసముజ్జ్వల దీపమాలికా
సంగతబభ్రు వాహనిజసైన్య సురక్షితుఁడైన పార్థుమో
లంగనుఁదూలి దీనదశలం బలవించెనునయ్యులూచిచి
త్రాంగదలం గనుంగొని దురంత విషాదముతోడ నిట్లనున్. 90

శా. తల్లీ నీజనకుండు శేషఫణిరత్నం బీక లోభంబు సం
ధిల్లం బల్కనరోసి వచ్చితి విరక్తింబుత్తదత్తాదగ్నిలోఁ
జెల్లుం డిందఱు నన్నుఁ గార్ష్ణి చెవికింజేఁదైకఠోరక్రుధా
వేల్లద్భ్రూకుటిమండలుం డగుచుఁ జేవిల్లందిపెల్లినన్. 91

శా. ఎట్రా శేషుఁడు పోతరించిసభన న్నిగ్గాడె నారత్నమీఁ
డట్రావాసుకితక్ష కాదిధృతరాష్ట్రామాత్య కర్కోటకుల్
చుట్రా నిల్తురుగాక నన్నుసమరక్షోణిన్ విజృంభించియా
గట్రాచూలివిభుం డెదిర్చిన నహంకారంబు వారించెదన్. 92

క. అని జనయిత్రులదెసఁ గ
న్గొనియిట్లను బభ్రువాహనుఁడు చిత్రముగాఁ
గొనివచ్చెద మృతసంజీ
వనమణియు సుధారసంబు వగవకుఁ డనుచున్. 93

బభ్రువాహనుఁడు నురగులతోడి యుద్ధంబున కేఁగుట.

క. మాతంగరథభటాశ్వప
రీతుఁడగుచుఁ ద్రోవ పుండరీకుఁడు చూపన్
గాతాళంబున నిలువక
పాతాళంబునకుఁబోయి పౌఁజులు సేయన్. 94

తే. శంఖభేరీమృదంగ నిస్సాణభయద
రావములు దిక్తటంబుల ప్రక్కలింప
శేషుఁడిట్లనుఁ దక్షకమూషకాద
కుళికవాసుకి కర్కోటకులఁ గనుఁగొని. 95

ఉ. తెంపున బభ్రువాహుఁ డరుదెంచెరణంబునఁ బన్నగంబులన్
ద్రుంపఁగఁబోఁడు కట్టలుకతో ధృతరాష్ట్రునిమర్వనీతు లా
లింపఁగఁబట్టి పుట్టెఁబనిలేనివిరోధము వీరలెల్ల నా
పంపునఁ బోఁకింజనుఁ డపారబలంబుతోడ నావుడున్. 96

ఉ. కుండలిరాజునాజ్ఞ భుజగుల్ వరరత్నకిరీటముద్రికా
కుండలమాల్యచందనదుకూలములన్ ధరియించి వాహ వే
దండరథాధిరూఢు లయితార్కొని మార్కొననొప్పె సేసలా
రెండులయాంతకభ్రుకుటిరేఖల పెంపుద్రుణీకరించుచున్. 97

మ. అనికిందూకొని దందశూక చతురంగానీకముల్ పంచయో
జనజన్యస్థలినిండి భీషణవిషజ్వాలావలిన్ బభ్రు[illegible]
హనుసేనం బరిమార్పఁ దోనధృతరాష్ట్ర[illegible]
త్రనిపాతంబుల నేకవింశతిసహస్ర [illegible]

తే. విజయసుతుఁ డల్గి మాయూరవిశి[illegible]
ద్విత్రిశతసంఖ్యపణాఘుల విషధర[illegible]
శిఖులుమర్ధింపఁ జెదరుచచ్ఛి[illegible]
విలయమునరాలు నుల్కలపిధను[illegible]

వ. ఇత్తెఱంగునం గేకిలోకంబుగదిసి చీకాకుపడం గాకోదరంబుల యుదరంబులు చంచూపుటంబులం జించినఁ బ్రేవులుఁ బ్రోవులువడం గడసినాలికలు పేలికల విధంబునం దూలందూలుట గనుంగొని యుక్కుమీఱుచుం మధువర్షబాణంబు ప్రయోగించి. 100

క. నిలువక పిపీలికాస్త్రం
బలుకమెయిం దొడిగియేయ నందువలనఁ బె
క్కులుచీమలు వెలువడి వడిఁ
దొలిచెశరీరాస్థు లెల్లఁదొఱటలువాఱన్. 101

క. చిలువదళవాయు లప్పుడు
తలబీకన కాయులై యథాయథలై కూ
కులువత్తులునై మొనతల
నిలువక శేషాహికడకు నెఱిచెడిపాఱన్. 102

వ. వారలంగనుంగొని భుజంగపుంగవుండిట్లనియె. 103

క. మృతసంజీవని సురరా
ట్సుతులకు నిండస్సనప్పుడు కుయుక్తులు చె
ప్పితిరి నరసూనుమగఁటిమి
ధృతరాష్ట్రపిత్రిముఖులెఱిఁగితిరె నేఁడాజిన్. 104

బభ్రువాహనుఁడు నుగగుల నోడించి జీవమణి గొనివచ్చుట.

సీ. అగ... రల నిరసించి యాక్షణమ సు
...చుపౌత్రునకు నీఁదగినదివ్య
...ము నమూల్య
...ణ దుకూలమాల్య
...గ నిచ్చి
...నంబుకందు వాపి
...చ్చి
...దు నంతరించి

తే. తక్షకాదులు గొల్వఁ బాతాళగహ్వ
రంబు వెలువడి జీవరత్నంబుఁ గొనుచు
బభ్రువాహనుఁ గూడి పాభ్రవము మెఱసి
మణిపురంబున కేతెంచె ఫణివరుండు. 105

తే. అపుడు ధృతరాష్ట్రుఁ డాత్మ గేహమున కరిగి
దుఃఖితుండయి దుర్బుద్ధి దుస్స్వభావు
లను సుతులఁగాంచి బభ్రువాహనునిచేత
బవరమున నైనతన పరాభవము దెలిపి. 106

క. పాండవులకు మనకు మొదల
నుండియు నెడతెగనివైర మురగవిభుం డా
ఖండలసుతు బ్రతికించును
గండిందుకుఁ దలఁపు డంతరాయం బనినన్. 107

వ. వారలు తండ్రికిఁ బ్రణమిల్లి యిట్లనిరి. 108

ఉ. రుండను దాఁచినన్ ఫణిపరుం డొకఁడేల కిరీటిఁ బ్రోవఁ గృ
ష్ణుండును జాలఁ డిందరిసుతుచో వ్వణఁగన్ మఖసైంధవంబు నె
వ్వండయినన్ హరింప సిలువంబను జన్నము యజ్ఞకర్మహీ
నుండయి చెల్లు నయ్యమతనూజుఁడు నీపగదీఱు నంతటన్. 109

తే. అనిన ధృతరాష్ట్రుఁ డలరి శేషాహిగొల్వఁ
జజనియె నెఱుఁగనియట్ల త్క్షణము శక్ర
తనయుతలఁ గొంచుఁదతుం
వర్జితంబైన బకదాల
నాగకుమా

వెదకి వదనోదరము లవ
వదలుగఁ దాటించుకొనుచు వసుధంబొరలెన్. 112

వ. తత్కోలాహలంబు బభ్రువాహనుం డాలకించి. 113

క. అరుదెంచి శక్రసూనుని
శిరము వెదకి కానలేక చెందినమూర్ఛన్
ధర వ్రాలెసచటఁ గుంతియుఁ
గరిపురి నారాత్రి కీడుకలగని భీతిన్. 114

క. విన్ననయి ధర్మజాచ్యుతు
లున్నెడ కరుదెంచి యదుకులోత్తంసునకున్
విన్నపము చేసె మునుకుచుఁ
గన్నులఁ గ్రొవ్వేఁడి బాష్పకణములురాలన్. 115

తే. కంసమర్దన నేను నాకలఁ గిరీటి
తైలదీర్ఘిక మునిఁగి గాత్రమున గోమ
యం బలందుక రక్తమాల్యములుదాల్చి
యరిగె ఖరవాహనమునెక్కి యామ్యదిశకు. 116

క. అప్పాండవమధ్యమునకు
నొప్పమి పుట్టంగవలయు నుల్లము గలఁగెన్
దప్పుడు నాకల నీసఖు
[illegible] యుంగొను మనినన్. 117

118

దఱచగు దీపకోటుల గుణచ్యుతకర్కశ చాపకోటులన్
మెఱసిన బభ్రువాహను సమిత్స్థలి శౌరి సుపర్ణు డిగ్గఁగన్. 119

క. బకదనుజాంతక దనుజాం
తకజనములుఁ బన్న గాశనరథంబు నిరు
త్సుకత డిగి పార్థునపమూ
ర్థకళేబర మెదురఁగని రొదవ్ర శోకనుఃన్. 120

—: శ్రీకృష్ణుఁడు మొదఁగువారు యర్జునుకడకు వచ్చుట. :—

ఉ. శ్రీవరుఁడప్పు డర్జునునిఁ జేఁ ధనంజయు వీరె కుంతియున్
దేవకియున్ యశోదయును నిన్నుఁగనుంగొని పొక్కుచుండ నే
లా వగ పార్పవంచు నడలన్ నిని భీముఁడు కృష్ణుఁజూచి దే
వా విజయుండు మేల్కను నవశ్యము నీవిటు పేరఁ బిల్చుటన్.

సీ. అనునంత సూర్యోదయంబైన బభ్రువా
హనుఁడు దల్లులు దాను నలముకొనిన
మూర్ఛలు పర్యాయమునఁ దేఱి దురములోఁ
జిక్కిన పద్యుమ్నుచే నెఱింగి
కృష్ణునకును దేవకీయశోదలకుఁ గుం
తికిని భీమునకు సద్వినయభక్తిఁ
బ్రణమిల్లె నప్పు డప్పన్న గాధీశుండు
చక్రిసన్నిధిఁజేరి సనుయ మరసి

తే. దేవ జీవరత్నంబు దెచ్చినాఁడ
గరుణ రక్షింపు నీచెలికాని నితని
మస్తకము దొంగిలిననీచమతుఁ బట్టి
తునుము తొల్లిటి రాహుకేతువుల బలెను. 122

తే. ధర్మజుని యన్వయము రసాతలము
మునుఁగ కుండఁగ నుద్ధరింపుము

శిరమునకుఁ దోఁ ప్రవగానను చిత్తగింపు
దేవకీపుత్రి నీదివ్యదృష్టినినిన. 123

మ. వినుఁ డీనాదుప్రతిజ్ఞయే నఖిలపృథ్వీక బ్రహ్మచర్యవ్రతం
బునఁ జెంపొందితినేని గన్వడిశిరంబుల్ వచ్చుఁ దచ్ఛేరకుల్
ఫునుకల్ వ్రియ్యాలువాసి చత్తురన నాలోఁ గ్రీడిమస్తంబు చ
య్యన వచ్చెన్ విగతాసుకైరి ధృతరాష్ట్రాపత్యముల్ గానలోక.

వ. అంత. 125

♦ శ్రీకృష్ణుం డర్జునుని బ్రదికించుట. ♦

క. నరవృషకేతనుల తలల్
సిరివరుఁ డంగములఁ జేర్చి జీవదమణి పే
రురమున నోప నదికేఁద
చ్ఛిరము లయస్కాంత మినుముఁ జెందినమాడ్కిన్. 126

ఉ. జీవదరత్నవైభవముచే వృషకేతుఁడు లేచి శ్రీహరిం
దా వినుతించుచుక రిపు నదల్ప ముకుందుఁడు గౌఁగిలించె గాం
డీవియు నట్లె దేవ సుతు నెమ్మిఁ గనుంగొనెఁ దల్లినాఁడు న
న్నావలి వానఁ దెప్పిలుక్రియక గనెఁ బాండవసైన్యమత్తటిక. 127

చ. మొగిసె నసంఖ్యశంఖరవముల్ దివిఁ బువ్వులవాన సోనగాఁ
గురిసెఁ బునఃప్రజాతసుతఁ గుంతిఁ గనుంగొను వేడ్క వాహినుల్
బెరసె మురారి పట్టి కదలింపఁ జమూపసమూహ ముబ్బుగా
నెరసెఁ బురోపకంఠసరణిం దరుణీపరిణీతలాస్యముల్. 128

ఉ. అన్నగరీజనంబు నెరయం గని వారిగఁ జల్లురత్నసం
పన్నతయుం దదంతికహిమక్షితిభృత్తటసీమ నోలగం
బున్నకుమారుఁ జూచి తల లూఁచి నృపుల్ గొనియాడఁ గ్రీడియుక
వెన్నుఁడు బభ్రువాహరమణీయసభాస్థలిఁ జొచ్చియచ్చటక. 129

క. ఘనరత్నభద్రపీఠ
బున నిరువురు నతు లహా

సనుతై రప్పుడు సమితా
నను( డగు నరు( జూచి భోగినాయకు( డనియెన్. 130

క. ధాత్రీశుల కర్జున స
ర్వత్రి జయము( బుత్రిచే( బరాభవము( గనం
బాత్రము భవదీయసుత
ఛాత్ర మెఱి(గి మెచ్చుకొను దగదు లజ్జింపన్. 131

వ. అదియునుంగాక నీవు గంగాశాపనిమిత్తంబున నిట్టివిపత్తుసంభవించె చిత్తంబున నుత్తలంబు నొందక సుకుంమునికరుణావిశేషంబునం జెంది నభవన్నందను సకల రాజ్యభోగంబులు ననుభవింపుమునీకళత్రంబు లైనచిత్రాంగదాభుజంగరాజపుత్త్రికలహృజ్జనితశోకంబులుజ్జగింపబుజ్జ గింపుములజ్జితుండైనబభ్రువాహనునుపగూహనంబున నాదరింపుమని వారిజోదరుంగనుంగొని. 132

సీ. దేవ కవ్వడినొప్పి దీఱ బోధింపు మి
త్త్రతి దేవకీయశోదలును గుంతి
యును దండ్రిబిడ్డల నొద్దిక సేయంగ
వలయు వీరుడు బభ్రువాహనుండు
విష్ణుభక్తుని దయాన్వితుని భ్రాతృవ
త్సలును నూర్జితయశోధనుని నాత్మ
జనకుని మార్కొన్న పెను(బాతకము వాయ(
బాపితంబుగ( దుషారాచలంబు

తే. దండ( దనమేను విడువంగ( దమకపడెడు
ననిన( జిత్రాంగదాతనూజునిమనంబు
తెంపు( గనుంగొని యది నివారింప(దల(చి
పవనుజుడు పల్కెగంభీరభాషణముల. 133

తే. గురు(బితామహు(దో(బుట్టుగులవధించి
దురితముల(జెంద మీయచ్యుతునిభజించి

కలుషమతివై ననిన్ను డగ్గఱునె శౌరి
జీవపిత వీవు నెఱయంగఁ బావనుఁడవు. 134

క. విను నాలవయుగమున నీ
తనినామస్మరణమునఁగదా మర్త్యులు పా
వను శౌరి కృష్ణుఁ గొలిచిన
మనలకు భయశోకదైన్యమగ్నత గలదే. 135

క. అని పెక్కు చందములఁ బా
వని దెలిపిన నపుడు బభ్రువాహనుఁడు మనం
బున నెగులు విడువ నందఱుఁ
గొని యాడిరి విజయుపట్టిగుణకథనంబుల్. 136

క. నానావిధభోగంబుల
నేనుదినము లుండి రేక హేలమణిపురిన్
దానములచేత బహువిధ
గానంబులచేతఁ గౌతుకము రెట్టింపన్. 137

క. ఆసమయంబునఁ గృష్ణుఁడు
వాసవితో ననియె నిట భవత్సూనుని యా
వాసమున సుఖంప సునా
యాసంబుగ నేఁగె వరుసనైదుదినంబుల్. 138

క. మనతల్లుల నీదేవుల
ననిలతనూభవునిఁ గూర్చి యర్హము లగు నీ
ధనకనకవస్తురాసులఁ
బనుపఁదగు నజాతశత్రుపట్టణమునకున్. 139

క. వీరలు ధర్మజుయజ్ఞ
ప్రారంభము జరపెదరు తురగరక్షకు నీ
భూరమణులు భవదీయకు
మారులు రావలయుఁ గదలి మనబడి ననుచున్. 140

ఉ. దేవకి మున్నుగాఁగలసతీనివహంబు ధనంబుఁ గూర్చి య
ప్పావనివెంట సంపుటముఁ బన్నగరాజును బభ్రువాహన
క్ష్మావరు చేతిపూజ బహుమానముగాఁ గొని సంతసిల్లి ల
క్ష్మీవరుఁ డంప భోగవతికిం జనియెన్ బరమానురక్తుఁడై 141

క. అనవరతము నీకృష్ణా
ర్జునయుతసంజీవకథ వరుస నాకర్ణిం
చిన వ్రాసినఁ బాఠము చే
సిన ధర నపమృత్యుభయముఁ జెందరు మర్త్యుల్. 142

క. జనమేజయ విను గోవిం
దునియనుమతి విడువఁబడినతురగము నానా
జనపదములు గడచి క్రమం
బున బర్హిధ్వజునిరత్నపురమున కరుగన్. 143

క. త్రోవ మయూరధ్వజవసు
ధావరుక్రతుహయముఁ బుత్రు దామ్రధ్వజునిం
గావలిగా నిడి విడిచిన
డై విక్రమఁగ రెండు నెదురుతాఁకై నిలువన్. 144

ఉ. అమ్మఖవాజిఁ బాండుతనయాధ్వరవాహ మెదిర్చి మోముమో
వమ్మసి చెట్టి హేషితరవమ్మున వక్షముఁ బూర్వపక్షురా
గ్రమ్మున వ్రేయ జేసి యది కందము వట్టి విదల్పఁ దోన మి
త్రమ్మయి కేలికిఁ గడఁగి దంతములన్ గళ మప్పళింపగన్, 145

క. తామ్రధ్వజభూవరుఁడా
తామ్రనయనుఁ డగుచుఁ గనలి తంత్రాధిపు నీ
సామ్రాణి యెవరి దన విని
నమ్రుఁ డగుచు లీలఁ గదలి నకులధ్వజుఁడున్. 146

బహులధ్వజుఁడు పాండవహయంబుఁ బట్టుట

ఆ. చౌకళింపకుండఁ జతురంగబలముల
సొరది వేసె వెట్టి చుంచుబిగియ
బట్టి చదివె నొసలిపట్టికమీఁదఁగ
న్పట్టిమెఱయుబిరుదపద్య మపుడు. 147

ఉ. దుర్జయరాజమండలవిధుంతుదమూర్తి యుధిష్ఠిరక్రతూ
త్సర్జిత మైనయీహయవతంసము ద్రిమ్మర నంగరక్షగా
నర్జునుఁ డేగుదెంచె నిటలాక్షునిగెల్చినజోదువిక్రమో
పార్జితలీలఁ బట్టుఁడు రయంబున శూరులు ధాత్రిఁ గల్గినన్. 148

క. అది విని నృపమాన్యుం డను
నదనఁ గ్రతువు లేడు జరపె నధిపతి మును నేఁ
డిది దొరకుటచే నెనిమిద
వదియును సిద్ధించె ననుచు హరిఁ బట్టింతున్. 149

క. రేయి సురమాని చెప్పెన్
భ్రాయః పౌరుషులు లేరు పాండవసేనన్
బ్రాయి గలమగలు నరరా
ధేయసుతులుదక్కననుచుఁ దెలియఁగ నాకున్. 150

మ. నరనారాయణు లర్జునాచ్యుతులు జన్యం బబ్బెడిం గావుఁ డీ
హరి నన్నం దళవాయి నీబలములో నాసేన గానంగరా
దరయన్ శూరుఁడు బభ్రువాహనుఁడు గాఁడాపెట్టుముక్తామణుల్
పురినంతఃపురిఁ జూపుకేళికలకుం పుష్పాంజలుల్ సేయఁగన్. 151

— కృష్ణార్జునులు తామ్రధ్వజునితోఁ బోరుట. —

క. ఆహవ మొనరింపఁగ నిఁకె
సాహసు లం డెవ్వ రనుచు సైన్యాధీశుం
డాహయము నర్ధచంద్ర
వ్యూహంబునఁ బదిలపఱచె నొడయనియాజ్ఞన్. 152

ఆ. తామ్రకేతుఁ డనిఁ బ్రతాపించి మార్కొన్న
శౌరి పలికె సవ్యసాచిఁ జూచి
వీరయోధు లనికారణంబున కెల్ల
కారణంబు దప్ప దీరణంబు. 153

క. వారు లయాంతకనిభులు మ
హారథు లని కార్ష్ణిఁ బిలిచి యస్మద్బలమున్
బోరికి గృధ్రవ్యూహము
గా రచియింపు మన నట్లకాఁ జేయుటయున్. 154

వ. వారిజోదరుండును దారకప్రేరితం బైన తేరెక్కి మిక్కుటం బగు రవంబుల దిక్కుడుంగంబులు వ్రక్కలింప నొక్క మొగిఁ బాంచజన్యంబు పూరించె నమ్మహావ్యూహంబునకు ననుసాళ్వుండు కంధరంబును హంసజుం డీక్షణంబులును ప్రద్యుమ్నానిరుద్ధులు పక్షంబులును భోజవర్ధనుం డైన నశ్వైనేయుండు చరణమధ్యంబును చంచువు చిత్రాంగదాపుత్రచిత్రభానుపౌత్రులును నపరిమితసేనాసమేతుం డైన కపికేతనుం డుదరంబును తదీయరక్ష యావనాశ్వమేఘవర్ణులుగా నెదిర్చినం గనుంగొని తామ్రధ్వజుండు గరుడధ్వజున కిట్లనియె. 155

క. శూరత నను నెదిరించితి
పోరికి దివ్యాయుధములు పూని నిజముగాఁ
బౌరుషము గలిగె నేనియు
నారాయణ పట్టవలదె నాహరి ననుచున్. 156

మ. అలుకం గన్నులు విస్ఫులింగములఁ గ్రాయం దామ్రకేతుక్షమాతలనాథుండు శతాంగముం దఱిమి పార్థవ్యూహరక్తంబులన్
బలి చల్లెన్ నెలవంకబాణముల దృప్యద్బాకినీహుంకృతి
ద్గళితజ్యారవఘూర్ణితాఖిలదిశాకాశావకాశంబుగన్. 157

సీ. కంసారి నేడంబకంబుల సుఱిక్కించి
యేనింట సూతుని నే పడంచి
తేజివాజుల నాల్గునారాచములఁ దుఱించి
త్రిదశేంద్రజుని డెబ్బదిటఁ గలంచి
శైనేయు తొమ్మిశరముల సొరిగించి
కృతవర్మనిరునాలుగింట నొంచి
ప్రద్యుమ్ను వేయిమార్గణములఁ దూలించి
శతసహస్రములఁ దత్సుతుని ముంచి
తే. యంతఁ దనియక మదిఁ జాలనాగ్రహించి
మఱియుఁ దక్కినయోధుల మదమడంచి
పగటిసూర్యునిగతి పరితాపమునెమించి
సింహనాదంబు గావించెఁ జెంగలించి. 158

వ. అప్పుడు 159

క. తనతనువున నంతట గిఱి
కొనినశరవ్రజము దుల్పుకొని యుద్ధతుఁడై
యనిరుద్ధుఁ డెదిరివీరుల
ననిరుద్ధులఁ జేసె భీషణాశుగనిహతిన్. 160

క. గ్రమ్మన నెత్తురుటేఱులు
గ్రమ్మనఖండప్రచండకాలానలకీ
లమ్ములఁ దెగడు మెఱుఁగువా
లమ్ముల నక్షౌహిణీత్రయము మడియించెన్. 161

క. ఆయదువీరుఁడు మఱిపిలు
మోఱియిం చరిఁ జూచి తురగమును విడు లేదా
నాయెదుర బంటవై నిలు
మాయోధనమునకు నన్ను నతఁ డరనగుచున్. 162

క. అలరువిలుకానికొడుకవు
బలివారఁడె నాఁడె పట్టి బాణుఁ డుషామం
గళసూత్రవైభవము నీ
తల గాచెం గాక నాకు దయలేదనిన్. 163

చ. కటువుగ నగ్ని బాడబసఖుం బగుక్రొవ్విశిఖంబడచ్చి హృ
త్పుటముఁ బగిల్చి తొమ్మిదిటఁ దొట్టినక్రొవ్వుఁ గదల్చి సూతునొ
క్కటఁ దల ద్రుల్చి తేరితురగంబులనాల్గిటఁ గూల్చి యార్చినన్
దటుకున వాలుఁ గేడెమును దాల్చిసుచిత్రుఁడదల్చినిల్చినన్. 164

క. అరిగయుఁ గృపాణియును నతఁ
డురవడిఁగొని రణము డిగ్గనుఱికిన నప్డు
య్యిరువురు సింగపుఁగొదముల
కరణి విజృంభించి తాఁకి ఖడ్గాఖడ్గిన్. 165

క. లాసియుఁ బొడిచియుఁ దట్రియు
వ్రేసియు నొడ్డించుకొనియు విసరియు మిగులం
డాసియు నొక్కట గయ్యపు
చేసిరి నిజసాధనములు చిద్రుపలుగాఁగన్. 166

క. జేగురుఁ గోరాడినమద
నాగంబులరీతి మార్గణవ్రణజాసృ
గ్రాగములఁ దొప్ప దోఁగియు
లాగమునకుఁ జొచ్చి యచ్చలంబునఁ బెనఁగన్. 167

క. దగదొట్టి శౌరిమనుమఁడు
జగతిం బడి మిగులఁ బరవశత నొంద దిశల్
నగులఁగ నార్చి సుచిత్రుఁ
డగలిచెఁ బ్రద్యుమ్నునకు మైదస్త్రములన్. 168

ఆ. అపుడు కర్ణసూనుఁ డాసుచిత్రునిమీఁద
శరము లాఱు గ్రుచ్చి విరథుఁజేయఁ

దెమల కాతఁ డొందుతే రెక్క విలుగుణ
ధ్వని యొసర్పఁ దునిమెఁ దద్రథంబు. 169

క. త్రిశతశతాంగము లీరీ
తి శకలములు సేయ వేఁడుతే రెక్క నిగు
డ్చుశరాలిఁ గర్ణజుని దు
ర్దశఁ బెట్టెను వ్యాధిగణము తనువునుబోలెన్. 170

వ. మఱియును. 171

క. అనుసాల్వ సైదిటను యౌ
వనాశ్వ నొక్కటను భోజవరు రెంట నొగి
ల్చిన సాత్యకి మూర్కొని య
జ్జనపతిరథ్యములఁ దునిమి శంఖం బొత్తెన్. 172

శా. ఆనారాచము మున్ను సాత్యకియురం బాడన్ సుచిత్రుండు నా
నానారాచపరంపరన్ వెగడు సందం జేయ మూర్ఛావశుం
డై నిల్వంబడి లోచనంబు లర మాయం దోన చిత్రాంగదా
సూనుం డేనుశరంబు లేయ నవియుం జూర్ణంబుగాఁ జేయుచున్.

చ. చిఱునగ వొప్ప నిట్లను సుచిత్రుఁడు నీ విపు డింతలోపలన్
మఱచితె బభ్రువాహనుఁడ మాకు నుపాయన మిచ్చుముత్యము
ల్పెఱికలఁ దెచ్చె టంచు నదలించి శిలీముఖవృష్టి ముంచి కే
ళ్లుఱికి మరాళకేతను మహోగ్రశరంబులఁ దూల నేసినన్. 174

సుచిత్రార్జునుల ద్వంద్వయుద్ధము.

వ. అప్పు డప్పాండవసైనికుల కాండతాండవోద్దండ ఖండపరశుండు
నుం బోలె విహరించుతామ్రధ్వజుం గనుంగొని గతప్రాణులై
వదలు కృపాణబాణాసనాదిసాధనంబులు వీరయోధయూధపతురంగ
మాతంగంబులం దొరఁగురుధిరప్రవాహంబులకు జలగ్రాహం
బుల యొఱపు గఱప నాలంబునకు నూలుకొనక నరునిపాలికిం జని
గోత్రవధపాతకనివారణార్థం బశ్వమేధంబు సేయ సమకట్టి మమ్ము

నెల్ల వీని గొంతియలం జేసి తిందు నేఫలంబు గట్టుకొంటి వని ము
ట్టనాడినం గ్రీడి యోడకుండుఁడని వారి నూఱడించి తేరు నైరిస
మ్ముఖంబు చేయించి సాయకనికాయంబుల నతనికాయంబు గా
యంబుగా జేసి విరథునిం జేసినజేసి యతండు వేఱొండురథం బె
క్కియింక నెక్కడవోయె దీసవసైంధవంబుతోడన బంధించుకొని
నిన్నుఁగొనిపోయెద నని వసుంధరాధరంబుపైఁ గంధరంబులువర్షిం
చు చందంబున సంక్రందన నందనునిమీఁద నందంద విశిఖబృం
దంబుఁ గ్రందుకొల్పిన శరవేగంబున నతండాజిరంగంబునకు యో
జనంబు దక్షిణంబున కరిగి యాక్షణంబ తిరిగి నిజబలంబుల సమ
యించునవ్వీరుని దేరితోన తారాపథంబున కెగయుఘోరనారాచం
బులు నఱపి దేవదత్తం బొత్తెనిత్తెఱంగున నెత్తినచలంబున నేడహో
రాత్రింబులు చిత్రవిధంబునం బోరినం బోరు ఘోరం బయ్యె న
య్యవసరంబున. 175

క. నరుచే సుచిత్రుఁ డెక్కుడు
నరదము లిరువేయిజమిలియక్షౌహిణియున్
ధరఁ బడియె నల్ల పౌరం
దరబలములు నట్లమడసెఁ దామ్రధ్వజుచేన్. 176

చ. పలలము సాళువంబు గొనుభంగి సుచిత్రుఁడు క్రీడిఁ దేరితో
నలమి వియత్తలంబు గదియన్ రభసంబున దాఁటి సంగర
స్థలిఁ జదియంగనైన నిజసైన్యము కవ్వడి చచ్చెఁ జచ్చెనం
చలఁగ మురారి గ్రక్కునఁ గరాబ్జమునన్ బడకుండఁ బట్టెనన్.

క. కలుషించి తామ్రకేతుఁడు
పలికె గదాధరునిఁ జూచి పాండవుతో న
చ్చలమునఁ బోరఁగ దొమ్మికిఁ
దలపడితివి నీకు వీరధర్మమె యనుచున్. 178

క. అదిరిపడి వింట భాన్వ
త్ప్రదరము సంధింప శౌరి తామ్రధ్వజునిన్
గదిసి వడి నురముఁ దన్నుచు
గదఁ గొని మస్తకముగాతు కలఁగఁగనడిచెన్. 179

క. అందుఁ జలింపఁక చటుల
స్యందనముం దఱిమి పాండుసైన్యవరుల నం
దంద పరిమార్ప నపుడు ము
కుందుఁడు గాండీవిఁ జేపుకొని యిట్లనియెన్, 180

తామ్రకేతునితో నర్జునుఁడు పోరుట.

చ. దళములు వీనిఁ గ్గొని యథాయథ లయ్యె మరాళకేతనా
దులు సమరస్థలిం బడి రెదుర్కొని నీవుమనేయునితోఁ
దలపడి పోరనున్నఁ బని తప్పు వలదం బని శార్ఙ్గశింజనీ
కలకలముల్ గిరీటికరగాండివరావము నెచ్చరింపఁగన్. 181

క. బరవసముగ శరవిసరము
గురియఁగ నవి దునిమి సరకుఁ గొనక సుచిత్రుం
డిరువురవిలునారులు ని
ష్ఠురగతిఁ దెగనేయ నింద్రజుఁ డుపేంద్రునితోన్. 182

క. ఇన్నిచునకై దేవర
పన్ని పెనఁగ నేల యేన పరిమార్తు ననున్
మన్నించి సారథివి గ
మ్మన్న హరియు నియ్యకొని శతాంగముఁ దఱుమన్. 183

క. అలిగి సుచిత్రుండు పదితూ
పులఁ గృష్ణుని నొంచి పాండుపుత్త్రు నరద మ
మ్ములఁ ముంచి గొడుగుఁ ద్రుంచిన
బలిభిత్సుతుఁ డతనితేరు భగ్నము చేసెన్. 184

క. అరదము రూపఱిన మద
ద్విరదము వెస నెక్కి విశిఖవితతి వఱపఁ ద
ద్గరుదనిలాహతి జిఱజిఱ
హరిహయసుతురథము దిరిగె నాసమయమునన్. 185

క. తమమూర్ఛ లుడిగి కార్ష్ణి
ప్రముఖు లతని నిశితశరపరంపర నొంపన్
దెమలక సుచిత్రుఁ డతివి
క్రమమునఁ దద్ద్విరవరులఁ గలనం గూల్చెన్. 186

క. అందులకుఁ జాల నలిగి ము
కుందుఁడు చక్రంబు కేలఁ గొని పాండుసుత
స్యందనము డిగ్గ నుఱుక ర
వీందుగ్రహతారకములు నిలయుఁ జలించెన్. 187

శా. మాయూరధ్వజ శౌరిఁ జూచి నగి రమ్మా కృష్ణ మున్నాజిఁ గాం
తేయుం గావఁగఁబూని నీసుకృతము న్వెచ్చించి తివ్వేళ నీ
కాయంబున్ దెగనిమ్ము నాయెదురఁ జక్రిం బెత్తితే చూడువా
లాయంబున్నినుఁ గ్రీడినిప్పు డవలీలంగట్టికొంపోయెదన్. 188

క. అనికరి డిగ్గనుఱికి కృ
ష్ణునిచక్రము కేలువట్టినులి వెట్టఁగ న
ర్జునుఁ డచ్యుతుపనుపునా
తనినూఱస్త్రములనొంపఁ దామ్రధ్వజుఁడున్. 189

తామ్రధ్వజుఁడు కృష్ణార్జునుల జయించి
హయంబుఁగొని పురంబునకుఁ బో

క. లెక్కఁగొనక నరుఁగృష్ణుని
నక్కణఁగబిగించి మూర్ఛనొందించిధరన్
గ్రిక్కదలవైచి హయము
న్నెక్కొనఁగొనిపోయి జనకునింగని

క. మొక్కినఁగని నకులధ్వజు
దిక్కుగనుంగొనిన వాసుదేవార్జునులన్
నుక్కించిహయము దెచ్చిన
యక్కథవినిపించె నృపతికాతఁడు తెలియన్. 191

క. వినికన్నులఁగెంపొదవఁగఁ
దనయునివీక్షించి సమరతలమునఁగృష్ణా
ర్జునులనటుడించి తురగముఁ
గొనివత్తురెయింతపటుచు గొడుకవుగలవే. 192

చ. క్రతుఫలదాత యైనహరిఁ గయ్యములోనఁ బరిత్యజించి శూ
రతఁగొనివచ్చి తీమఖతురంగము నెవ్వరిఁగూర్చి చేయనీ
క్రతువిఁకనంచుఁదానుఁగులకాంతయుఁగూడిమయూరకేతుఁడీ
గతివెతఁబొందఁబ్రొద్దుమసకంబడెనంతటఁ బొంచుసై నికుల్. 193

ఉ. జన్నపుమాపుఁగానని విచారపుమోములఁ బకంజంబుల
న్వన్నియుదారమార్గణగణవ్రణజాస్రము సంధ్యపెంపుసం
పన్నతమీజనిద్రియుఁదమంబుఁగ్రమంబునఁజేరమోడుపుం
గన్నులఁగైరవంబులవికాసము దేఱఁగమూర్ఛ దేఱుచున్. 194

క. హరిఁజూచి నరుఁడుమనతో
దురముసలిపినతఁడు సవనతురగముఁగొనియే
తెరవునఁజనె నాకెఱిఁగిం
పు రణంబునగెల్చి వాహముందెత్తు ననన్. 195

ఆ. వీ... కేతుఁ డేలెమురత్న
...నిపుత్త్రిఁడరిగె
...వినా వెంట ర
...మొనలనునిచి 196

♦కృష్ణార్జునులు మాయావిప్రరూపంబుల మణిపురంబు ప్రవేశించుట.♦

సీ. కటిఁబ్రాతముతుక నీర్కావిదోవతిపంచె
భూరిమధ్యమున నూర్ధ్వపుండ్రకంబు
వక్షస్థ్సలమునఁ బద్మాక్షమాలికకర్ణ
బిలముననులివాడు తొలసియెన్ను
నంసభాగంబున నాయువారపుసంచి
దోర్మూలమున నిత్త్రితోలుసజ్జ
కుడికరంబుననలుగుడు వేణుదండంబు
గూనివీఁపునఁ జింపిగొడుగుఁదడక
తే. తనకునలవడ వృద్ధవిప్రనివిధంబు
దాల్చుటయుఁగూర్మి సఖుఁడును తాప్రమసుతుఁడు
బ్రహ్మచారియై తనవెంటరామురారి
రత్ననగరంబు సొచ్చిపూర్వత్రియామ. 197

క. పరిమళ ధూపముజాలక
సరణిఁ బిసాళింప సంతసముతోఁ జూత న
న్నరనారాయణు లిరువురుఁ
జరియింపఁగఁజంద్రకాంత సౌధములందున్.  198

చ. సురతసుఖంబులన్ మిగులఁ జొక్కుచు నొక్కవిటుండు కాంతనీ
కురులకుఁగృష్ణవర్ణమునుగుంకుమగుబ్బలకచ్యుతత్వమున్
దొరకెననన్ని జేశుకరతో యరుహంబుఁదెమల్చి నిన్న నీ
కరములశంఖచక్రములుగా పురుషోత్తముఁ జేసెనావుమన్.  199

క. సరసిజలోచనుఁ డిట్లను
హరిహయసుతుతోడఁ జూడు మాశ్చర్యం బీ
పురజనముభక్తి సురతపు
పరసతలను మామకప్రశంసలె యొపుమన్.  200

క. తలఁపులు హరిచింతనములు
పలుకులు హరికీర్తనానుభవములు పరిపా
టలుహరికృత్యంబులు భూ
తలవైకుంఠంబు పొగడఁదగు నిదియనుచున్. 201

ఉ. వేడుకతోడ నన్నగరవీథుల నీగతి సంచరించుచుర్
గ్రీడియుఁదాను వేడుకవతరిక్ జనినర్మదలోన మజ్జనం
బాడిగమించి చొచ్చెనుదదంతిక రాజమరాళ కూజితా
మ్రేడితకింకిణీరవపరిష్కృతఘోటము యజ్ఞవాటమున్. 202

క. చొచ్చితదాస్థానమహిమ
కచ్చెరు వందుచువియచ్చరాహ్వానోద్గా
తృచ్చరితసామ మంత్రము
ఖోచ్చధ్వను లంతరిక్షు మూటాడింపన్. 203

మ. క్రతుదీక్షాపరువిశ్వభూవలయు సమాక్రిష్మౌళి మాణిక్యభూ
షితపాదాంబుజు ఋత్విగావృతుఁగుశాసీనుర్ వధూసంయుతుర్
గితవబ్రాహ్మణులిద్దఱుంగదిసికెంగెలెత్తి బ్రహ్మధ్వజ
క్షితినాథోత్తమ భద్రమస్తుసుచు నాశీర్వాదముం జేసినర్. 204

క. ఆనరనాథుఁడు పరిత్యా
స్థానంబొనరించి మొక్కిధరణీసుర ము
న్నేనతి గానింపమును
పేననుదీవించి టిది శపించుట గాదే. 205

క. ఎందుండి యరుగు దెంచితి
విందులకేజేయుసేవ యెద్దియనమహీ
బృందారకుండు పరమా
నందహృదయుఁడగుచు ధరణినాథునితోడర్. 206

క. భూవల్లభ కార్యార్థుల
మైవచ్చుటఁజేసి మాకు నాశీర్వాదం

బీవలసె నమస్కారము
గావింపకమున్న యెగ్గుకాదిది యనినన్. 207

క. జనవరుఁడు పురాణములం
ధనఘా 'యభ్యాగతస్స్వయం విష్ణు'వనా
వినఁబడు నినుఁజూచిననా
జనార్దనునిఁజూచినట్లు సంతసమయ్యెన్. 208

క. కొంచక వేఁడుము తగన
ర్పించెదనిపు డెద్ది నీయభీష్టము నాకుఁ
గించిత్తయిన మనోరథ
వంచనమిచ్చోటలేదవశ్యం బనినన్. 209

సీ. భూపాలవిను ధర్మపురినుండు కృష్ణశ
ర్మాభిధానుఁడ మదీయాత్మజుని వి
వాహంబునకు నీపురోహితుండు సుశీలు
నింటఁగన్నియ గల్గుటెఱిఁగి యడుగఁ
బయనమైవచ్చుచో భయదాటవీమధ్య
సీమ నాకలి గొన్న సింహ మొకటి
కవిసి పుత్త్రుని ఘోటకముఁగూడఁ బట్టిన
విడిపింపనా కొండు వెరవులేక

తే. చింతతో 'నటవ్యాంనారసింహ'యనుచు
నూటయెనిమిదిమాఱు లెన్నుకొనివరుస
నలఁతఁగుత్తుక యెండగా నవ్విభుండు
గరుణఁబుత్త్రయుక్తుమైనన్నుఁ గావఁడయ్యె. 210

వ. ఇవ్విధంబున మహావ్యథం బరితాపించుచున్న నన్ను రూక్షేక్షణంబుల నిరీక్షించుచు హర్యక్షంబు వాలవిక్షేపణంబుల నధిక్షేపించి పుత్త్రగాత్రంబు నఖరదంష్ట్రాంకురంబుల నప్పళించుచు మనుష్యభాషణంబుల గర్జించుచు నన్ను నుద్దేశించి నాచేఁ బడిన జంతువుం

గృతాంతునంతవానికైన బలవంతంబున విడిపింపనీఁతబంటెశిష్యుం డును నీవునింటికింజనుండని నిరాశంబుగాఁ బలికినఁగ్లేశంబున నా శిశువుంబాసి పోవంజాలక బాలకవిహీనులగుమానవులకు నూర్ధ్వదైహికంబులు లేవుగావున నీవుమచ్ఛరీరంబు కబళంబుగొని సుతశరీరంబు విడువుమనిన విని యక్కంఠీరవం బకుంఠారవంబున మావంటి దుష్టజంతువు లాపన్న మృత్యువునకు మూలభృత్యులగుటంజేసి యిట్టిగతాయుషప్రాణులంగాని మీవంటి దీర్ఘాయుః ప్రాణులం బట్టముబట్టి కొఱకింతపట్టి పెచఁగి నట్టినురస్థలంబూరలక మరలు మనిన మత్కృతంబు లగుసుకృతంబు లర్పించెద నెప్పాట నిప్పావని నొప్పింపకనాకునొప్పింపవే యనిన నీయకొనక నీయెడనాకు నయ్యెడు ప్రయోజనంబు లెయ్యవియు లేవు మయూరధ్వజునివలనం గానియనియె నది నీవంగీకరించెద వేని నెఱింగించెద ననిన భూసురోత్తమునకు రాజసత్తముం డిట్లనియె. 211

క. ఆకేసరి నరకేసరి
గాఁకున్నమదీయ దేశకాననగిరులన్
భీకరహరిదర్వీకర
సూకరనికరముల కెట్లు సుడియఁగవచ్చున్. 212

క. అడిగినపదార్థ మెల్లను
దడయకనీకిత్తునని మొదల నాడితి నా
నోడువువృథ గాఁగవలసిన
వడుగుమునివన్న భూసురాగ్రణి విభుతోన్. 213

క. నీయెడ మముబోంట్లకు నే
లాయేసంశయము దుర్బలస్య బలంరా
జా' యనిపలుకువిశిష్ట
న్యాయముగలుగుట మదార్తిహరియింపఁ దగున్. 214

క. ఆసింహము నీదేహము
దాసగ మిచ్చినఁ గుమారుదండింప నసర్
గాసిలి రాజులతనువులు
గోసిమ్మనఁదగునె ప్రాణుకొని విప్రులకున్. 215

ఉ. నావుడుసింహమిట్లను మనంబున నన్నరనాథచంద్రిముర్
గేవలుఁగాఁదలంపకు మకించిన రక్షణశీలుఁ డాత్మవి
ద్యావిదుఁ డుత్తమోత్తముఁ డుదారుఁడుసూనృతవాది గావునర్
నీవిటుపంశయింప కతనింగని వేఁడు ఫలించుగోరికల్. 216

క. నీతనువుముదిసి తపముల
చేతఁబలలశూన్యమై కృశించి దాధా
తీ్రితలపతిగాత్రము నవ
నీతసమము బహుసుఖ ప్రణీతంబగుటర్. 217

క. ఇది సింహభాషితము ము
న్న దశరథాత్మజుఁడు బ్రాహ్మణుని మృతశిశువుం
బ్రదికింపఁడె రాముఁడకే
కొదనీవెట్లయిన బుత్రకునిఁ గావుమనర్ 218

సీ. కువలయేశ్వరుఁడియ్యకొనిమంత్రిహితపురో
హితబంధుజన మహీపతులఁజూచి
రాజునకర్హంబు రణముసంద్దైన
బ్రాహ్మణునెడనైన దేహంబువిడువ
మునుసిబికర్ణజీమూతవాహలుపరా
ర్థముకాదెనిజశరీరములువిడిచి
రేనీమహాత్మునకైనా తనువులోన
నర్థమిచ్చితిదీని కడ్డపడకు
తే. డని సుచిత్రుని సకలరాజ్యాభిషిక్తుఁ
గాఁ బ్రతిష్టించి మేఖలకన్యకాంబు

వులఁగృతస్నానుఁడై దానములుబహువి
కారములఁజేసి విప్రపుంగవునిఁబిలిచి. 219

రాజు విప్రకార్యార్థంబు వనశరీరంబు నిచ్చుట.

క. పూతజలాక్షతములు గొని
దాత 'మదీయార్ధ దేహదానేనహరిః
ప్రీతో భవ' తనిభూసురు
చేతనృపతి ధారవోసి చిత్తమెలర్పన్. 220

ఉ. పత్రివితర్థికాస్థలి విశంకదృఢాసనుఁడై ముకుందుపై
కత్రియవందితుఁ డ్హృదయకంజమునం బదిలించి కేతకీ
పత్రిమఁలీలమాళిఁ గరపత్త్రము పూనెఁమనంతఁ బుణ్యచా
రిత్రి కుముద్వతీసతి యెఱింగివడిన్ జనుదెంచివాక్యతోన్. 221

క. నీయర్ధశరీరము కా
నాయేనుమదీయదేహ మర్పించివిజం
బీమెడనిలువు మనిన విని
యాయువనీసురుఁడు పలికె నధిపునితోడన్. 222

క. సింగమునాతో నృపవా
మాంగముస్త్రీభాగ మదియసర్హామభుజియిం
పంగాఁగాదనె నీవు
న్యాంగనతను విచ్ఛగింప దమ్మ్యగమనినా. 223

సీ. సుతుఁడైనతామ్రిధ్వజుఁడు శాంబరీవిపు
నకునిట్టులనియె వందనమొనర్చి
భూసురయోపితాస పుత్త్రి,యటంచు
ననియెనుశుభ్రితి రహస్యంబువినవె
జనకునిదేహంబుసగ మేలనా శరీరము
సింహామునకు సర్వంబునిత్తుఁ

దశయ కేనునుబుణత్రియ విముక్తుండనై
తండ్రిగైకొన్న సత్యంబునెఱపి

తే. శాంతనవరాఘవులకీర్తిఁ గాంతుననిన
బ్రాహ్మణుఁడుపల్కు మృగరాజుపలుకువినుము
రాజదేహంబుఁ దక్కఁశతింబుసుతుఁడు
గోయవలెననెనదిగల్ల సేయఁదగునె. 224

తే. అనిన దరహాసితాస్యుఁడై యవ్విభుండు
సుతునిఁ దనరాణివాసంబుఁజూచి యట్ల
చేయుఁ డని చేతఁ బంపమిచ్చిన సుచిత్రుఁ
డందనోడెఁగుముద్వతియుందుకొనియె. 225

వ. అట్లందుకొని. 226

లయగ్రాహి. ఆరమణియుం దనకుమారకు నదల్చి యతి
దారుణతరక్రకచధారపతివారాళిం।
జేరిచిమదిఁ హరిహరీ రఘుపతీ యనుచు
వారిరువురుఁ దఱుగఁగారుధిరముల్ ధా।
తీరమణుగాత్రమున మేరుశిఖరిం దొరఁగు
గైరికఝరంబుల ప్రకారముగ హాహా।
కారములుచేసె హితసూరిజనబంధుపరి
వారనికరంబులు మహారవముతోడన్. 227

ఉ. ఇమ్మెయి వ్రక్కలింప ధరణీశ్వరుఁడాపలికంట బాష్పతో
యమ్ములు గ్రమ్మఁ గన్గొని ధరామరుఁ డిట్లను నార్తినిచ్చుదా
నమ్ము పరిగ్రహింపఁ దగునా యనపత్యతవంక నూర్ధ్వలో
కమ్ములు లేకపోయిఁ బొకాలఁగనిమ్మని యగ్గి పోవఁగన్. 228

తే. కాంత పాత్రికేశమస్తంబుఁ గదియఁ బెట్టి
యకట నీదేహ మూర కిట్లయ్యెఁ గాని

బ్రాహ్మణుఁడు నిన్ను లేనినెపంబు వెట్టి
యలిగిపోవుచు నున్నవాఁడన విభుండు. 239

మ. అప్పు డావిప్రునిఁ జూచి యిట్లను మహాత్మా మచ్ఛరీరంబులో
నపసవ్యాంగము దానయోగ్య మయి సవ్యాంగంబు గాకున్న దుః
ఖపడెన్ అంపమునొప్పి నైన నిరువంకం బాష్పముల్ రావె స
త్కృప నీభాగముఁ గొమ్మనన్ విజయుతోఁ గృష్ణుండు ప్రత్యక్షమై.

కృష్ణార్జునులు స్వస్వరూపంబులతో ప్రత్యక్షం బగుట.

శా. ఆరాజన్యునిఁ గౌఁగిలించి ధరణీశా నీవు ధన్యుండ వీ
ధీరత్వంబునకున్ వదాన్యతకుఁ బ్రీతిం బొందితిన్ బుత్త్రసా
ధ్వీరత్నంబులతోడ నధ్వరము వీతద్వంద్వయుక్తంబుగాఁ
బ్రారంభింపుము కర్మకర్తనయి నిర్వర్తింతు నే సర్వమున్. 231

క. పోర నెదిరి భయసేయకు
మారుం డొక్కరుఁడె గెల్చె మమునిద్దఱ నీ
వీరీతి దేహ మొసఁగితి
వేరీ మీసాటివీరవితరణగరిమన్. 232

చ. అనిన నృపాలవర్యుఁ డను యజ్ఞఫలప్రదుఁడైన దేవరం
గనుఁగొనఁ గల్గె నేటికి మఖం బొనరింపఁగ దప్పిగొన్నమ
ర్త్యునకు మనోహరాంబువులు గ్రోలక మంచున దాహ మాఱునే
ననుఁ బ్రహసింపవే బుధజనప్రవకోదితవేదమంత్రముల్. 233

తే. నేర్పు దప్పి నిధానంబు నేలఁ గ్రుమ్మ
రించి కొప్పెర దెచ్చు వీఁడెఁ డివిధమున
నాకుమారుఁడు మిమ్ము జన్యమున నెఱుఁగ
లేక వాహంబుఁ దెచ్చె వివేక ముడిగి. 234

క. ఊహింప మర్త్యకోటికి
దేహము లస్థిరము లగుట దెలియఁగ నిక్కం

బీహారిఁ జేపట్టికదా
శ్రీహరి నినుఁ గంటి హరిహరీ కృతి నైతిన్. 235

క. శరధిచరకమఠకిటినర
హరివామనభృగుజరామహలభృజ్జినక
ల్కిరుచిరరూపాయ జగ
ద్భరణాయ నమోనమోస్తు భవతే యనుచున్. 236

వ. బహుప్రకారంబులం బ్రస్తుతించి సమస్తవస్తుజాతంబుల నమ్మురహరుం దు నానందితుం జేసి పురందరనందనుం గౌఁగిలించి బంధుజనసమన్వితుం డై నిజపురంబునకు దోడ్కొనిపోయె నందు నగ్గోవిందుండు గాండీవికి మయూరధ్వజునిభక్తిఁ దెలుప వలసి బలసమన్వితంబుగా దివసత్రి యం బధివసించె ననిన విని జనమేజయుండు జైమినిం గనుంగొని తరువాతివృత్తాంతం బానతీఁ జిత్తగింపు మని యడిగిన 237

శా. పాంచాలద్రవిళాంగమాళవశకప్రాగ్జ్యోతిషక్షోణిభృ
త్పంచాస్యప్రతివర్షదత్తవివిధోపగ్రాహ్యరత్నాంశుమ
త్కాంచీవేంకటకాళహస్తినగరీకల్యాణసౌధాంచల
ప్రాంచచ్ఛాసనసాళ్వశంకితశశప్రాలేయరుఙ్మండలా. 238

క. రాధాజనూజశిబిధా
రాధరకల్పద్రుఖేచరప్రకటయశో
గాధాధికకణకృతసం
ధాధికర్ణదానశౌండ మైనవరగండా. 239

భుజంగప్రయాతము.

స్థిరశ్రీమనోహారిశృంగారగేహా
గిరీశప్రభాభాసికీర్తిప్రవాహా
నిరూఢారిబాహాసినిర్వాపనేహా
రిరంసోగ్రవాహాధరిత్రీవరాహా. 240

గద్యము. ఇది భారతీతీర్థశ్రీచరణకరుణాపాత్రగాదయామాత్యపుత్రప్రవిన యవిద్యా సముద్రపినవీరభద్రప్రణీతం బైన జైమినిభారతంబునం దశ్వమేధపర్వంబున సప్తమాశ్వాసము.



శ్రీ

# జైమినిభారతము



## అశ్వమేధపర్వము, అష్టమాశ్వాసము.



శ్రీ లలితశ్రవణకళా
నాళీక పరిభవపాదనఖచంద్రరుచి
క్షాళితపరసరపాలక
ఫాలఫలక నారసింహపార్థివతిలకా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రునకిట్లని
యె నిత్తెఱంగున రత్నసగరంబున వాసుదేవవాసవతనూజులు వాస
రత్రయంబు గడపి మఱునాఁడు సముద్ధతధ్వజినీపరంపరలతో మ
యూరధ్వజుండుఁ గొలిచి రా నధ్వరాశ్వంబులఁ గదలింప నవియు
నానాజనపదంబు లతిక్రమించి క్రమక్రమంబున. 2

సీ. ఏరాజు పాలించు ధారణీమండలి
ధర్మంబు నాల్గుపాదముల నడుచుఁ
గలవరించియు బొంకు పలుక నేగనిసత్య
సంధు లేరాజురాష్ట్రంబుప్రజలు
యముఁ డిల్లఁ టవుటల్లుఁడై యుండి సాక్షా
త్కరించియేరాజపుత్త్రిక వరించె
నేరాజు దానాంబుధారాధునీకోటి
చేత మేదిని నదీమాతృక య్యెఁ
తే. దత్పరత, బ్రాహ్మణోమమదైవ, మనెడు
బుద్ధి నేరాజు పూజించు బుధుల నట్టి

రాజరత్నంబు వీరవర్మకుఁ బ్రిథాన
పురము సారస్వతముఁ జేరఁ బోవుట యును.

క. ఈరీతి ధర్మతనయు మ
యూరధ్వజయజ్ఞవాహయుగళవిహారం
బారా జెఱింగి తనపరి
వారము సెల విచ్చె వారు నంబులఁ బట్టన్. 4

వీరవర్మ పాండవహయంబుఁ బట్టుట.

తే. అపుడు దివ్యథారూఢులై సులోల
కువలయులలాక్షు లారాజుకూర్మిసుతులు
సైన్యములతోడ నరుదేర నరకుఁగొనక
హారులఁ బట్టింపబభ్రువాహనుఁడు దాఁకి 5

క. వాహనుల నిష్ఠురాస్త్రస
మూహములఁ దెరల్చె నపుడు ముష్టాముష్టిన్
బాహాబాహిఁ గచాకచి
నావాహ మొనరింపఁ జొచ్చె నయ్యిరువాఁగున్. 6

శా. శక్రిప్రోద్భవసూతిపై దశసహస్రస్యందనాన్వితులై
విక్రాంతిన్ నృపనందనుల్ గవిసి రన్వేళన్ సమీకంబు రు
ద్రిక్రీడన్ దలపింపఁ గార్ష్ణివిశిఖవ్రాతంబుచే వీతిహో
త్రిక్రోడంబునఁ బద్ధచర్మముగతిన్ మర్గెన్ బలం బత్తఱిన్. 7

క. అంతకుఁడు గదిసి సేనల
నంతముఁ బొందింపఁ గ్రీడి యచ్చెరువడి కం
సాంతక చూడుము వీఁడు దు
రంతపరాక్రముఁడు మర్త్యుఁ డనరా దనినన్. 8

ఆ. జముఁడు వీరవర్మజామాత నృపతికూఁ
తురు సుమాలిసీవధూటిమగఁడు

రాజుచేత నితఁడు ప్రార్థితుండై పాసి
చనఁడు తద్విధంబు వినుము తెలియ. 9

ఆ. వీరవర్మ వరకుమారి సుమాలిని
పెండ్లి కేమిఁగఁ దండ్రి బిడ్డఁ జూచి
తల్లి యే నృపాలతనయుఁడు నీకోర్కె
యనినఁ నరులమీఁద మనసు లేక. 10

కృష్ణుఁడు విజయునకు యమునివృత్తాంతంబు చెప్పుట.

చ. జనులకు నెల్లఁ జావు సహజంబు నరున్ వరియించి వానితో
ననుగమనం బొనర్చి తుది నంతకుచేఁ బడి పాపకర్మసం
జనితఫలంబు లంది బహుజన్మములం బనుకంటె కాలునిం
బెనిమిటిఁగా వరింతు నది మిక్కిలిధర్మము నాకు నావుమన్. 11

చ. అలరి సుమాలి నీతనయ కంతకుపైఁ దలపంత కంతకుఁ
బలియు బెఱిఁగి నిచ్చలు నుపాసనకై యమసూక్తముల్ విని
శ్చలితఁ బఠింపఁ దత్సుతయుసంతతముఁ జముఁగూర్చి నేమముల్
సలుపఁగ నారదుం డెఱిఁగి నాయమనీపతిఁ గాంచి యిట్లనున్. 12

క. చిత్రపురి వీరవర్మని
పుత్త్రి సుమాలిని విలాసభూమి కమలినీ
మిత్రతనూభవ నీకుఁ గ
ళత్రము గావలదె యాలలన యని మఱియున్. 13

ఉ. ఆసతి పుణ్యశీల హరిణాయతలోచన నిన్నుఁ బొందనా
నాసలఁ జేయుదానను లనంతను లింతిఁ బరిగ్రహించినన్
నీసవ తెవ్వరున్నను మునీ భవదాజ్ఞ యలంఘనీయమం
చాసమవర్తి నవ్వి చతురాస్యతనూభవుతోడ నిట్లనున్. 14

తే. నీవు ముందఱ నెఱిఁగింపు నృపతి కేను
గదలి వైశాఖశుక్లపక్షమున వత్తు

ననిచఁ జని నారదుఁడు చెప్ప నచటవీర
వర్మ సంభ్రమపడియె వైవస్వతుఁడును. 15

క. దళవాయి రాజయక్ష్మం
బిలిచి మనము చిత్రపురికిఁ బెల్లికిఁ బోనవ్
వలె నీబలఁగము నీవుఁగ
దలి రమ్మని పలుక నులికి తత్సభ పోనన్. 16

సీ. ఆమయాగ్రణి రాజయక్ష్మ ధాతువులు వీ
డ్వడి తాఱఁ బెదవులు దడపుకొనియె
నష్టోత్తరశతవ్రణాధ్యక్షుఁ డగు రాజ
పిటకునకును వీఁపు నెటుకు రనియెఁ
దల్లడంబునఁ దత్ర్యోదశవిధజ్వరునకు
విన్నమాత్రన వెఱవేఁకి దాఁకె
నుల్ల మెల్లను బెల్లగిల్లె వింశతిరూప
ధారిమేహునకు విదాహ మొదవె

తే. నచట నిపాత్రజ్ఞులె కాని హంత లేమి
గుణనిధులె కాని గురుదూషకుండు లేమి
సదయులే కాని బాలహింసకుఁడు లేమిఁ
బూజకులె కాని దేవస్వభోక్త లేమి. 17

వ. మఱియు విశ్వాసవిషదాన కన్యకాగమన స్వరక్ష్యభక్షణ లక్షిత త్రిశతభేద విశాలుండగుశూలుండు చోరకానిరుద్ధ పంజరస్థపక్షి మోచకులు గలుగుటం బొలయ రాదనియు వాపీకూపతటాక భేదనంబులవణిగల గ్రహణిజీర్ణ జలాశయోద్ధారకులు మీఱుటను రాసమకూఱ దనియు సాధుజన బాధానముద్భూతంబగు వాతంబు మానమేరుతైలవాపీదాన తత్పరులు దఱచు గలుగుటం దఱియఁ గూడదనియు భ్రూణహత్యా కృతాదరుఁ డగు మహోదరుం డుదక దానావధానులు చెంగలించుటం దొంగిచూడరాదనియు దాత్రుని

దాకందళిత శరీరుండగు నపస్మారుండు కృష్ణధేనుదానపరులు హెచ్చుటంజొచ్చి మెలఁగరాదనియు నివ్విధంబున సకలరోగ విసరంబులుగుసగుసలంబోవ సమవర్తి వారలం గనుంగొని. 18

క. పాపులకు నుగ్రవిగ్రహు
లై పుణ్యుల కమలమూర్తులై యీరు మహిన్
జూపట్టెద రేటికిఁ బగి
తాపమిపుడు కామరూపధరులగుఁ డనుచున్. 19

ఉ. మోహనమూర్తి గైకొని యముండు నరాకృతి సంగతామయ
వ్యూహము గొల్వ చిత్రపురి కుత్సుకతంజని మాలినీవరా
రోహ వివాహమై నగచరుఁగని నీకు నభీష్ట మొద్ది సం
దేహములేక వేఁడు కరుణింతు ననన్ ధరణీశుఁడిట్లనున్. 20

చ. ఇతరవరంబు లెవ్వియును నేటికి నత్యయవేళ దేవకీ
సుతుని పదారవిందములు చూపు మనన్ దయచేసి మామచిం
తితము ఫలించు సంతతము నిల్చిన యంతకుఁడీతఁ డాజిదీ
క్షితుఁడయి వీరవర్మయును సేనలతో నిట వచ్చెఁ గావునన్. 21

వ. ఇత్తఱి నమ్ముత్తుంగ మత్తమాతంగ నినాదభయదయుద్ధంబు సిద్ధంబు గాఁగలదు నీవు వేడుకచూడవలయు బలియురైన బభ్రువాహనానుసాల్వకర్ణ జప్రద్యుమ్న మయూరధ్వజానిరుద్ధాది యోధవీరుల సన్నద్ధులంజేసి పోరికిం బనుపవలయునని పలికి కృష్ణుండు జిష్ణురథం బారోహంబుసేయ నవ్వీరవర్మయుం గదిసి వారిజోదరుం బేరుకొని పురందరనందనుండును నీవును మదీయశౌర్యంబును ధైర్యంబునుం గనుంగొనుండని పుండరీకలోచను నాఱునారాచంబులం గ్రిడి నేనుపాలమ్ములను మయూరధ్వజాదుల నైదైదు బాణంబులఁ గంరగతప్రాణులంజేసిన జేసి వాసవసుతుండు నవ్వీరవర్మ మర్మంబులు దూటిపాఱఁ గఱకుటమ్ములు వఱపినఁ బిఱుతివియకతండు తెఱపిగొని మాధవ ధనంజయుల విశిఖపుంజంబులం జిక్కుపఱచి సజలజల

ధరంబువిధంబునగర్జింప నర్జునుండు దోర్గర్వంబునఁ దచ్ఛరవ్రాతంబు జర్జరీభూతంబు గావించి సారస్వత పురాధీశ్వరువక్షంబు నిశితక్షుర ప్రపంచకంబునం జించిన నతం డించుకేనియుం జంచలింపక విస్ఫు ర్చ్ఛ నఱువదింట నచ్యుతాంజనేయుల సాయకశతంబుల నొంచి తేరివారుపఁబులం దక్కినవీరవరులం దెరలిచి మొనతలఁ దరలం బోరల నేసినఁ బాండవసమూహంబు సమోహంబయ్యె నప్పుడప్పు రుషోత్తముండు గాండీవిం గనుంగొని. 22

ఉ. వంచనచేసి సైంధవుపివాహములో శిశుపాలునట్లు న
మ్మించి రణంబునం గమలమిత్రజుతేరు ధరిత్రిఁ గ్రుంగఁ ద్రొ
క్కించి జయించినట్లిచటఁ గృత్రిమముల్ గొనునంచు మారుతిం
బంచినఁ దేరితో నతని బద్ధునఁ జేసివిశాలవాలధిన్. 23

క. ద్రోణాదిఁ బెల్లగించిన
త్రాణ నతనియరద మంబరంబునకు జగ
త్ప్రాణజుఁ డెత్తుకచననా
క్షోణీశ్వరుఁ డతని మొఱఁగి చూపఱు బెదరన్. 24

చ. రయమునఁ దేరితో నరు మురద్విషునిం గుదియంగఁ బట్టి ని
ర్భయగతి నభ్రముం దఱిసి పావనితో నను శౌరి పార్థుపై
దయ నెడఁబాసి రా విరహతాపమునం బొరలాడులక్ష్మికిం
బ్రియముగఁ బట్టివై చెద హరిం గలశాంబుధిశేషశయ్యపై. 25

క. విను నారథ మని హరిఁ గ
వ్వడినిన్ నడిఁ జంక నిఱికి వాయుతనూజుం
బిడికిటఁ బొడిచిన గ్రుడ్లును
మిడుకఁ గెడసి కాలుచెయ్యి మెదలుప కున్నన్. 26

—♦ వీరవర్మ కృష్ణుని తనపురంబునకు దోడ్కొని పోవుట. ♦—

క. అప్పుడు మధుమథనుఁడు వా
తప్పక నవ్వీరవర్మతల పాదమునన్

గుప్పూనఁ దన్నిన ధరఁ బడి
తెప్పిఱి కృష్ణార్జునులఁ గదిసి యిట్లనియెన్. 27

సీ. బవరాన దేవదానవుల కైనను నవి
జేయుండ మును విశేషించి యిపుడు
కృష్ణునిపాదపంకేరుహంబు శిరంబుఁ
జెందెఁ గావునఁ జిరంజీవి నైతి
ననుటయుఁ బ్రీతుఁడై యాచ్యుతుండును కిరీటి
తోడ నిట్లను వీఁడు దుర్జయుండు
సత్త్వసంపన్నుఁ డక్షయదివ్యమార్గణ
కృతహస్తుఁడు మయూరకేతుముఖ్య
తే. యోధుల జయించె మద్భక్తియుక్తుఁ డనిన
నరుఁడుగొనియాడెనమ్మహీపరుఁడువారి
కిట్టు లను ముజ్జగములు మీకెదురుగావు
మిమ్ము గెలువంగ నేనెంతమేటి ననుచు. 28

క. విల్లెక్కుడించి యదుకుల
వల్లభునకు మ్రొక్కి వాసవసుతు ముదమునం
దిల్లఁగవుఁగిలింప బలము లెల్ల
నిలిచెనతనివీట నేనుదినంబుల్. 29

ఉ. ఆమఱునాఁడు సప్తతిసహస్రి సితేభములున్ దురంగముల్
శ్యామలకర్ణముల్ నవసహస్రిము లష్టవిధంబు లైనము
క్తామణిరాసులున్ మొదలుగాఁ గలసంపద లెల్లనిచ్చియ
త్తామరసాక్షుఁ గొల్చివసుధావరుఁ డశ్వములం దరల్చినన్. 30

క. కతిపయదినములకు హయ
ద్వితయము గజకబళవప్రివీణరఘుమగాప్రి
హతిమితిమింగిల లహరిహా
సితజలనిధి యగుపదంబు జివ్వునఁ దాఁకెన్. 31

ఆ. క్రీడివీరవర్మతోడ హయంబులు
సరసిదాఁటె నెద్దివెర వటన్న
సతేఁడు నావలను రయంబునుదాఁటింప
సేనకొంతలంబుఁ జేరివిడిసె. 32

క. అచ్చటహరులం గానక
ఱిచ్చవడిదొరలు నిలుచుతఱిఁ వెలుఁగుచువై
యచ్చరపదమున సురముని
వచ్చి నమస్కృతులుగాంచి వారలతోడన్. 33

చ. హయములుచంద్రహాసవసు ధాధిపుకొంతలకంబుఁ జేరుదు
ర్జయుఁడగునాన్నృపాలుని పరాక్రమలీలకు రాజు లెల్లనా
రయసరి షోడశాంశమును రారుతదీయచరిత్ర మన్న వి
స్మయమిదివేళ గాదువిన సైంధవముల్ గనుదూర మేగెడున్. 34

చ. అనుటయు బార్థుఁడిట్లను బ్రియంబున నారదశౌరి చెప్పమున్
వినమె కథాసుధారసము వీనుల కింపుగఁ బోరిలోన స
జ్జనులచరిత్రముల్ వినుట జన్మఫలంబులు గావె చంద్రహా
సనృపవరేణ్య పుణ్యకథ సత్కృప నా కెఱిఁగింపు నావుడున్. 35

◆ నారదుఁడు చంద్రహాసుని వృత్తాంతంబు దెల్పుట. ◆

సీ. వినుకేరళాధీశ్వరున కాత్మజుఁడుసభాగ్యుఁడు
మూలతారయందుదయమయ్యె
నొకకొన్నిదివసంబులకు వైరులనెదిర్చి
జనకుండుమగండదోషమునఁదప్ప
జనయిత్రిచిచ్చుఱికిన దాదులాబాలకునిఁ
గొంతలమునకుఁ గొంచువచ్చి
వర్షత్రయముపెంచి వారంతరించినఁ
బౌరిభామినులాతనిమారుఁజూచి

తే. కరుణ నొకపుణ్యసతి జలకంబుఁ బట్టుఁ
గూర్మి నొకలేమ కడుపారఁ గుడువఁబెట్టు
దయ నొకధూటి మొలవన్నె తడుపుఁ జుట్టు
కోర్కి నొకయింతి కూఁకట్లు జూడఁ గట్టు. 36

క. ఈరీతిఁ బౌరకాంతలు
గారవమునఁ బెనుచుండఁగా నొక్కదినం
బారాకొమరుండు యదృ
చ్ఛారతిఁ జనె దుష్టబుద్ధిసదనంబునకున్. 37

క. ఆమంత్రి కొలువులోనిమ
హామును వీక్షించి ముదితులై యెవ్వరివాఁ
డీముద్దువాఁడు నిఖిల
క్ష్మామండల మేలు రేఖ గలవాఁ డనిరన్. 38

క. వినివినని వానిచందం
బున గీటునఁ బుచ్చి దుష్టబుద్ధి యతుల స
ద్వినయమున ననిపి యపుడా
తనయునకును ఋషులపలుకు తథ్యంబనుచున్. 39

క. దండింపఁ దలఁచి యప్పుడు
చండాలభటాలిఁ బిలిచి సచివుఁడు మీరీ
కొండికపాపని బలివా
రుండని నెలవొసఁగఁ గింకరులు రభసమునన్. 40

ఉ. పట్టి మదేభసింహశరభప్రముఖోగ్ర తరాటవీతటిన్
బెట్టి కృపాణిఁ బాణి వలిపింపఁ గుమారుఁడు శౌరి నెమ్మదిన్
గట్టిగ నిల్పనప్డు గొడ్కాండ్రు కృపన్ వలకాలిపిల్లవ్రేల్
ముట్టఁగఁ గోసి మంత్రివరు ముందటఁ బెట్టి కృతప్రణాములై. 41

క. దేవర చెప్పిన యుడిగము
గావించితి మనిన మంత్రి శౌష్కహృదయుం

డై వరమునిభాషితము మృ
షావాదం బయ్యెనని విశంకత నుండన్. 42

చ. అచటఁ గుమారుఁ డంఘ్రివికలాంగుఁ డై ఖేదముఁ బొందుఁ జాలసం
కుచితముఖాబ్జుఁ డై పదశకుంతమృగీవశ దేవతల్ దయా
రచితహితోపచారములరక్షణసేయఁ గుళిందకుండు త
త్సచివునకున్ విధేయుఁడగు శాబరదేశవిభుండు వేఁటకై చనన్. 43

ఉ. అక్కడికేఁగుదెంచి చరణాంగుళివేదనఁ జాలఁ గుందియున్
సుక్కక శ్రీహరిం దలఁచుసూనునిఁ జూచి కృపాసమగ్రుఁ డై
యెక్కడివాఁడవో పీఁడు జగదీశ్వరలక్షణలక్షితాకృతిన్
జక్క నిపిన్న వాఁడనుచు సైంధవమున్ డిగిబుజ్జగించుచున్. 44

క. హరిభక్తుఁ డితఁడు నేనును
హరిపదసేవకుఁడ నయ్యు ననపత్యుఁడనై
హరిఁ బలుమఱు సొలయఁక శ్రీ
హరినాకిటు కరుణ చేసె నర్భకుననుచున్. 45

క. కుండుఁడు కానీనుఁడు కృత
కుండు సహోఢజుఁడు గోళకుఁడు క్రీతుఁడు ప
త్త్రుండు స్వయంప్రాప్తుఁడు సూ
నుండౌరసహీను లగుజనుల కట్లగుటన్. 46

క. ఇతఁడు స్వయంప్రాప్తుండను
సుతుఁడని యంగీకరించి శోకము వారిం
చితురంగముపై నిడినం
దితుఁడై తనచందనావతీపురి కరిగెన్. 47

సీ. అరిగి సైనికుల నర్హప్రకారంబుల
బనిపియంతఃపురం బునకు
జ్యోస్యులయనుమతి శుభముహూర్తం
రాణిమేధావినీ రమ

చంద్రునిసవ్వహాసంబు గల్గుటఁజంద్ర
హాసుఁడనెడునామ మర్థిఁబెట్టి
దాదులచేనిరంతరము సంరక్షణ
చేయింపఁగట్టడ చేసివేడ్కఁ

తే. బెనుపఁగాఁ దల్లిదండ్రులు ప్రేమమునను
విదియచంద్రునిగతి నభివృద్ధిఁ బొంద
నవని దున్నక పండెఁ జన్నవిసి పదికె
సురభులు జనంబు లానందభరితులైరి. 48

మ. కర మర్థిన్ సుతునిం గృతోపనయనుం గావించి వేదాగమా
ర్థరహస్యంబులు దెల్పి కార్ముకముఖాస్త్రప్రౌఢిమల్ నేర్పి సిం
ధురగంధర్వరథాధిరోహణసమర్థుం జేసి ధాత్రీధురం
ధరుఁ గావించెఁ గుళిందకుండు జను లానందంబునం బొందఁగన్.

క. ఆచంద్రహాసవిభుఁడు
ర్వీచక్రము ప్రజల నెల్ల శ్రీవైష్ణవమా
ర్గాచరణతత్పరులుగాఁ
బ్రోచెన్ రుక్మాంగదప్రభువుచందమునన్. 50

మ. పదియాఱేఁడుల నూఁగుమీసముల లేఁబ్రాయంబునం దండిప్రపం
ప దిగంతంబుల రాజులం గెలిచి కప్పంబుల్ వధూకాంచనో
న్మదమాతంగతురంగరత్ననికురుంబంబాదిగా సర్వసం
పదలుఁ బ్రాక్తనరేఖ మీఱఁ గొని దృప్యత్సైన్యముల్ గొల్వఁగన్.

చంద్రహాసుఁడు రాజ్యంబు చేయుట.

చ. శతమఖవైభవం డని ప్రజల్ జయ పెట్టుచు మ్రొక్కఁజందనా
...డిపదవారిరుహంబులు గాంచి విక్రమా
...గరు గ్రిక్కిరియించి కృతప్రణాముఁడై
...నియంఘ్రులకున్ బ్రణమిల్లి భక్తితోఁ.

క. జననీజనకులపాదము
లనవరతముఁ గొల్వఁ జంద్రహాసకుమారుం
గనుఁగొని కుళిందభూపతి
తను వెల్లను నిపురుచును ముదంబునఁ బలికెన్. 53

క. జాలెఁ బట్టింపుము పది
వేలు నయిదువేలు రెండువేలు నరయ సొ
న్నాలరి కుంతలునికు మన
యేలిక తన్మంత్రి యతనియింటికిఁ బనుపన్. 54

క. అనిన విని చంద్రహాసుఁడు
జనకుని వీడ్కొని ధన మసంఖ్యము బహువా
హ్యానరోష్ట్రఖరబలీవ
ర్దనివహములచేతఁ గన్ను దనియఁగఁ బంపెన్. 55

ఆ. మూఁడువగలపగిదిముకుపులు దెప్పించి
కలయ నొక్కబదరికమున నుంచి
కాంతలేశ్వరునినగరిపురోహితుఁ డైన
గాలవునకుఁ గౌతుకమునఁ బనిచె. 56

ఉ. పంచినఁ దీర్పరుల్ సచివువాలికి నేఁగి కృతప్రణాములై
కాంచనరత్నభూషణసుగంధపటావళి నేలునేల యు
ర్పించి కుళిందనందనుఁడు పెట్టినపత్రిక చూపి రాజుకుం
గొంచక దీని కేమమణుఁగుల్ గొనివచ్చితి మంచు నిచ్చినన్. 57

చ. కొని చని కుంతలేశ్వరునకున్ వివరంబుగఁ జూపి చారుల
న్మని మలరించి పంచి జననాయకుఁ డగ్గతి చంద్రహాసుఁ డి
చ్చినవివరంబు విన్నపము చేసి కుళిందకుఁ బట్ట రాజుచే
ననుమతుఁడై యమాత్యుఁడు రహస్యముచిత్తము నొత్తరింపగన్.

ఆ. తమకు మినుముడింప దళముతో డుత నాఱు
యోజనములపయిన యొక్కనాఁడె

తెరలి చందనావతీపురిముందటఁ
గాంచి యోధవరులఁ గలయఁ జూచి. 59

క. ముందఱ మహాటవి యిది యీ
సందున నమరావతీవిశంకటమహిమన్
గ్రిందుకొనిన ధారారకు
లిందునిసౌభాగ్య మని యాళీకవీర్తిల్. 60

క. అదుదేర దుష్టబుద్ధికె
దురుగఁ గుళిందకుఁడు ప్రియసుతునితోఁ జని త
చ్చరణముల వ్రాలి నిజమం
దిరమున విడియించి భక్తి నివ్వటిలంగన్. 61

క. బహువిధమనోజ్ఞవస్తుని
వహములఁ బూజింపఁ గృతికవాత్సల్యభర
పరిహాసితముఖాబ్జుఁడై చం
ద్రహాసుఁ గన్గొని కుళిందునకు నిట్లనియెన్. 62

క. చందురునివంటివాఁ డీ
నందనుఁ డతిభాగ్యలక్షణయుతుఁ డు నీకే
చందమునఁ గల్గె ననినఁ గు
ళిందకుఁ డాద్యంతము దెలియ వినిపించెన్. 63

ఉ. ఏ మృగయావినోదరతి నేఁగుచు గొంతలకంబుదండ రెం
డామడఁ గల్గు నొక్క భయదాటవిలోనఁ బదాంగుళీవ్యథన్
వేమఱు శ్రీహరిం దలఁచువీనిఁ గనుంగొని విష్ణుభక్తునిం
గా మదిఁ గాంచి యాదరమునకన్న విశేషముగాఁగ బెంచితిన్ 64

క. నాటి కయిదేండ్లవాఁ డను
మాటవిని కృతంబు దలఁచి మానసమున న
త్తోటులమీఁదను బంధులు
గీఁటుకొనుచు దుష్టబుద్ధి కృతిమబుద్ధిన్. 65

క. ఇచ్చోట నేమి దలఁచిన
వచ్చునపాయంబు దన కవశ్యము వీనిన్
బుచ్చెదఁ గౌంతలకంబున
కచ్చట మత్సుతుఁడు విషనిహతుఁ గావించున్. 66

క. అని తలఁచి యొక్క పత్రిక
తనతనయునిపేర నేకతమ్మునస్వహస్త
మ్మున వ్రాసి ముద్రి పెట్టి స
వినయుఁ డగుచుఁ జంద్రహాసవిభునకు ననిచెన్. 67

క. ఈపత్రిక నీ వొకఁడవ
నా పుత్త్రున కిమ్ము శోభనం బగు నచటన్
నీవను లన్నవినతుఁడై
వే పోయె నతండు పవనవేగాశ్వముపైన్. 68

ఆ. నిమిషమాత్రఁ గౌంతలముఁ జేరి తత్పురీ
సవిధవివిధపుష్పసౌరభప్ర
మత్తచంచరీకమండలీముఖరితా
రామమధ్యగతసరంబు గదిసి. 69

క. యువహంసచక్రసారస
నివహాగరుద్ధూపవికచనీరేజపుట
స్రవదమలమధుసురభిగం
ధవహాంకురసపదివారితపథశ్రముఁడై. 70

క. తురగమును నీరు జలజా
కరమునఁ ద్రావించి తా వికచపుష్పఫలో
త్కరభరవినమ్రచూతాం
తరమరకతవేది నలవుసం బవళింపన్ 71

◆ కుంతలేశుని కూఁతురు వనవిహారమునకు వచ్చుట. ◆

ఆ. కుంతలాధినాథు కూఁతురు చంపక
మాలినియను నయ్యమాత్యవరుని

తనయవిషయయును మదనునోమఁదద్వన
స్థలికివచ్చిరాత్మ సఖులతోడ. 72

సీ. అలసతఁజూపు నొయ్యారంపునడపులు
వనయూరముల గర్వముఁగుదింప
సఖులవేమరుఁబిల్చు సరసంపుటెలుఁగులు
మత్తకోకిలముల మనసుఁగలఁప
నిటలంబులనటించు కుటిలాలకంబులు
షట్పదంబుల విలాసములఁగెలువఁ
దరళాలోచనముల ధాళధళ్యంబులు
హరిణులసౌభాగ్య మపహసింప

తే. దండడించుమనో రథోద్ధతవిహార
సరణిఁ జంపక మాలినీతరుణిఁ గూడి
మానినులు గోసి రవ్వనమంజరులను
సరిసిసరసిజములఁ బెక్కుచందములను. 73

ఆ. సచివపుత్త్రి విషయ శారీరవాసన
వనమున గంధసారవనముఁ జేసెఁ
గళితహారమణులఁ గమలాకరంబు
రత్నాకరంబుఁ జేసెచలనగతుల. 74

క. అంగన లపుడు చతుర్విధ
శృంగారము లలవరించి చెఱకువిలుతు నో
మంగ విషయ తత్సరసీ
ప్రాంగణనిద్రితునిఁ జంద్రహాసునిఁ గాంచెన్. 75

చ. కనిరశనాంఘ్రిరత్నకటకంబులు మ్రోయకయుండ నల్లన
ల్లనఁజని యక్కుమారునివిలాసను లేఁకటవాయఁజూచి మ్రో
లనడవ నంచితాత్రిఁ బదిలం బగుపత్త్రిక వీక్షితండ్రివ్రా
సినకపటంపుఁబద్ధతికిఁ జిత్తమునం బరితాప మందుచున్. 76

క. విషమాస్త్రసమానుఁడగు
న్విష మొసఁగన్ వ్రాసెఁ దండ్రి నిర్దయుఁడని యా
వ్విషమాక్షరపంక్తిఁ దుడిచి
విషయ నొసఁగు మనుచు వ్రాసి వేడుకతోడన్. 77

క. పెన్నిధిఁ గని పోవఁగలే
కన్నకృపఁ గుమారికఁ జిత్త మూటాడఁగ నా
కన్య పరాధీనత సతి
ఖిన్న యగుచు నింటి కెట్టకేలకుఁ జనియెన్. 78

క. ఆలోనఁ జంద్రహాసుఁడు
మేలు కనుచు నపుడు తత్సమీపసరఃప్ర
క్షాళితముఖుఁడై నడఁగని
బాలెవునఁ గదల్చి నగరము బ్రవేశించెన్. 79

క. ఎడనెడ శుభశకునంబులు
పొడ గనుచును జొచ్చి దుష్టబుద్ధినగరిచా
వడికడవాకిటఁ దురగ
మ్ముడిగిం పణిహారి గని ప్రమోదముతోడన్. 80

క. కొలు వున్న మదనుఁగని చే
తులు మొగిచి కుళిందకునిసుతుఁ డమాత్యునిలే
ఖలు గొనుచు ముననగరిమో
సల నున్నాఁ డనిన విని ససంభ్రముఁ డగుచున్. 81

ఆ. కూర్మినతని నెదురుకొని కౌఁగిలించి యే
కాంతమండపమున నధివసించి
యటఁ గుళిందుసేమ మరయుచు దండ్రి వ్రా
యసముఁ జూచి భక్తి నంది యందు. 82

సీ. స్వస్తిసమస్తప్రశస్త గుణాన్వితుఁ
డవు దుష్టబుద్ధిని జాత్మజుఁ డగు

మదనుదీపించి ప్రేమముగఁ బుత్తెంచిన
శుభలేఖ చంద్రహాసుఁ డుకుళించు
పట్టికుఁ డుత్సాహ పౌరుషాధికుఁడు సి
ద్ధంబుగా మనకు నీతం డహితుఁడు
కానసందేహంబు మాని యీపత్రిక
వీక్షించె నప్పుడె విషయనొసఁగు
తే. మనెను పద్ధతిఁ జదివి భాగ్యంబు చేసె
నస్మదీయసహోదరి యనుచు దైవ
ఘటన నారాత్రిఁ గలుగు లగ్నంబు నవివా
వాహ మొనరించె దేవేంద్రవైభవమున. 83
ఉ. అంతట దుష్టబుద్ధి హృదయంబున నింతకుఁ జంద్రహాసుఁడుం
గొంతలంబుఁ జేరఁ దన కైతవముం ఫలియించు నంచు ని
శ్చింతమతిం గుళిందకుని శృంఖలబద్ధునిఁ జేసి దుర్గమా
ధ్వాంతము చూఱగైకొని రయంబున మూఁడవనాఁటివేకువన్. 84
క. అంచల బెస్తలవడి జం
కించుచు బంగారుపల్లకీ యెక్కి ప్రియా
ణించు నెడం గొంతలక
ప్రాంచలమున నొకమహోగ్రఫణి యెదురగుచున్. 85
క. మానుషభాషల నిట్లను
నే నీసదనంబులోని నిక్షేపములం
బ్రాణమువలెఁ గాచితి నీకఁ
బోనగునని చెప్పి కితలముఁ బ్రవేశించెన్. 86
ఆ. పాముమాటఁ బాటిఁబట్టక కొంతల
కంబు చొచ్చి నగరి క్రందుఁ జూచి
చంద్రహాసునకు విషయఁ బెండ్లిసేయున
వ్విధముగా నెఱింగి వీఁపువిఱిగి. 87

క. ఏనేమిచెప్పి పంపినఁ
దానేపని చేసెనని మదనుఁబిలిచి దురా
త్మా నేఁటిదాఁకఁ ద్రోయవు
గా నాయానతి నిదేమి గావించితనన్. 88

క. దేవరయానతిఁ దప్పిన
యావివరం బేదియని స్వహస్తలిఖితలే
ఖావాచకంబుఁ జూపిన
నావక్కాణంబు జూచి యున్మత్తపసగన్. 89

ఆ. మఱియుఁ దండ్రితోడ మదనుండుదేవర
యాజ్ఞఁ బ్రాణ మైనయనుజ నొసఁగి
హితజనంబు లెఱుఁగ నీతని కెడనైనఁ
బ్రాణమిత్త్రుఁడనుచుఁ బ్రతిన గొంటి. 90

క. అనుటయుఁ దనతనయునిమీఁ
ద నవిశ్వాసంబు పొడమి తనకపటములో
నన పదిలపఱచె నంతటఁ
దనజయు నల్లుఁడును వచ్చి దండనుఁ బెట్టన్. 91

క. బాలహరిణములఁ జూచిన
క్రోలుపులిగతిన్ మనంబు గుబ్బతిలఁగ మి
థ్యాలాలనములు సేయుచు
నాలవదివసంబు శోభనము సాగించెన్. 92

చ. మఱునటినాఁటివేకువ నమాత్యుఁడు మేల్కని వంశ మంతయుం
జెఱచిరికూఁతురుం గొడుకుఁజెల్లరె మీఁదటఁ జంద్రహాసుఁడే
చ్చెరినఁ బ్రమాద మౌననుచుఁ జిత్తమునందలపోసి వీనినే
తెఱఁగుననైనఁ జంపెద యతిప్రవరోక్తులు బొంకుచేసెదన్. 93

సీ. అనినిశ్చయించి బ్రహ్మఘ్నశిశుఘ్నగోఘ్నా
దులఁ బలువు రంత్యజులఁ బిలిచి

కృతపక్షతప్పఁగాచితి నేఁడుపగరంబు
వెలిపలికోటలో పలికరాళ
కాళికాభవనంబులో నీవుత్రైయుండుఁ
డచ్చోటికిపర సంధ్యాముఖమున
నొంటివచ్చినవాని గెంటిపోవఁగనీక
నఱకుండు కండతుండములుగాఁగ
తే. నట్లు చేసిన నర్ధరాజ్యంబు మీకు
నిత్తు మదనునితోఁడ నియ్యకొనుచు
నరిగి మూఁడవజామున నడఁగియుండెఁ
జండిగృహమునఁ జండాలమండలంబు. 94

— దుష్టబుద్ధి చంద్రహాసుని కాళికాగృహమునకుఁ బంపుట. —

క. ఆవేళఁ జంద్రహాసుని
రావించి కరగ్రహాంతరంబున దుర్గా
దేవి భుజించు టవశ్యము
గావున నీ వేఁగు చండికాగృహమునకుఁ. 95
చ. అనుటయుఁ జంద్రహాసవిభుఁ డట్టులకా కనె నంతఁ గుంతలుం
డు నిజపురోధ గాలవుఁగనుంగొని రాజ్యమువిూఁది కోర్కి గెం
టిసది నిజంబుగాఁ దనువునీడకు మూర్ధము గానరాదు క
న్గొనఁగ నరిష్టలక్షణము కోరిక నాకెఱిఁగింపు నావుడున్. 96
క. దత్తాత్రేయుఁ డలర్కున
కిత్తెఱఁ గెఱిఁగించె వసుమతీశ్వర వినునీ
వృత్తల మందకు మదినీ,
చిత్తసమాధాన మిపుడచేయఁగఁజాలున్. 97
సీ. ధ్రువవసిష్ఠారుంధతులఁ దనుచ్ఛాయయుఁ
గానని వాఁ డేఁటిలోనఁ గడచుఁ

గిరణాన్వితాగ్ని నిష్కిరణార్కుఁ గనువాఁడు
మఱియు నేకాదశమాసములను
బనిలేనిపని బక్కబలిసిన బొనుక చి
క్కినవాఁడు దెగు నెల లెనిమిదింట
నడుగుచొప్పనఁ బార్ష్ణిమైన వ్రేళ్ళయిన
ఖండిత మైనవాఁ డేడునెలలఁ దప్పఁ
తే. గాకిమైన గ్రద్దైన నులూక మైన
నెత్తి సోఁకిన వాఁడాఱునెలలఁ గెడయు
స్నానమర్దనవేళల మేనిచర్మ
మదరు వాఁడైదునెలలకు నంతరించు. 98

క. తననీడ వేఱె యొక
లాగున నుండిన వాఁడు నాల్గునెలలకు నీల్గుఁ
ఘనరహిత మైనమెఱుపుజ
ముని దెసఁ గనువాఁడు ద్రెళ్ళు ముమ్మాసములన్. 99

క. తనబింబ ముద్దమునఁ జూ
చినఁ దల లేకున్న వాఁడు చెల్లును రెన్నె
ల్లను దనతనువు గమరు నల
చిన పక్షములోన వాఁడు జీవము దొఱఁగున్. 100

తే. జలక మాడిన నవయవములకు మించి
హృదయమధ్యంబు జివ్వని యెండె నేని
నీరు గ్రోలిన దాహంబు నిలువ దేని
వాఁడు వేంచేయు నీరైదువాసరముల. 101

క. మనుజులలోచనములలోఁ
దనరూపముఁ గానకున్నఁ దనవీములలో

నను వ్రేళ్ళు వెట్టి చూచిన ధ్వని
వినఁబడ కున్నవాఁడు పడయకపోలి యుఁ 102

సీ. ఋక్షవానరవ ల నెక్కి పోవుచుఁ దాన
కాలునిదెస కేఁగఁ గంటి ననియుఁ
దనమూర్ధమున బొగ్గులును శిరోజంబులు
నుముకయు భక్షించు చుంటి ననియు
నగ్నుఁడై తైలసవ్యాపి నవ్వుచు మ్రోల
గంతులు వేయంగ గంటి ననియుఁ
దైల మాపాదమస్తమునందు నడియంగ
నగ్నపై నిద్రించుచుంటి ననియు
తే. నతిభయంకరమూర్తులై యస్త్రధరులు
ఆలఁగొని యువ్వి రనియును నీలిచీర
కాంత బడి దక్షిణము వోవగంటిననియు
స్వప్నమునగన్న వారికిజావుఁ ధ్రువము. 103

చ. జనవర యిట్లరిష్టములు సంభవ మైన గురుద్విజామరా
ర్చనజపహోమదానముల శాంతి యొనర్తు రొనర్చి సర్వసం
గనిరసనంబు నింద్రియవికారముఁ జేయుచు నీరు నీరుగూ
ర్చినగతి జీవునిం బరముఁ జేర్తురు తత్త్వరహస్యకోవిదుల్. 104

క. అని గాలవముని చెప్పిన
జనపతి మదిఁ బాము కుప్పసం బూడ్చువిధం
బున రాజ్యము విడువఁదలఁచి
తనమంత్రికుమారుఁ డగుమదనుఁ బిలిపింపన్. 105

క. చనుదెంచి మ్రొక్కి పని యే
మన మీ యల్లుఁ డగుచంద్రహాసుని వెసఁ దో
కొనిరమ్మటఁ జంపకమా
లిని నిచ్చెద ననినఁ గుట్మలితహస్తుండై. 106

చ. పనివిని పొ్రిద్దు గు్రింతుపరిపాటిఁ బురాంతరవీథిఁ గాళికా
ర్చనమున కొంటినేగెడిమఱందిఁ గనుంగొని మంతి్రియాజ్ఞ చే
కొని గమనించు లా గెఱిగి కుంతలనాథుఁడు నిన్నుఁ బిల్చి తె
మ్మనెఁ జను మేను నీపరిగి నర్చన చేసెదఁగాని శాంభవిన్. 107

తే. అని యతనిచేతిగంధపుష్పాక్షతములు
వరున గైకొని తా నెక్కువారువంబుఁ
జామరచ్ఛత్రిములు నిచ్చి సచివతనయుఁ
డనిపి పంపిన నాచంద్రిహాసుఁ డరిగి. 108

— కుంతలుండు చంపకమాలినిఁ బెండ్లి సేయుట. —

చ. వినతి యొనర్చి నిల్వఁబృథివీపతిగాలవసంయమీంద్రుశా
సనమునఁ జంద్రిహాసునకుఁ జంపకమాలినిఁ బెండ్లిచేసి య
ల్లునకు సమస్తరాజ్యమును లోలత నిచ్చి విరక్తుఁడై తపో
వనమున కేఁగెఁ బ్రాగనుభవక్షతసౌఖ్యము లేవగించుచున్. 109

క. అంతట మదనుఁడు నగర
ప్రాంతవనీచండికాగృహమునకు నిబిడ
ధ్వాంతమున నొంటిఁ జనఁ బశు
హంతలు పైఁబడి వధించి రాయుధహతులన్. 110

వ. ఇవ్విధంబునఁ జంద్రిహాసుండుచంపకమాలినీవివాహంబునఁ గుంత
లరాజ్యసింహాసనారోహంబునను సముత్సాహంబు నొంది వంది
బృందంబు పొగడ ముందటం గ్రిందుకొనుసందడి జడియ వారి౦
చువేత్రిహస్తులయుత్కోకసాహసానినాదంబు రోదసీభేదనంబు నంపా
దింప శంపాపరంపరానురూపదీపకలాపంబు లుద్దీపింప శచీసమేతుం
డగునాఖండలుండునుంబోలె వధూసమేతుండై పాండురమత్తవేదం
డంబు నెక్కి యక్కజం బగువైభవంబునం జనుదెంచి దుష్టబుద్ధి
నగరిముందటఁ గుంజరంబు డిగ్గి యంతకుమున్న వచోహరులవల
నం దనరాక యెఱింగి కలంగి యున్నమామకుం బ్రిణమిల్లి యత

నికిం దనవృత్తాంతంబును మదనుండు కాళికా సదనంబున కరిగిన
విధంబునుం జెప్ప నిప్పుదొ్రక్కినపోలికంబొక్కిపడి యుఁగళవళంబు
దక్కి తక్కరిపి్రయంబున నల్లునియుల్లంబు పల్లవింపం జేసి యనిపి
యయ్యమాత్యవరుం డత్యాహితంబున. 111

మ. తలయుం గోకయు వీడఁగాఁ బఱచి సంతాపంబునం గాళికా
నిలయం బొక్కఁడ చొచ్చి చచ్చినసుతు నీక్షించి శ్రీవిష్ణుభ
క్తులకుం గెంపుదలంచుదో్రహులకు యుక్తుల్ గొల్పునే యంచుఁద
ద్బలిపీఠోపల పాతభగ్నశిరుఁడై ప్రాణంబులం బాసినన్. 112

చ. బలబలవేగఁ జండిక నుపాసనచేయు తపోధనుండు దే
వాళిఁ బడియున్నమంత్రివరు నాతనిసూనునిఁ జూచి యొక్కొకో
పొలిసిరి నిక్కమిత్తమని పొక్కుచు వేచని చంద్రహాసభూ
తలపతితోడఁ జెప్పిన నతండు రయంబునఁ బాదచారియై. 113

—: చంద్రహాసుండు దుష్టబుద్ధినిఁ బ్రదికించుట. :—

సీ. కాళీగృహము సొచ్చి కూలినసచివుఁ ద
త్తనయునిఁ గని శోకతప్తుఁడగుచుఁ
గదిసి వీరల నేఁడు బ్రదికింప కుండినఁ
బ్రజలచే నాడిక పడుదు ననుచుఁ
జతురసి్రకలిత విస్ఫుర్తిహోమకుండంబుఁ
దొ్రవ్వించి పావకుఁ దవ్వలికొలిపి
శర్కరాతిలపాయస ఘృతంబులను గూర్చి
తనమేనికండలు దఱిగివే్రల్చి

తే. దేవిఁ గనుగొని చిచ్చుకత్తి వీవు హరికి
నగుట మచ్చిర మిత్తుఁ బ్రాణాహు తనుచు
ఖడ్గ మంకింప వైష్ణవి కరముఁ బట్టి
వాంఛితం బెద్ది వేఁడుము వరము ననిన. 114

క. వీరలు పద్దెదుదివసము
లీరెంటి సురక్షసేయుఁ డింతటిలోనే
వారలు రాకున్న, మఖ
ప్రారంభము వేగ కనిపింపుడ మనుచున్. 126

క. పలుకునెడఁ బార్థుసేనా
కలకలములు నిజపురోపకంఠసరణి ది
క్కుల వక్కలింపఁగా నల
బలములతో మోహరించి బాహుము నెదురన్. 127

క. శ్రీహరి సంతోషింపఁగ
నాహవ మొనరింపఁ గలిగె నర్జునుతో సం
చూహించి నృపతి రణస
న్నాహంబునఁ దత్పురాంగణంబున నిలచెన్. 128

తే. అతనిఁ గని కృష్ణుఁ డనుచింద్రి సుతునితోడఁ
జంద్రహాసునిబరమవైష్ణవునిఁ జూడు
వీఁడు జ్ఞానతపోవమోవృద్ధుగాని
కూరిసమరాంగణమునఁ దారుణ్యతనుఁడు. 129

మ. అని కృష్ణుండు కిరీటికిం దెలుపుచో నాచంద్రహాసుండుసై
న్యనికాయంబులముంగల న్వరశతాంగారూఢుఁడై వచ్చుదే
వునిఁ జక్రిని గదాబ్జహస్తు మునిసేవ్యు న్భక్తితోఁ గాంచి గ్రి
క్కున మాణిక్యరథంబు డిగ్గిచనిసాష్టాంగంబుగా మ్రొక్కినన్. 130

చ. హరియును జంద్రహాసునిఁ బ్రియంబున గౌఁగిటఁ జేర్చుచుంబురం
దరసుతుఁ జూచి నా కితఁడు నమ్మినభక్తుఁ డవధ్యుఁ డీవు సం
గరకుతుకంబు దక్కి తనిఁ గౌఁగిటఁ జేర్చు మటన్న నేఁడు నా
కురుకుల మెల్లఁ బావనతఁ గూడె నిజం బని కౌఁగిలించినన్. 131

తే. చంద్రహాసుండు నరుతోడ శమనసూను
నధ్వరాశ్వంబు మామకరధ్వజునివ

శంబు చేసితినన దురగంబుఁ గొనుచు
నతఁడు నేతెంచి మ్రొక్కెఁ గృష్ణార్జునులకు. 132

వ. తదవసరంబున రాజసమాజపూజితుండై, చంద్రహాసుండు వాసుదేవసుధామధురవాగ్విలాసంబులం బ్రస్తుతించి మహోత్సవంబున నిజపురంబునకుం గొనివచ్చి దుష్టబుద్ధి మదనపద్మాక్షసహితంబుగా సమస్తబంధునివహంబు గనిపించి కృష్ణపూజానిమిత్తంబునం జిదానందచిత్తుం డగుగాలవమునిసత్తముం బిలిపింప నయ్యోగివరుండు సచ్చిదానందమూర్తి యగు నద్దేవునిం గీర్తించి ముహూర్తమాత్రంబు తన్మయుండై యుండె కుంతలేశ్వరుండొనర్చు నర్చనల సంతసిల్లుచుఁ గంతుజనకుఁ డచ్చట దివసత్రయం బధివసించి నాలవనాఁడు కులంగసందనుండు దనకు సర్పించినరాజ్యంబునం దదీయకుమారకుల మకరధ్వజపద్మాక్షులం బట్టంబు గట్టినట్టియెడ

క. నందనులఁ జూచి పరమా
నందుఁ డగుచుఁ జంద్రహాసనరపతి యోగో
విందుని భజించి మోక్షముఁ
జెందెదఁ నాయట్లకీర్తిఁ జెందుఁడు మీరల్. 134

మ. అని దీవించుచు బుద్ధి చెప్పి చతురంగానీకినుల్ గొల్వఁ బా
ర్థునకుం దోడయి రామభూశ్వములు దోర్దర్పోద్ధతిం జొచ్చె నేభూము ల
జ్జననాథుల్ గని కప్పముల్ గొనుచు శశ్వద్భక్తి సేవింప వా
రనివేగంబునఁ దేజు లుత్తరసముద్రం బుద్ధతిం జొచ్చినన్. 135

ఆ. అపుడు సకలనృపులు నంబుధిసాధించు
వెరవు దెలియలేక విహ్వలింప
హరి మయూరకేతనార్జునప్రద్యుమ్న
హంసకేతుకార్ష్ణు లగ్ను లగుట. 136

క. ఆయేపురి యాదవులకు
నేయెడ నడ్డంబు లేమి యెఱిఁగి దరి మహీ

నాయకుల నిలిపి తా న
త్తోయధి వెస నమ్మహాంబుధులతోఁ జొచ్చెన్. 137

క. మకరాలయ మటు సొచ్చి వె
దకి యొండొకదీవి జీర్ణతరఘనవటప
ర్ణకృతావకుంఠనుం డగు
బకదాల్భ్యుం గనియె వరతపఃప్రాగల్భ్యున్. 138

క. అందఱు నచ్చోట నిజ
స్యందనములు డిగ్గి మ్రొక్కి సంయమి మదిలో
నిందులకును హరి యెక్కడి
సందడి గొనివచ్చె నని యసహ్యపడంగన్. 139

మ. నరుఁ డత్తాపసుఁ జేరి కేల్మొగిచి వింతల్ నీశరీరంబునం
దిరుగం బుట్టలువెట్టి సర్పములు నర్తింపన్ దరుల్ జానుకూ
ర్పరదేశంబులఁ బుట్టి గూండ్లశకుంతవ్రాతంబు వర్తింప నీ
కరయన్ వాసము లేక నీచివికిమూత్రా కేమిప్రాపయ్యెనున్. 140

తే. అనినఁ బార్థునిఁ గని పల్కు మునివరుండు
సంగ మతిదుఃఖ మని బ్రహ్మచర్యమున్న
నాకుఁ జాలదె యింతె మూత్రాకునీడ
యాయు నల్పంబు గృహ మేమి సేయ ననిన.

మ. బలభిత్సూనుఁడు విస్మయాత్ముఁడగుచున్ బ్రాయంబు నీకెంత ని
ర్మలచారిత్ర యనంబహోధనుండు సుతాత్మాత్మజుల్ జూచి లె
క్క లెఱుంగన్ మృతులైరి రోమశులమార్కండేయులం బేర్కొనన్
నలువల్ వింశతిసంఖ్య లేనెఱుగ నంతం బొంది రీసందునన్. 142

సీ. కంనిధు లేకోదకం బైన నిచటికి
వెల్లివెంబడి వచ్చు వేల్పునగర
మాసమయమున శాఖాసహస్రాజాండ
పూర్ణమై యొకమఱ్ఱి పొదలుచుండు

నందు నేకదళంబునందుఁ జక్కనిపిన్న
బాలకుఁ డొక్కఁడు పవ్వళించుఁ
గోమలతరదాంగుష్ఠంబు చిబుకుచు
నెడనెడ నవ్వుచు నేడ్చుచుండు
తే. వటనిదర్శనమున విలయార్ణవమునఁ
నుడివడక సంచరింతు నాసుద్దు లేల
నాఁటిపిన్నారిఁడీయదునందనుండు
నరవి మిముఁ బాడి తిరిగ యాచంద మయ్యె. 143
క. బాలకుఁడు తొల్లి యిప్పుడు
దా లక్ష్మిం బొంద్లి యాడి తనయులఁ గని యా
త్రైలోక్యగృహస్థుండై
కాలెడు నని కృష్ణుఁ బిలిచి కౌఁగిటఁ జేర్చెన్. 144
తే. మదనజనకుండు మునికి నమస్కరించి
వింశతిబ్రహ్మకల్పసంవీక్షణుఁడవు
గాన విష్ణుండ వీవు నీకతన ధర్మ
పుత్త్రమఖమింక సఫలతఁ బొందు ననిన. 145
క. ఈగతి ననుమతి యిచ్చి మ
హాగర్వభరంబు నెట్ట నగునే నీకున్
వాగీశ్వరుగర్వంబును
నాగర్వ మడిగినకథ వినవె నీ వనుమన్. 146
తే. పద్మకల్పంబునం దొక్కపద్మభవుడు
రాజహంసంబు నెక్కి యగ్రమున నిలిచి
చింపిమఙ్ఞాకుచాటునఁ జివికి తపము
చేసి బడలక వేఁడు వాంఛితము లనిన. 47
క. ఆతనిఁ గని యే నెఱుఁగ వి
ధాతలు చని రిరువదిటఁ గృతముకడపట నీ

చేతివరముఁ గొనుకొంటు నె
యూతప మని నవ్వ నప్పు డిరువురనడుమన్. 148

మ. ధరణీచక్రము ప్రక్కలించు కొకయుత్పాతోగ్రవాతంబు ని
ర్భరవృత్తిం జనియించి వేలోకమహాబ్రహ్మాండభాండంబులోఁ
జూరు గాకల్వలెఁ బాఱవై చుటయు నచ్చోనొక్కపద్మాసనుం
డిరునాల్గోములవాఁడు మమ్ముఁ గని మీ రెవ్వారుపూర్వంబనన్

మ. చతురాస్యుండను సత్యలోకనిజవాస్తవ్యుండ నాశిష్యుఁ డీ
యతివర్యుండన నవ్వి నాయెదుర నీవా బ్రహ్మనే నంచుఁ బ్రే
లిత నీశిష్యుఁడు నీవు నాయుడిగముల్ సేయుండు నాఁదన్మరు
ద్గతి నాతఁడును నేము వేఱొకబ్రహ్మాండంబునన్ డ్రెళ్ళినన్.

సీ. అచ్చోట సుకృతులు నతివదాన్యులు నైన
పురుషులు మమ్ము ముప్పురను జూచి
యెక్కడివారు మీ రేలోకమున నుందు రనిన ని
న్నిట్లనియె నయ్యష్టముఖుఁడు
బ్రహ్మలోకంబు మద్భవనంబు వీరు నా
శిష్యులు నే సరసీజభవుఁడ
నన వారు షోడశాస్యవిరించి ఁ గనిపింప
నతఁడు గర్వమున మమ్మట్లపలుక

తే. నెత్తుకొని యమ్మహావాయు వేమిచెప్ప
నశని మమ్మును ద్వాంత్రింశదాస్యధాత
లోకమున వైచె నిటు దూలుచుఁ
గ్రమక్రమమునఁ బలువురు పద్మసంభవులతోడ. 151

క. చని కడపట ననకసనం
దనమునిసేవితుని వేయితలలవిధాతం
గన నయ్యధోక్షజుండే
పని కిట వచ్చితిరి మీకు భద్రమె యనుచున్. 152

క. మీకృపకారణముగ నీ
లోకమ్ముల నిలుతు నని పలుక నందఱు నా
లోకభవులు మన ముడిగి వి
వేకమతిన్ మెచ్చి పెక్కువినుతులు సేయన్. 153

తే. ఆసహస్రనయుఁడు వారి నాదరించి
కమలజుల నెల్లఁ దత్తత్పదముల నిలిపె
నాఁటనుండియు నిచట నున్నాఁడ నేను
వారిరుహనేత్ర గర్వ మెవ్వరికి మేలు. 154

మ. అనఁ గృష్ణాబ్జపదాత్ముఁ జొక్కుచు మునిం బ్రార్థించి యయ్యాశ్రమా
వనివర్తించుహయంబులన్ గొనుచు నవ్వాచంయముం గొల్చివా
రినిధిన్ వెల్వడి రాజలోకము పరిహర్షింప న్నిరాఘాటతం
జనిపై త్రోవ జయద్రథాత్మజునిరాజ్యం బేపునం జొచ్చినన్.

క. చారులచే గాండీవి మ
హారథికులతోడ వచ్చె నని విని గుండెల్
నీరై సైంధవ తనయుఁడు
పోరోలగ ముండి బిట్టుపిఱువడి చచ్చెన్. 156

చ. తనయునిఁజూచి దుస్సలపదంబులు తొట్రుపడంగ నేడ్చుచున్
దననగరంబు వెల్వడి పృథాతనయుండనిలోన మున్న నా
పెనిమిటిఁదుంచి యిప్పుడిదె బిడ్డనిఁజంపె ననాథఁ గావవే
ననుగృపనంచు, గృష్ణుచరణంబులపైఁబడఁ బార్థుఁడత్తఱిన్. 157

క. అరదము గుప్పున డిగ్గి సో
దరికిం బ్రణమిల్లి నలఁకు తనయవియోగా
తురత మనపాలిటికి నీ
హరి గలఁడు కృపాసముద్రుఁ డడలకు మనుచున్. 158

క. అంబుజనాభునిఁ గొల్చి ర
యంబునఁ బురి కరుగుదెంచి యాస్థానములో

నం బొలిసి సుతు శౌరి క
రంబున నిమురంగ లేచి ప్రణమిల్లుటయున్. 159

క. సభవారందఱు నాశ్చ
ర్యభరితులై మున్ను ద్రుపదరాజసుతకు నీ
వభిమానము గాచిన భ
క్తభయత్రాతవుగదా గదాధర యనుచున్. 160

సీ. కృష్ణార్జునులకు మ్రొక్కి నుతించి బహుగీత
వాద్యనృత్యములతో వైభవములు
సేయించి రవుడు కౌంతేయుండు సుతసమ
వ్రతమైన సోదరి కతిముదమున
దంతావళాశ్వరథములు మున్నుగఁగల్గు
ధనమసంఖ్యం బిచ్చి ధర్మతనయు
యజ్ఞంబుఁ జూడరమ్మని వేఁడుకొని వారిఁ
గదలింపనేఁచు దగ్గఱుట దెలిసి

తే. వారువంబుల స్వేచ్ఛావిహార ముడిపి
కంసమథనుండు రాజలోకంబుఁ జూచి
ధర్మజుం డసిపత్త్రవ్రతంబు బడలి
నలువుచున్నాఁడు కూర్చి కాననమునందు 161

క. తురగములఁ గూర్చికొని నృపు
లరుదెంచు నిశాముఖంబు నప్పటికి నిదా
పరిణామస్థితులు యుధి
ష్ఠిరులకు నే నరిగి తెలియఁజెప్పెదననుచున్. 162

◆ కృష్ణుండు దానొక్కరుండు కరిపురంబు ప్రవేశించుట. ◆

చ. కరిపురిచేర నేఁగి కుతుకంబునఁ దన్నికటస్థజాహ్నవీ
సరిదుపకంఠనిర్మితవిశంకటకాంచనరత్నమండపాం

తరమున సంయమీశ్వర సనాథుని ధర్మతనూజుఁ గాంచి య
మ్మురమథనుండు నెయ్యమున మ్రొక్కి ప్రమోదముతోడనిట్లనున్.

క. జననాథ నీపరితాపం
బునకును నవ తెద్ది సకలభూపాలుర స
ల్లనగెల్చి హయముఁగొని నీ
యనుజన్ముఁడు వచ్చెనిదె మహావిభవముతోన్. 164

ఆ. అని మరాళకేతుఁ డాదిగానకలరా
జన్యవరుల ఘోరసమరవిధము
జలధిలోనఁ దపము సలిపెడుబకదాల్భ్యు
దెచ్చుటయును వరుసఁ దలియఁజెప్పి. 165

వ. అచ్చటంబరివేష్టించినశిష్టజనంబులకుం గుశలపరిప్రశ్నపూర్వకంబుగా నమస్కరించి కుంతికిందల్లులకుం బ్రణమిల్లి తనకు మ్రొక్కినభీమ మాద్రేయ సుభద్రాద్రౌపదుల నాదరించి వృకోదరసహితంబుగా నిజగృహంబునఁ బ్రవేశించిన రుక్మిణీసత్యభామాదిభామాజనంబుల యుల్లంబులు పల్లవింప నక్కపటపల్లవుం డించుకవడివినోదించి మణిమకరతోరణపట్టపటధ్వజవితానధూపధూమంబులం బురంబు శృంగారింప నియమించి ధర్మజానుమతంబునఁ బౌరజనబంధు పురోహిత వారవధూజనంబు లర్హపరికారంబులం గదల భీమాదియోధవరుల తోడం జతురంగబలసమన్వితుండై బకదాల్భ్యు నెదురుకొనువేడుకం గదలి నిరర్గళసౌరభోద్గారివిహార వనీసమీపంబున నర్ధచంద్రవ్యూహంబు వన్నించి నిలిచె నంతట భానుమంతుం డపరసరస్వంతంబుచెంత నిలిచె.

సీ. సురభిచంపకతైలపరిషేచనోజ్జ్వల
త్కరదీపికాపరంపరలతోడ
నభినవాంబరపుష్పహారాంగరాగశృం
గారితరాజలోకంబుతోడ

మందరమంథాన మథితాంబునిధిఘుమం
ఘుమితనాసీర సంకులముతోడ
నిబిడాంబుధరగర్భ నిర్భేదనారంభ
చటులమాణిక్య ధ్వజములతోడ
తే. హాటకాసక్తమణిశిబి కాదిరూఢుఁ
డై నబకదాల్భ్యుతోడ మాద్యత్కరాళ
పవనహయములతోడ గాండీవధరుండు
కౌతుకముతోడ హస్తినఁ గదిసెనపుడు. 167

తే. ఎదురుకొని పౌరభామిను లింద్రసుతుని
మౌళిపైఁ జల్లుక్రొవ్విరుల్ మానికములఁ
గ్రమ్ముకొని యమ్మహాస్థలి గంధవతియు
రత్నగర్భయు ననుట సార్థకముచేసె 168

క. బకరవైరిముఖ్యు లర్తిఁ
బకదాల్భ్యమునీంద్రు పాదపద్మములకు వే
డుక మ్రొక్కి యపుడు సైన్య
పరికరంబులఁ గలసి కరిపురము సొచ్చుటయున్. 169

క. భూపాలకులందరు వివి
ధోపాయనహస్తులై యనూనక్రీతు దీ
పావరుఁ డగుధర్మతనయు
శ్రీపాదంబులకు నెరఁగిరి ప్రమోదమునన్. 170

ఆ. అపుడు విదుర ముఖ్యులై సబాంధవసము
త్కరముతోడ నోలగమున నున్న
యాంబికేయునకుఁ బ్రియంబున నెఱిఁగించెఁ
శౌరి వరుసతోడ సకలనృపుల. 171

సీ. ఇతఁడు నీలధ్వజుం డీశౌర్యనిధి పుత్రి
స్వాహాకు మగఁడు నై శ్వానరుండు

బభ్రువాహనుఁ డితండు పార్థుని బ్రదికించె
రణములో జీవదరత్నమునను
జంద్రహాసుండు విస్మయచరిత్రుం డితం
డలిగినఁ బంకించు రమగునైన
బక్కాకేతనుఁ డీనృపాలుఁ డే నడిగిన
నగ మిచ్చెఁ దనువు నిశ్శంకఁ గోసి
తే. యితఁడు హంసధ్వజుఁడు వీనిసుతులశిరము
లాజిరుద్రుండు ధరియించె హారములుగ
వీరవర్మ జనువిహూను వీరియట్ల
యొకరికిని నొక రధికు లీయున్ననృపులు. 172
చ. అని వినిపింప నప్పు డమరాధిపసూనుఁడు వచ్చి ధర్మనం
దనునకు నమ్రుఁడై కెలవునన్ భజియింప ముదశ్రుపూరలో
చన యయి కుంతి క్రీడి బహుశస్త్రగణవ్రణితాంగముం గరం
బున నిమిరెం దనుం గదిసిమ్రొక్కినకర్ణజుఁ గౌఁగిలించుచున్.
ఉ. ద్రౌపది యోషధుల్ గొనుచురా ననుయాయిమురారిముఖ్యనా
నాపృథివీశ్వరుండు యమనందనుఁ డధ్వరభూమి శుద్ధిగాఁ
బాఁదొడంగె నాఋవృషభంబులఁ బూనిచమేటినాఁగటం
దాపసగోటమంత్రిపఠసంబులతోఁ జనుదేర నత్తఱిన్. 174
క. అదీక్షితు మణికుంభ
స్వాదువిమలగంధసారసలిలంబులఁ గుం
తీదేవకీయశోదలు
నాదరుతై చేసి రప్పుడభిషేకంబుల్ 175
ఆ. తొలుత నొనుమనూటతొమ్మిదిపైఁ డిట్టి
కలనుపక్షుహూపు గా సమర్చి
యిట్టు లొకటి కొకటి కినుమడిసంఖ్యగా
గరుడవేదిపంచకంబు దీర్చి. 176

సీ. శాస్త్రోక్తి నిష్టకాచయనంబు చేసి య
ష్ట ద్వారసదనమండపము సల్పి
కనకంపుటిటికలఁ గట్టించి వివిధర
త్నవితానతోరణధ్వజము లెత్తి
బదరిబిల్వపలాశబహువారయూపంబు
లాఱునై దును నైదున్నైదు నిలిపి
స్రుక్స్రువోలూఖలజుహూధ్రువులు మొదలైన
యజ్ఞసంభారంబు లలవరించి
తే. వింశతి బ్రహ్మకల్ప జీవితు వివేక
పారగుం డగుబకదాల్భ్యు బ్రహ్మఁజేసి
యాగమరహస్యనిస్సంశయకీర్తియూతి
చతురు సాత్యవతేయు నాచార్యుఁజేసి. 17

ధర్మజుం డశ్వమేధంబు గావించుట.

వ. వసిష్ఠ వామదేవ రోమశ సుమంత గాలవ కపిల సౌబరి భరద్వాజ భాగురి రైభ్య జమదగ్ని జతుకర్ణ కౌండిన్య గౌతముల ఋత్విజులుగా వరియించి అరుణి పులహోమమన్యు విశ్వామిత్ర మధుచ్ఛంద విభాండక ధౌమ్య వామభక్తుల రక్షోఘ్న మంత్రంబులు పఠియించుచు బహిర్ద్వారంబుల నుండ నియమించి ధర్మనందనుండు మృగశృంగధరుండును రురుచర్మవసనుండును గుశాసనుండును నై యున్నసమయంబునఁ బరాశరాత్మజుండు రాజలోకంబు నవలోకించి మీరు కళత్రసమేతులై జాహ్నవీపవిత్రోదకంబుల నజాతశత్రునభిషేకింపవలయు నని సూర్యాత్రేయులు నరుంధతీవసిష్ఠులును రుక్మిణీకృష్ణులును హిడింబాభీమసేనులును సుభద్రార్జునులును మాయావతీప్రద్యుమ్నులు ఉషానిరుద్ధులును ప్రభద్రావృషకేతులును నీలావతీమయూరధ్వజులును ప్రభావతీయౌవనాశ్వులును సుబాహులకేతులును ధర్మిల్లానుసాల్వులును మొద

లుగాఁ జతుష్షష్టిదంపతులు బద్ధపల్లవకలశంబులు గొనుచు మంద మందగమనంబునఁ గదలి ముందటఁ గ్రందుకొని గీతవాద్యనృత్యంబులు బెరయ గజాధిరూఢలై విప్రకన్యలు చల్లుమౌక్తికంబులు నెరయ మునిపఠితవేదమంత్రంబులు మొరయఁ గుంతిదేవకీ యశోదలం బురస్కరించుకొని యరుగునవసరంబున. 178

క. నారదుఁడు సత్యభామా
గారంబున కరిగి పూజ గైకొని హరి నీ
కూరిమిప్రియుఁ డందు నిపుడు
దా రుక్మిణి కిచ్చెఁ బెద్దతన మెట్లనినన్. 179

శా. రాజన్యుల్ సకళత్రులై యరుగుదేరం జామరచ్ఛత్రవి
భ్రాజిష్ణుం డగుకృష్ణుఁ గూడుకొని దాంపత్యంబునన్ రుక్మిణీ
రాజీవానన యేఁగ నీచనవు వ్యర్థం బయ్యెఁ బొమ్మన్న స
త్రాజిత్పుత్త్రియునుం దను న్మఱచునే ప్రాణేశ్వరుం డయ్యెడన్.

క. అని తనకేళీసాధం
బున నున్నమురారిఁ జూప ముని విస్మితుఁడై
వనజోదరుఁ డెయ్యెడ లేఁ
డని కొనియాడుచు నిజేచ్ఛ నరిగెన్ బిదపన్ 181

తే. మేలములతోఁ జతుష్షష్టిమిథునములును
బద్ధచేలాంచలంబులై పరిసవగంధ
పూజితస్వర్ణకుంభసంపూర్ణ జాహ్న
వీపవిత్రోదకంబులు వేడ్కఁ దెచ్చి. 182

సీ. శుభతూర్యరవము భూనభములఁ బూరింప
విహితమంత్రములు ఋత్విజులు చెప్ప
మఖవాహమునకు హేమకటాహమునఁ బోసి
యమసూతి కభిషేక మాచరింప
బూతాత్ముఁడగుధర్మపుత్త్రుఁడు పరమసం
యమివరేణ్యులపదాబ్జములు గడిగి

కనకాసనము లిడి కౌశేయగంధమా
ల్యభూషణముల నలంకరించి
తే. యుక్తదక్షిణ లర్పించి యూపబద్ధ
హయముఁ బాంచాలియును దాను నర్థిఁ బూజ
చేసి వలగొని వహ్నిరోచిర్ముఖమునఁ
జెంది గంధర్వలోకంబుఁ జేరు మనిన. 183

క. సాభిప్రాయత నదిప్రో
ధాభినయముఁ జూప ననులుఁ డశ్వహృదయత
త్త్వాభిజ్ఞుఁ డగుట ధర్మజ
నూభవునకు విన్నవించెను విచిత్రముగాన్. 184

తే. క్రతువులకు నెల్ల హరి కర్మ కరుఁడు గామి
స్వర్గఫలమాత్ర మిపుడు సాక్షాత్కరించి
శౌరియున్నాఁడు మామకాస్యమున ననుచు
సభికులకుఁ జెప్పె ననఁ గృష్ణసహితఋషులు. 185

మ. క్రతుగంధగ్వము మంత్రపన్నముల సంస్కారంబు గావించి ది
వ్యతపోగణ్యుఁడు ధౌమ్యుఁ డాహయము సవ్యశ్రోత్రకోణంబు పీ
డితముం జేయఁ బయఃకణప్రకర ముద్దీపంబుగాఁ జూచి వి
స్మితులై పాండవముఖ్యు నధ్వరసభాసీనుల్ ప్రశంసింపఁగన్. 186

క. మారుతి పురోధయనుమతి
దోరసిచే హయముశిరముఁ దునిమిన నది యు
ద్ధారణి బడక దివికిఁ దే
జోరూపముతోడ నెగసి సూర్యునిఁ గలసెన్. 187

క. మురహరుఁ డత్తురగకళే
బరము విశసనంబు సేయఁ బటుతర మగు నా

హరితేజము హరిఁ గలసెను
గర మరుదుగఁ బలలరాశి కప్పుర మయ్యెన్. 188

క. మును లయ్యపఘనసారము
ఘనసారం బైనఁ జిత్రకర మిది కుంతీ
తనయాగ్రణి నీభాగ్యం
బున కెయ్యది మేర యనుచుఁ బొగడుచు నుండన్. 189

క. ఆహయకర్పూరము ప్రథ
మాహుతిగాఁ జేసి స్రువము నాచార్యుఁడు కౌ
తూహలమున నిందాప్రియు
స్వాహా యనఁ జేయి సాఁచి శతముఖుఁ డందెన్. 190

సీ. అట్లు వేదవ్యాసుఁ డాహుతు లొసఁగఁ
బర్యాయంబున నిలింపు లందుకొనిరి
యాహోమమున సచరాచరత్రైలోక్యమునఁ
జాల సంతృప్తి పొదలె నపుడు
సురభి పురోడాశసోమపానములఁ
నానందించె ఋత్విగ్గణంబు వరుస
యమతనూభవుఁడు పూర్ణాహుతి వేల్చి
బాంధవులతో నవభృథస్నాన మాడ

తే. సోమయాజులఁజూచి కృష్ణుండు నగుచుఁ
గదిసి యందంద బిగియారఁ గౌఁగిలించె
నాయరుంధతి యనసూయ లాదియగువ
ధూజనం బిచ్చె వివిధనీరాజనములు. 191

తే. మాని బకదాల్భ్యునకు రత్నమయవృషంబు
దాన మిచ్చి పరాశరాత్మజున కఖిల
వసుధ యాచార్యదక్షిణ యొసఁగ నతఁడు
తిరుగ నమ్మహిధన మిచ్చె దీనులకును. 192

చ. అరదము సింధురంబు హయయూథచతుష్టయము భారమర్థము
స్వరిదశకంబు గోశతము నాలుగుమాసలుము స్త్రీయంబులున్
గురుకులపాళి ఋత్విజులకున్ బ్రతిహారుల కర్థ మిచ్చి యం
దఱకు దదర్ధమున్ ధనము లన్యసదస్యుల కిచ్చె దక్షిణల్. 193

తే. కోటిసాన్నాలు దశశతఘోటకములు
వారణశతంబు నొక్కొక్కవరుసతోడవు
లిచ్చె వేర్వేఱ నృపతుల కిందు రెట్టి
యాదవుల కెల్ల నర్పించె నాదరమున. 194

క. అనిలసుతపార్థమాద్రీ
తనయులు మన్నించి బహువిధము లగుమణిమం
డనముల రుక్మిణి మొదలగు
వనితలఁ బూజించి రధికవాత్సల్యమునన్. 195

చ. అతులితభక్తిఁ గృష్ణుఁ గనకాసనసంగతుఁ జేసి రత్నసం
తతుల నలంకరించి యమనందనుఁ డర్మిలి ధారవోసెఁ ద
త్క్రతుఫల మమ్మహాత్మునికరంబున నప్పు డనల్పకల్పక
క్షితిరుహపుష్పవృష్టిగురిసెన్ మొరసెన్ దగదివ్యదుందుభుల్. 196

చ. మఖపరిపూర్తిఁ గన్గొని సమస్తజనంబులు నుబ్బి వేనవేల్
ముఖముల ధర్మనందనుఁ బ్రమోదమునం గొనియాడి రప్పు డ
య్యఖిల నృపాలకోటికి మహార్ఘులకుం దనపాకచాతురీ
సుఖ మెఱిఁగింప గంధవహసూనుఁడు విందని చెప్పె నేర్పునన్. 197

క. బిరుసింతగాక నడిమికి
మురియక ననుబ్రోయివడిచి ముడుఁ బొఱక యే
బెఱికియును లేక మిక్కిలి
గరగర నగు నేలుబ్రోలికలమాన్నంబుల్. 198

చ. సరములరీతి గ్రొన్నెలలజాతి బిసంబులభాతిఁ బద్మకే
సరములభంగిఁ దారకలసంగతిఁ దార్పులమాడ్కిఁ బుష్పమం

జరులవిధంబునన్ మణులచాడ్పునఁ బెక్కులుగంధతైలపా
కరచితముల్ విచిత్రములు కమ్మనిసైఁదపుఁబిండివంటలున్. 199
ఆ. పత్త్రపుష్పమూలఫలశలాటువులచే
బహువిధములశాకపాకములును
భిన్నరుచులు గానిపింప నిమేషమా
త్రంబులోన నాయితంబు సేసె. 200
క. పరిపరిధూపంబుల నర
విరులతెరల రత్నదీపవితతుల నూర్ణా
స్తరణములఁ బొలుచుతావులఁ
బరమఋషులు నృపులు వరుస బంతులు సాగన్. 201
తే. పసిఁడియొడ్డనలను మించుపద్మరాగ
భాజనంబుల వడ్డించుబహుపదార్థ
వితతు లమరెను మేరుసంగతసహస్ర
కరునిఁ బొదివినచిత్రమేఘములకరణి. 202
క. అత్తఱి షడ్రసయుతము
ల్చిత్త మలర భక్ష్యభోజ్యలేహ్యాదికముల్
మత్తచకోరాక్షు లిడం
గుత్తుక బంటిగ భుజింపఁ గొందఱుతపసుల్. 203
సీ. చింపివల్కలము లేమిచేసెడి దనఁ
గావు నెఱవైనకండమండెఁగలుగాని
తెగినజందెము లేల తెచ్చెద రనఁ గావు
వినుఁ డివి సన్నసేవియలుగాని
యౌదుంబరము లనర్ఘ్యము లొల్ల మనఁగావు
నమలిచూడుఁడు మోదకములుగాని
ఫేనపుంజము లేలపెట్టెద రనఁ గావు
నీపాదమాంచ ఫేనికలుగాని

తే. యంచు వాచంయములు నల్కు నబ్జముఖులు
నగుచునొడఁబడఁజెప్పరందరుయథేష్ట
రుచుల భుజియించి వార్చి కర్పూరవిటి
కాసుగంధపరిపూర్ణసౌఖ్యములఁ దనిసి. 204

క. అనిలజునిఁ బెక్కుభంగులఁ
గొనియాడుచు సవనవాటిఁ గొలువున్న కేశిక్
జను దెంచిరి దమలోపల
నెనయక కలహించుకొనుచు నిరువురువిప్రుల్. 205

క. ఆవిప్రు లపుడు ధర్మజు
దీవించి వివాద మొకటి తీర్పనగు ననన్
నీవాదము దీర్చెదరు స
భావరు లీయరుశిపులహా బకదాల్భ్యులనన్. 206

తే. వినుఁడు నే యజ్ఞశర్మ నివిష్ణుశర్మ
చేత నొకవృత్తిఁ గొంటి నాక్షేత్రమిపుడు
దున్ననం దొకనిక్షేప మున్నఁ దన్ను
బిలిచి కైకొను మన్న నొప్పించుకొనఁడు. 207

క. వావిష్ణుశర్మ యిట్లను
నేవృత్తిక్రియంబునకును నిచ్చినపిదపన్
నావిత్తమె ధర్మమెఱుఁగఁ
డివెఱ్ఱి యటన్న వెన్నుఁ డిట్లనె నగుచున్. 208

క. తెగ దిప్పుడు మూన్నెల్లకుఁ
దగ వమగఁగ రండు దీర్చెదను బొండు వృథా
జగడింపకుఁ డనవారలు
నగరికె నిక్షేప మొప్పనముచేసి చనన్. 209

మ. యమసూనుం డనుఁ గృష్ణుఁజూచి బకదాల్భ్యవ్యాసకణ్వాదసం
యము లుండన్ దెగుఁదె పు సేయ కిటులేలా వారిఁ బొమ్మంటివ

ష్ఠ ముకుందుం డను నీపముఖమున నానాసౌఖ్యగోష్ఠీ వినో
దములన్ బొద్దులు పుచ్చ నెక్కడివివాదం బంచు నట్లంపితిర్.

క. అంతఁ గలియుగము చొరనీ
శాంత ముడిగి వారు మగుడ జగడింప ధరం
బంతయును బంచియిచ్చెద
నంతియకాదు విను కలియుగాచరణంబుల్ 211

సీ. ఆమ్నాయపథవిహీనాచారముల చేతఁ
బరిబలు నన్యోన్యవైరముల చేత
నన్యాయవర్తను లైన రాజుల చేత
సమకొన్న దుర్వ్యసనముల చేత
ధర్మపత్నీ నిరాదరకృత్యముల చేతఁ
బరిభవించు వేశ్యాభిరతుల చేతఁ
బరధనపరదారహరణబుద్ధుల చేత
నలమినఘోరమోహముల చేత

తే. జాలికాదుల చేత దూషకుల చేతఁ
బల్లదుల చేత వంశనాపకుల చేత
డాంబికుల చేతఁ బచ్చిబండగుల చేతఁ
గల్లరుల చేత దర్పించుఁ గలియుగంబు 212

క. సారది ననాచారంబుల
మురు వగుచుం బరిథమపాదమునఁ గలిమహిమం
బెరుగును వన్నును గలిపిన
కరణిన్ వర్ణాశ్రమములు కర్తరి గలయున్. 218

క. ఆసమయంబున ధర్మజ
నే సోమకులంబునను జనించి కుటిలులన్
శాసించి ధరణి పాలన
చేసెదఁ దగ నాళ్వినారసింహాఁడ నగుచున్. 213

చ. అని వినిపించి శౌరి శమనాత్మజుఁ డర్మిలి నిచ్చుపూజ గై
కొని సకుటుంబుఁడై నృపతికోటి భజింపఁగ ద్వారకాపురం
బున కనురక్తితో నరిగి పూర్వపదంబుల నిల్పె రాజులన్
జననుతుఁ డాయుధిష్ఠిరుఁడు సర్వధరిత్రియు నేలె నున్నతిన్. 215

మ. అనువారంబు నజాతశత్రుహయమేధారంభముల్ యావనా
శ్వనృపాలాదిమహీశవర్తనములున్ సద్భక్తిఁ బాటించి వి
న్నను రామాయణభారతశ్రవణకన్యాగోసహస్రక్రమా
ధనదానాధికపుణ్యముల్ దొరకు మర్త్యశ్రేణికి శాశ్వతమున్. 216

క. ప్రేమమున శ్రోతవక్తకుఁ
జామీకరహయము ధవళచామరములు నా
నామణివిభూషణంబులు,
గ్రామముఁ గృపసేయవలయు గ్రంథసమాప్తిన్. 217

క. అని జైమిని వినిపించిన
జనమేజయజనవిభుండు సంతసమున న
మ్మునివరుని గారవించుచు
వినిమెం దరువాతికథలు వేడుక నరుచున్. 218

సీ. నీకును మల్లమాంబకుమారునకు
సోమకులాంబునిధిపూర్ణిమావిధునకు
భరతకీర్తికిఁ దులాపురుషాదిదానాంబు
జంబాలితాస్థానసౌధునకును
బరరాజభీకరధరణీవరాహున
కాత్రేయగోత్రపవిత్రునకును
గుండయనరసింహమండలేశ్వరునకు
నభ్యుదయపరంపరాభివృద్ధి
కరముగా భారతీతీర్థగురుకృపాస
మేతుఁడు సత్కవీంద్రసఖుఁడు

కుకవిమల్ల కపోల్లసత్కులశహస్త
పల్లవుఁడు చెప్పెఁ బినవీరభద్రసుకవి. 219

శా. గౌళీమానసరాజహంసకుకురీకందర్ప చోళీకపో
లాలంకారశకీకరార్పితవిలాసాకల్పలాటీకళా
కేళీకౌతుకమాళవీమధుర సంగీతాదరస్వాంతనే
పాళీకుంకుమపంకిలి ప్తకుచకుంభన్యస్తహస్తాంబుజా. 220

పాదభ్రమకము.

క. వీరవరకైరవరవీ, సారసభరసౌధయూథసౌరభసరసా
వారణరథ్యరణరవా, తారభవనతానమానతానవభరతా. 221

మత్తకోకిల. శర్వరీశకులావతంస యశఃప్రతాపవిభూషణా
గర్వితాహితరాయమీసరగండభీకరవిక్రమా
పూర్వవిశ్వవసుంధరాభృదపూర్వదిక్తటహారకా
నిర్విశేషగిషానుబంధురనిత్యసత్యగుణోదయా. 222

గద్యము. ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్రగాదయామాత్యపుత్ర వినయవిద్యాసముద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్రప్రణీతంబైన జైమిని భారతంబునం దశ్వమేధ పర్వంబున సర్వంబును అష్టమాశ్వాసము

సంపూర్ణము.





## మనసు ఫౌండేషన్

### పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 109 B 116 |
| పుస్తకం పేరు | జైమిని భారతము. |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 295 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | KDaveed |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |